

# మీరు కొత్త బెస్టో వాడి చూసారా?

ఇప్పుడు ఓ సరికొత్త నీలి డిటర్జంట్ పౌడర్—
గోద్రెజ్ వారి కొత్త బెస్టో! మామూలు వాషింగ్
పౌడర్ల కన్న పూర్తిగా వేరైనది. ఎలా అంటారా?




1. మితంగా నురుగు నిచ్చే బెస్టోలో హానికరమైన వాషింగ్ సోడా ఏ మాత్రం లేదు. అంచేత:

అ) బెస్టో నీటిలో కలిస్తే, ఇతర పౌడర్లలాగా జిగట జిగటగా అన్పించదు.



ఆ) బెస్టో కాటన్, పూలెసి, సిల్క్, సింథెటిక్ బట్టలను పూర్తిగా సురక్షితంగా ఉంచుతుంది.



ఇ) బెస్టో తో ఉతికిన బట్టలను జాడించడం ఎంతో సులభం.



ఈ) బెస్టో మీ చేతులను మృదువుగా, కోమలంగా ఉంచుతుంది.



2 కేవలం బెస్టోలో మాత్రమే ఓ అద్భుతమైన పదార్థం ఆల్ఫా ఒలెఫిన్ ఉంది ఇది ఉతుకు ఉతుక్కూ తెల్ల బట్టలకు మరింత తెలుపూ, రంగు బట్టలకు మరింత మెరుపూ ఇస్తుంది



3 బెస్టో మీ వాషింగ్ మెషీన్‌లో వాడటానికి సాటిలేనిది.



ఒక కిలో రూ. 7.65 స్థానిక పన్నులు అదనం

బెస్టో— మీ బట్టలకు, చేతులకు, డబ్బుకు మేలు కోరేది.

నచ్చుధరలో మెచ్చే తెల్లదనంతో పాటు చేతులకు రక్షణ.

గోద్రెజ్ ఉత్పాదన

CHAITRA-B G 405 TEL

## ముఖచిత్రం

అట్టమీద బొమ్మ అందాల శ్రీదేవి
కనులలోన వింత కైపు నింపి
ముచ్చటైన రీతి ముద్రించె పత్రిక
పాఠక జనులెంతొ భ్రాంతి చెంద!

బాపట్ల వెంకటేశ్వరసాయి,
చెరువు జమ్ములపాలెం

* * *

'చిరునవ్వే సింగారమై
కొంటె చూపులు వయ్యారమై
ముఖారవిందమే చంద్రబింబమై
అమాయక పూర్మిక చిత్తరువై
ఆంధ్ర సచిత్ర వారపత్రిక-
ముఖచిత్ర శోభయై
సౌందర్య కాంతులు వెదజల్లె
ననరమ్య సిరి శ్రీదేవి'

-కె. సురేంద్రనాథ్, గొంటెల్ల

## సీరియల్స్

ఏ రచయితా దృష్టికి రాని నిష్కల్మషులు స్వార్థరహితులూ పసిపాపల్లాంటి 'యానాదుల' గురించి రచయిత వీణా వాణిగారు రాస్తున్న పరిశోధనాత్మకమైన రచనా కుసుమం సర్పయాగం. సగటు మనుషులు . .పెద్ద మనుషులూ 'అ, ఆ'లు నేర్చుకోవాల్సింది వాపోక్రస లేని ఆ బడుగు జవుల దగ్గర్నుంచి. 'సాహిత్య విలువలకు తిలోదకాలిచ్చిన' పత్రికల్లా కాక - తన అస్తిత్వాన్ని నిలుపుకొన్న 'ఆంధ్ర సచిత్రవార పత్రిక'కు పాదాభివందనం.

హేట్సాఫ్ టూ ది రైటర్.

- ఆర్. డేవిడ్ విల్సన్, కావలి

* * *

శ్రీ దూరి వెంకటరావు గారు రచించిన కాల్ గర్ల్" సీరియల్ నవల మధ్య తరగతి కుటుంబాలలోని ఆడపల్లల అవస్థలకు అద్దం పట్టినట్లుగా ఉంది. సరోజ ఆత్మ కథ దినాతి దినంగా ఉంది. "ఇటుపైన ఏం జరుగుతుంది?' అనే ఆసక్తితో ఎదురు చూస్తున్నాము.

- ఆకెళ్ల సుబ్బారావు, కందికుప్ప

* * *

30 5.86 సంచికలో సస్పెన్సుతో ప్రారంభమైన కాల్‌గర్ల్ సీరియల్ మొదట్లోనే మా ఇంటిల్లిపాదినీ ఎంతగానో ఆకట్టుకుంది. తర్వాత సంచిక కోసం ఎదురు చూస్తున్నాం.

- పి. సూర్యకుమారి, పి. నాగమణి,
విజయవాడ

* * *

30 మే-5 జూన్ 86 శ్రీదేవి ముఖచిత్రంతో వెలువడిన ఆంధ్ర సచిత్ర వారపత్రిక చాలా బాగున్నది. క్రొత్తగా ప్రారంభించిన సీరియల్ "కాల్‌గర్ల్" ప్రారంభంలోనే బాగున్నది.

- చోడాబత్తుల సత్యనారాయణ,
కుప్పనపూడి




'జీవితం చేజారిందా!' సీరియల్ చాలా బాగుంటున్నది. సీత పాత్ర చిత్రణలో కాకాని కమలగారు వెల్లడించిన 'స్త్రీ' గురించిన అభిప్రాయాలు చక్కగా ఉన్నాయి. కాబోతే "పురుషుడు – శాడిజమ్" అంటూ ఒక వారంలో వెలిబుచ్చిన ఆమె అభిప్రాయం కొంచెం తీవ్రంగా ఉంది స్త్రీ జాతి అభ్యున్నతికై రచనలు చేయవచ్చు. కానీ పురుషులందరినీ శాడిస్టులుగానూ, స్వార్థపరులుగానూ భావించడం చాలా
ఇబ్బందికరంగా ఉంటుంది.

-కె. ఎ. మాధవి, చీరాల

## సినిమా

జూన్ 6వ తేది సంచికలో ప్రచురితమైన మా అభిమాన ఛాయాగ్రహణ దర్శకుడైన శ్రీ వి. యస్. ఆర్. స్వామి గారి పరిచయం నన్నెంతగానో ఆకర్షించింది.

-కె. వి. యన్. నాయుడు,
నార్తురాజుపాలెం

## వ్యాసాలు

మొగలు నాగరికతకు ప్రతిరూపం ఫతేపూర్ సిక్రీ గురించి చక్కని, తెలియని ఎన్నో విషయాలను తెలియజేసి చక్కని కళాఖండాలను పత్రికాముఖంగా ప్రచురించి మాకు ఆనందాన్ని చేకూర్చారు.

డి. నర్సింగరావు, విజయలక్ష్మి,
పటాను చెరువు

* * *

"30 మే- 5 జూన్, 86" ఆంధ్ర సచిత్రవారపత్రికలోని "మొగలు నాగరికతకు ప్రతి రూపం ఫతేపూర్ సిక్రీ" అనే వ్యాసం చదివాను. సిక్రీ కోట గురించి వ్యాసకర్త చక్కగా, సంక్షిప్తంగా తెలియజేశారు. ఫోటోలు చాలా బాగున్నాయి.

-సి. సుజాత, తురిమెళ్ల

## శ్రీ రంగధామ్

సుప్రసిద్ధ రచయిత శ్రీ రంగధామ్ కథలూ, నవలలూ ఈ మధ్య ఆంధ్ర సచిత్ర వారపత్రికలో రాకపోవటం నాలాంటి వారికి లోటుగా ఉంది.

జి. రామలింగం, మదరాసు

(66 వ పేజీ చూడండి)


# ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

స్థాపితం : 1908

శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు : (1938-1972)

4 -10 జూలై 1986
శ్రీ అక్షయ నామ సం. జ్యేష్ఠ బ. త్రయోదశి
సంపుటము 78 : సంచిక 43

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

| | |
|---|---|
| విడి ప్రతి వెల | రు. 2-50 |
| పోస్టులో 6నెలల చందా | రు. 71.50 |
| పోస్టులో 12నెలల చందా | రు. 143.00 |

ఆంధ్రపత్రిక కార్యాలయము,
గాంధీనగరం, విజయవాడ-520 003


## విషయానుక్రమణిక

ముఖచిత్రం :
హీరో చిరంజీవి
(ఫోటో : పి. రవిచందర్)

### కథలు :



### సీరియల్ నవలలు:



### వ్యాసాలు, శీర్షికలు :




# నెహ్రూని ఎందుకు గుర్తుంచుకోవాలి?

జవహర్‌లాల్ నెహ్రూ మరణించి ఇరవై రెండేళ్లు అయినా ఆయనని గుర్తుంచుకున్నవారు, కిరాయి తీసుకునే ఆస్థాన రచయితలు కాక, ముగ్గురే ముగ్గురున్నారు. వారు అరుణా అసఫాలీ, పేట్రియాట్ పత్రిక సంపాదకుడు (ఆ వ్యక్తి ఎవరైనా సరే), పి ఎన్ హక్సర్. వీరి ముగ్గురి ఉమ్మడి ఆసక్తి ఏమిటన్నది నాకు తెలియదు. ఇక పేట్రియాట్ పత్రిక పాఠకులంతా దానికి రాసే వాళ్లే. అలాంటి పత్రిక అదొక్కటే! అయితే నవభారత నిర్మాతగా పేరు తెచ్చుకోడానికి కృషి చేసిన ఒక వ్యక్తిని ఆయన వారసుని పరిపాలనలోనే ఇంత త్వరగా మరచిపోవటం ఆశ్చర్యకరంగా ఉంది

అందులో ఆశ్చర్యపడాల్సిందేమి లేదనుకుంటాను అసలు నెహ్రూని దేనికి గుర్తుంచుకోవాలి? భారతావనికి పలు పంచవర్ష ప్రణాళికలు ప్రసాదించినందుకా. ప్రస్తుత అస్తవ్యస్త పరిస్థితికి కారణం అయిన పెద్ద ప్రభుత్వరంగాన్ని నెలకొల్పినందుకా? ప్రణాళికలు, ప్రభుత్వరంగం లేని దేశాలు అభివృద్ధిలోనూ, సాంఘిక న్యాయంలోనూ మనకన్నా ఎంతో పురోగమించాయి మనకి మిత్రులనే వారు మిగలకుండా చేసిన తటస్థ విధానాన్ని రూపొందించినందుకా? ఏదైనా వొత్తిడి వచ్చినప్పుడు మనకి నిజమైన స్నేహితులెవరూ లేరు కాబట్టి బలవంతంగా మనం తగాదా పెట్టుకున్న దేశాలవైపే మొగ్గాల్సి వస్తున్నది. మిగతా దేశాలకి శాశ్వత మిత్రులు ఉంటే మనకి శాశ్వత శత్రువులు ఉన్నారు. మన దేశాన్ని చిన్న చిన్న రాష్ట్రాలుగా విడగొట్టి వాటి మధ్య కలతలు సృష్టించినందుకా? చివరిగా, లౌకిక తత్వాన్ని వక్రమార్గం పట్టించి ఒక మతం వారిని మరొక మతం వారిపై తిరగబడేలా చేసినందుకా? అధిక సంఖ్యాకులు హిందువులన్న ఒకే ఒక్క కారణంగా అల్ప సంఖ్యాక వర్గాల వారిని వారిని వ్యతిరేకించేలా చేసినందుకా? వీటిలో దేని కోసం మనం నెహ్రూని గుర్తుంచుకోవాలి?

అసలు మనం నెహ్రూని సరిగా అర్థం చేసుకోలేదని నాకనిపిస్తున్నది. ఆయనని ఒక ఆధునిక వ్యక్తిగా మనం భావిస్తాము. ఎందుకంటే చేతితో చేసినటువంటి గాజు పాత్రలలో ఆయన మద్యాన్ని సేవించేవారు. ఏనుగు దంతం కాడగల హోల్డర్‌తో ఆయన సిగరెట్లు తాగేవారు అయినా ఆయన తప్పనిసరిగా సంప్రదాయవాదే, అభివృద్ధి నిరోధకుడు అన్నా అనవచ్చు. ఎడ్వర్డ్ పతనం ప్రారంభం అయిన కాలంలో ఆయన బుద్ధి వికసించటం ప్రారంభించింది. ఆ కాలంలోనే ఆయన ఒక వ్యక్తిగా రూపొందారు. ఏడవ ఎడ్వర్డ్ సింహాసనాన్ని అధిష్ఠించే సమయానికి నెహ్రూ ఇంగ్లాండు వెళ్లారు. ఆయన మరణానంతరం తిరిగి విచారంగా భారతదేశం వచ్చిన యువకుడు నెహ్రూ. నెహ్రూ విచారం ఆయన చదువులో అంతగా రాణించలేక పోయినందుకు కాదు. ఇండియన్ సివిల్ సర్వీస్‌లో ఉత్తీర్ణత సాధించాలన్న ఆయన తండ్రి ఆశయాన్ని నెరవేర్చలేక పోయినందుకు కాదు. మోతీలాల్ నెహ్రూ కుమారునికి ఉత్తరం రాస్తూ "ఆ రోజు కోసం నిరీక్షించ లేకుండా ఉన్నాను నువ్వు ఎప్పుడు ఝాన్సీ డెప్యూటీ కమిషనర్ అవుతావు, సివిల్ లైన్స్‌లోని బంగళాలో ఎప్పుడు నివసిస్తావు, ఆ బంగళా ముందు జె. నెహ్రూ, ఎస్క్వైర్, ఐ సి. ఎస్ అన్న పేరుగల ఫలకం నేను ఎప్పుడు చూస్తాను, నీ బంధువర్గం అంతా అలా ఉన్నారు. అలాగే నువ్వు కూడా ఉండాలి. .. భగవంతుని దయ." అన్నారు.

నెహ్రూ చాలా కష్టపడి ప్రయత్నం చేసారు కానీ ఆయనకి తెలుసు తాను దాన్ని అందుకో తగినవారం కామని. ఆ తర్వాత జీవితంలో కూడా ఎన్నో విషయాలకి తగనట్లుగానే ఐ సి. ఎస్ కి కూడా ఆయన తగినవారు కాదనిపించుకున్నారు. ఈ వైఫల్యమే ఐ. సి. ఎస్ అధికారులతో ఆయనకి గల ప్రేమ- ద్వేషం సంబంధాలని వివరిస్తుంది అంతేకాక 1947లో దాదాపు వారికే అధికారాన్ని అప్పగించింది ఎందుకో తెలియ చేస్తుంది. అది సరైన పనికాదని నెహ్రూని ఎందరో హెచ్చరించారు అందులో చాలామంది కేంబ్రిడ్జి లేదా ఆక్స్‌ఫర్డ్ కాలేజీ లోపల ఎలా ఉంటుందో కూడా తెలియదు. వైట్ హాలులోని ఇండియా ఆఫీసులో అడుగు పెట్టని వాళ్లే – కానీ ఇదేమంత పెద్ద తప్పు కాదు. నెహ్రూకి లోతుగా ఉన్న లోపం ఏమిటంటే ఆయన తానొక భారతీయుడినని చెప్పుకోడానికి సిగ్గు పడతారు. తానొక హిందువుని అనుకోటానికి సిగ్గు పడతారు. కనుక తానొక భారతీయుడినని నెహ్రూ గర్వంగా ఎప్పుడూ చెప్పుకోలేదు. హిందూ అంటే అర్థం మతపరమైనటువంటిది కాదు, చారిత్రికమైనదని నా భావం. ఆ విధంగా మనమంతా హిందువులమే- అల్ప సంఖ్యాక వర్గాలనేవారితో సహా. హిందువుగా చెప్పుకోటానికి సిగ్గుపడే వ్యక్తి తాను భారతీయుడిగా ఉండటానికేసిగ్గు పడతాడు.

నెహ్రూ భారతీయుడు కాదు కాబట్టి ఒక్కొక్క సమయంలో ఆయన ఒక్కొక్కరకంగా ఉండేవారు. కొన్నిప్పుడు రష్యన్‌గా, ఒకప్పుడు ఇంగ్లీషువాడుగా అంటే యూరోపియన్‌గా అనవచ్చు. ఉండేవారే కానీ భారతీయుడిగా మాత్రం లేరు. కాబట్టి ఆయన లోతైన భావాలు లేనటువంటి వ్యక్తి. ఆదర్శాల విషయంలోనేకాక ఆయన భావాలు అన్ని రకాలుగా ఎప్పుడూ అనిశ్చలంగా, అసందిగ్ధంగా అతికించినట్లు ఉండేవి ఆయనకి తమ స్వంతం అంటూ ఏదీ లేదు. కాబట్టే ఆయన ఆలంబన కోసం ఎవరో ఒకరిపై ఆధారపడవలసి వచ్చేది. గాంధిగారి అనాగరికత్వాన్ని ద్వేషించినా కొంత కాలం ఆయన మీదా, ప్రణాళికలు, తదితర అభివృద్ధి పథకాల కోసం ఫాబియన్‌లపైనా, ఆయనలోని అమెరికా వ్యతిరేకతని పెంపుచేయడానికి కొంత కాలం రష్యన్‌లపైనా నెహ్రూ ఆధార పడ్డారు గాంధీతత్వం, మార్క్సితత్వం, సమగ్ర మానవతా వాదం, ఇంకా చెప్పాలంటే రాడికల్ ప్రజా స్వామ్యవాదం లాంటివి ఉన్నాయి. కానీ నెహ్రూతత్వం అన్నది ఏదీ లేదు- అసఫాలీలూ, హక్సర్‌లు ఎంత ఘోష పెట్టినా! కేవలం ఊహలోనే తప్ప నెహ్రూతత్వం అన్నది వాస్తవంగా ఎక్కడా లేదు. ఎందుకంటే నెహ్రూకి తన మీద తనకే నమ్మకం తక్కువ అలాగే తన దేశంమీదా, తన ప్రజలమీద కూడా ఆయనకి అంతగా విశ్వాసం లేదు

క్రమంగా నెహ్రూ అల్ప సంఖ్యాకుల పట్ల తామేదో తప్పు చేసామన్న భావాన్ని తమలో పెంచుకున్నారు. హిందూతత్వం నించి బయటికి వెళ్ళటానికి సిద్ధపడిన ఆయన అల్ప సంఖ్యాకులని వాస్తవాలని దృష్టిలో పెట్టుకుని సర్దుకుపోయే రీతిలో సరియైన అవగాహనకి రమ్మని చెప్పలేక పోయారు మహమ్మదాలీ జిన్నా వదలిపెట్టిన దగ్గర్నించి దానిని ఆయన కొనసాగించారు దేశ విభజనలో జిన్నా పాత్రని రహస్యంగా నెహ్రూ ఆమోదించారని నా కనిపిస్తుంది. ఆయన అలాంటివారు కాబట్టే ఏమి చేయలేక పోయారు. నెహ్రూ జాతీయతత్వం కాగితం కన్నా పలచబడి పోయింది చైనా మనపై దాడి చేసి కొంత భూభాగాన్ని ఆక్రమించు కున్నప్పుడు ఆయన అన్నమాట ఏమిటంటే ఆ భూభాగంలో ఒక్క గడ్డిపరక కూడా పెరగదని. ఆయనలాంటి ఏ భారతీయుడూ అలా చెప్పకూడదు. ఆ భూభాగంలో ఒకటి, లేకపోతే రెండు గడ్డిపరకలే పెరగవచ్చు, పెరగక పోవచ్చు. కానీ దానిపై ఆయనకి మనదనే ప్రేమ లేదు. అందుకే ఆయన కింద పనిచేసే సైన్యాధికారులు కూడా చైనా దాడిని ఎదుర్కొనటంలో విఫలం అయినారు.

నెహ్రూ గురించి నేను పదేపదే చెప్పటం ఎందుకంటే ప్రస్తుతం మన సమస్యలలో చాలా భాగం ఆయనచేత సృష్టింపబడి నటువంటివే. మనం ఆయనని సరిగా అర్థం చేసుకుంటే తప్ప ఆ సమస్యలని అధిగమించలేము. ఈ సమస్యలన్నీ నెహ్రూ సమస్యలే. మనం నెహ్రూలని వదిలించుకుంటే తప్ప ఆ సమస్యలని- అది పంజాబ్ అయినా, కాశ్మీర్ అయినా లేక మిజో అయినా- పరిష్కరించుకోలేము. ఎంత త్వరగా వీలైతే అంత మంచిది. ☐

సీరియల్

# సర్ప యాగం

(గత సంచిక తరువాయి)

ఇరవై సంవత్సరాల క్రితం ... దేవరకొండ గ్రామంలో 'పాలకొండ' వంశం వారి ఆధిక్యత యిప్పటిలాగే ఉధృతంగా వుండేది. ఏ చరిత్ర పుస్తకాల పుటల్లోకి ఎక్కనంతటి పెద్ద చరిత్ర ఆ పాలకొండ వంశానికి వుంది. తరతరాల నుండి ఆ వంశం చేతనే ఆ దేవరకొండ పాలింపబడుతోంది.

నాగరాజు తండ్రి చనిపోతూ ..తన యావదాస్తినీ అతడికి అప్పగించి, తరతరాల తమ వంశం యొక్క గౌరవ ఆధిక్యతలను నిలబెట్టవలసిందిగా కొడుకు చేత ప్రమాణం చేయించుకొని మరీ కన్నుమూశాడు. అప్పుడు నాగరాజు వయస్సు సుమారు ముప్పయి సంవత్సరాలుంటాయి.

అప్పటికి అయిదేళ్ల క్రితమే నాగరాజుకు పెళ్లయిపోయింది తన భార్య తప్ప ... ఆ వూళ్లోని ప్రతి పరాయి ఆడదీ నాగరాజు కంటికి చాలా అందంగా అగుపించేది. అందుకే ఆయన వూళ్లోని ఆడవాళ్లపై పడి వీరవిహారం చేసేవాడు. నాగరాజుకు ఆడ పిచ్చే కాక అడవిలో వేటాడే పిచ్చి కూడా వుండేది.

వాళ్ల యింట్లో ఒక తుపాకీ వుండేది పాలకొండ వంశపు వైభవాన్ని ప్రకటించే అనేక వస్తువుల్లో ఆ తుపాకీ కూడా ఒకటి. ఆ తుపాకీ చాలా ప్రత్యేకమైనది. ఎందుకంటే ... అందులోని గుళ్ళు అడవి జంతువుల గుండెల్లోకి మాత్రమే గాకుండా, అప్పుడప్పుడూ ఆ వంశపు ఆధిపత్యానికి అడ్డు తగిలిన మనిషి గుండెల్లోకి కూడా దూసుకుపోతుంటాయి.

దేవరకొండ గ్రామానికి పడమటి వేపు ... మూడు కిలో మీటర్ల దూరంలో ఒక పెద్ద అడవి వుంది. ఆ అడవిలో యిరవై సంవత్సరాల క్రితం ... రకరకాల జంతువులు నివసిస్తూ వుండేవి. అందుకే అప్పట్లో ఆ అడవిలోకి వెళ్లడానికి మనుషులు భయపడేవాళ్ళు. నాగరాజు ఆ అడవిలోకి నెలకు రెండు మూడుసార్లు వేటకు వెళ్లేవాడు.

రామ బాణమైనా గురి తప్పుతుందేమో గానీ ... నాగరాజు తుపాకీ గురి మాత్రం తప్పడమంటూ జరగదు. నాగరాజు ఏ జంతువునైనా ఓసారి గురిపెడితే చాలు ... యిక దానికి నూరేళ్ళూ నిండిపోయినట్లే. అడవికి వేటకెళ్లి ఖాళీ చేతులతో తిరిగి రావడమనేది నాగరాజు జీవితంలో జరగలేదు.

నాగరాజుకున్న విశాలమైన మామిడితోటలో పాకలు వేసుకుని జీవించే నర్సయ్యనూ, సీతారాముడినీ తన వెంట తీసుకుని నాగరాజు వేటకు వెళుతుండేవాడు. ఒంటరిగా మాత్రం వెళ్లేవాడు కాదు సీతారాముడు, నర్సయ్య, నాగరాజు ఈ ముగ్గురూ దాదాపు ఒకే వయసులో వుండేవాళ్ళు.

యానాది సీతారాముడంటే . ఆ వూళ్లో తెలియని వారుండరు. ఆ వూళ్లో ఎవరింట్లోగానీ, పెరట్లోగానీ పాము కన్పించిందంటే ... సీతారాముడి కోసం పరుగెత్తుకు వచ్చేవారు. అతడి జీవితంలో ఎన్ని పాముల్ని చంపాడో లెక్కలేదు. అంతులేని ఆ సర్పయాగంను కొనసాగించడం .. సీతారాముడి తర్వాత అతని కొడుకైన వెంకట్రాముడికి సంక్రమించింది.

నాగరాజు చెప్పిన మాటను సీతారాముడు శిరసావహించేవాడు. ఆయన పట్ల భక్తి గౌరవాలను కలిగివుండే వాడు. ముఖ్యంగా అడవిలో వేటాడే సమయంలో .. మంచి చనువు వుండేది కనుక ... నాగరాజు కుటుంబ వ్యవహారాలలో కూడా సీతారాముడు జోక్యం చేసుకొనేవాడు.

ఆరడుగుల ఎత్తుతో . కండలు తిరిగిన శరీరంతో ... విశాలమైన ఛాతీతో ... మొనతేలిన ముక్కుతో ... పంకీలు తిరిగిన వెంట్రుకలతో ... నల్లగా రాతి స్తంభంలా వుండే సీతారాముడి ఆకారాన్ని చూస్తే అడవిలోని జంతువులు కూడా అదిరిపోయేవి రేచులు జడుసుకుని పారిపోయేవి.

ఒక రోజు మధ్యాహ్నం ... రెండు గంటలు దాటిన సమయంలో .. నాగరాజు తుపాకిని సిద్ధం చేసి, సీతారాముడినీ, నర్సయ్యనూ వెంటనే రమ్మని కబురు పంపించాడు. వాళ్లిద్దరూ వచ్చాక .. వాళ్లతో కలిసి నాగరాజు అడవికి బయలుదేరాడు. పడమటి కొండల్లో సూర్యుడస్తమించక ముందే వాళ్ళు అడవికి చేరుకొన్నారు

ఆకులు రాలిపోయిన చెట్లతో ...ఆభరణాలు తీసేసిన అమ్మాయి ముఖంలా ... అడవి బోసిగా వుంది. ఆ ముగ్గురూ ఒకరితో ఒకరు మాట్లాడకుండా పక్క పక్కన మౌనంగా నడుస్తున్నారు. వాళ్ల కాళ్ల కింద పడి నలుగుతున్న ఎండుటాకులు పటపటమని చిట్లుతూ శబ్దిస్తున్నాయి.

మనుషుల ఉనికిని తెలుసుకున్న కొన్ని ఉడుతలు ... కీచు కీచుమంటూ అరుస్తూ వెదురు పొదల్లో గబగబా అటూ యిటూ ఆందోళనగా దూకుతున్నాయి. అంతవరకు చెట్లపై కూర్చున్న కాకుల గుంపు అరుస్తూ రివ్వున ఎటో ఎగిరిపోయాయి.

దట్టమైన ఆ అడవిలో పొదల్ని, రాళ్లనీ, డొంకల్ని, బండల్ని దాటుకుంటూ ఆ ముగ్గురూ నడుస్తున్నారు పగలంతా ఎండకు సలసల కాగిపోయిన రాతి బండలు యింకా చల్లబడలేదు. గాలి స్తంభించి పోయి వుండడం చేత, చెట్లు కూడా కదలడంలేదు. అడవి నలుమూలలా నిశ్శబ్దం అలుముకుంది.

ఉన్నట్టుండి ఇంతలో 'బుస్'మంటూ ఓ నాగుపాము పొదలోంచి వెలుపలికొచ్చి . పడగెత్తి నిలబడింది. ఎదురుగా వున్న పామును చూసి భయపడి పరుగుతీశాడు నాగరాజు. అతడు ఆపాదమస్తకం కంపించసాగాడు.

జరిగిన కథ – 8: ఆ ఊరి దేవత విరూపాక్షమ్మకు మళ్లీ నోరు తెప్పించాలని మంత్రగాడైన భైరవస్వామిని పిలిపిస్తారు ఆ ఊరి పెద్దలు. భైరవస్వామి కొన్ని చిట్కాలు చేసి చూపించాడు. తనకేదో గొప్ప శక్తి ఉందని అందర్ని నమ్మించడానికే భైరవస్వామి ఆ చిట్కాలు చేశాడని వెంకట్రాముడి అనుమానం. వెంకట్రాముడు తాను చెప్పినట్టు విరూపాక్షమ్మ పూనినట్టు నటించను ఒప్పుకోలేదని అతన్ని గొడ్డును బాదినట్టు కర్రతో చావబాదాడు నాగరాజు. వెంకట్రాముడి ద్వారా విషయం తెలుసుకున్న నర్సయ్య కడుపు భగ్గున మండింది. ఇరవై ఏళ్ల క్రితం వెంకట్రాముడి తండ్రైన సీతారాముడిని నాగరాజు ఎలా చంపించింది వెంకట్రాముడితో వివరంగా చెప్పడం ప్రారంభించాడు నర్సయ్య.

కారణం . నాగుపాము గండం వుందని ఎవరో గతంలో చెప్పారు. అప్పటి నుండి నాగు పామును చూస్తే . అతడు యిలాగే జడుసుకుంటాడు.

ఆ పామును చూడగానే సీతారాముడి కళ్లలో మాత్రం ఆశ తళుక్కుమంది. ఎలాగైనా పట్టుకోవాలని అతడు ముందుకు ఓ అడుగు వేశాడు. అతడి ఉద్దేశాన్ని ముందే గ్రహించిన నాగరాజు వెనక నుండి అతడిని వారించాడు. అతడలా వారించగానే సీతారాముడి ఆశ తుడిచిపెట్టుకు పోయింది

కొంతసేపటికి వాళ్లు ముగ్గురూ ఆ అడవిలో ఒక ప్రదేశానికి చేరుకున్నారు. ఆ ప్రదేశంలో వెడల్పయిన ఒక నీటి గుంట వుంది అందులోని నీళ్లు గంజిలా వుంటాయి. అందుకే దానిని అందరూ 'గంజి కుంట' అని పిలుస్తుంటారు. ఆ మాత్రం నీళ్లున్న గుంట ఆ అడవిలో మరెక్కడా అగుపించదు

అందుకే . . ప్రతి సాయంత్రం సూర్యుడు అస్తమించాక, ఆ అడవిలో నివసించే జంతువులన్నీ దప్పిక తీర్చుకునేందుకు ఆ గుంట వద్దకు వస్తుంటాయి. ఆ గుంటకు తూర్పు దిక్కున ఎత్తయిన రాతిబండలూ, దక్షిణం వేపు ఉత్తరం వేపు ఏపుగా పెరిగిన దట్టమయిన వెదురు పొదలూ వున్నాయి.

కనుక ఆ గుంటలోని నీటి కోసం వచ్చే అడవి జంతువులు ... పడమటి వేపు నుండే ఆ గుంటలోకి దిగాలి. ఆ ప్రదేశానికి చేరుకోగానే సీతారాముడు పడమటివేపు నుండి గుంటలోకి దిగి ... భూమి మీది మట్టిని పరిశీలనగా చూశాడు ఆ మట్టి మీద జంతువుల అడుగుల గుర్తులు అగుపించలేదు

అంటే ... అడవి జంతువులేవీ యింకా ఆ గుంట వద్దకు నీళ్ల కోసం రాలేదని ... ఆ సమయం కావస్తోందని అతడికి అర్థమయిపోయింది. తర్వాత సీతారాముడు గబగబా నాగరాజు దగ్గరకు వెళ్లి ఈ విషయం చెవిలో గుస గుస చెప్పాడు.

నాగరాజు, నర్సయ్య యిద్దరూ ఆ గుంటకు దక్షిణం వేపున్న పొదల మధ్య ... చాటుగా కూర్చున్నారు ముందే అలా కూర్చోడానికి వీలుగా కత్తితో కంపల్ని నరికి దారి చేశాడు నర్సయ్య వాళ్లిద్దరూ పక్క పక్కన కూర్చున్న తరువాత ... వచ్చే జంతువులకు వాళ్లిద్దరూ కన్పించకుండా వుండేలా కొన్ని కంపల్ని అడ్డంగా పెట్టుకున్నారు.

సీతారాముడు మాత్రం ఆ గుంటకు ఉత్తరం వేపున్న పొదల నడుమ కూర్చున్నాడు. అప్పటికి సూర్యుడు అస్తమించాడు. అయితే చీకటి మాత్రం యింకా అలుముకోలేదు కొద్దిగా వెలుగురేఖలున్నాయి. అడవంతా నిశ్శబ్దంతో నిండిపోయింది. గుంటలో నీటి అంచున కూర్చుని పిట్టలు నీళ్లు తాగుతున్నాయి.

గాలి మెల్లగా వీచడం ప్రారంభమయింది. ఆ గాలికి చెట్ల కింద పడివున్న ఎండుటాకులు పరపరమంటూ శబ్దం చేస్తున్నాయి. ఎక్కడో ఓ గుడ్లగూబ వుండి వుండి కూస్తోంది. రాబోయే జంతువుల కోసం ఆ ముగ్గురూ కన్నార్పకుండా నీటిగుంట వేపే చాలా ఆతృతగా చూస్తున్నారు.

ఉన్నట్టుండి ఉడుతలు గట్టిగా అరిచాయి.

గుంటలో నీటి అంచున కూర్చుని వున్న పిట్టలు ఒక్కసారిగా గుంపుగా పైకి లేచాయి. సరిగ్గా ఆ సమయంలో ఆ ముగ్గురికి గాలికి గుప్పుమంటూ ఏదో దుర్వాసన వచ్చింది గుంట వేపే వాళ్లు పరిశీలనగాచూశారు.

అంతే ... ఆ ముగ్గురికి గుండెలు గుభేలుమన్నాయి. నర్సయ్య ఊపిరి పీల్చడం గూడా మరిచిపోయి అదే పనిగా చూస్తున్నాడు. పడమటి వేపు నుండి నీటి కోసం మెల్లగా దిగుతోంది ఓ పులి.

నీటి అంచు దగ్గర నిలబడి కడుపారా నీళ్లు తాగిన పులి ... అక్కడినుండి తిరుగు ప్రయాణానికి సిద్ధమైంది సరిగ్గా ఆ క్షణంలోనే .. ముక్కులో గానీ దోమ దూరిందేమో ఉత్తరం వేపు పొదల్లో కూర్చుని వున్న సీతారాముడు 'హాచ్' అంటూ గట్టిగా తుమ్మేశాడు అడుగు ముందుకెయ్యబోయిన ఆ పులి చటుక్కున అక్కడే నిలబడిపోయింది.

ఏ వేపు నుండి ఆ శబ్దం వచ్చిందో ఆ వేపు తలతిప్పి క్షణకాలం తీక్షణంగా చూసింది. అదే సమయంలో నాగరాజు బుర్రలో తళుక్కుమంటూ మెరుపులా ఏదో ఆలోచన వచ్చింది. పళ్లు కొరుకుతూ . తుపాకీ ట్రిగ్గర్ మీదున్న వేలిని చటుక్కున వెనక్కు తీసేశాడు నాగరాజు.

అది గమనించిన నర్సయ్య అతడి ఉద్దేశ్యం ఏమిటో పసికట్టలేక నాగరాజు ముఖంలోకి ప్రశ్నార్థకంగా చూశాడు. ఆ క్షణంలో పులి చూపులకన్నా నాగరాజు చూపులు మరింత క్రూరంగా వున్నాయి అతడి ముఖంలో ఏదో కసి ద్వేషం ఉప్పొంగుతోంది అతడి కళ్లు ఆ చీకట్లో నిప్పుకణాల్లా వున్నాయి



# సర్పయాగం

తన శత్రువు ఎవరో పొద లోపల పొంచి వున్నాడని గ్రహించిన ఆ పులి .. భయంకరంగా గాండ్రించి, ఒక్క ఉదుటున ఉత్తరం వేపు పొదలో పొంచి వున్న సీతారాముడి పైకి గబాలున దూకింది. సరిగ్గా అప్పుడే నర్సయ్య కెవ్వున అరవబోయాడు

అది ముందే గ్రహించిన నాగరాజు ... గబుక్కున నర్సయ్య నోరు నొక్కేశాడు. నర్సయ్య గుండెలోంచి వచ్చిన ఆ కేక గొంతులో సమాధైపోయింది.

ఆ సమయంలో సీతారాముడు పెట్టిన చావు కేకతో అడవి సమస్తం కంపించిపోయింది. ఆ కేకతో జడుసుకున్న పక్షులు టపటపా రెక్కలుకొట్టుకుంటూ చెట్ల మీది నుండి ఎటో వేగంగా ఎగిరిపోయాయి పాలకొండ నాగరాజు మాత్రం తనలో తనే తృప్తిగా నవ్వుకున్నాడు

సీతారాముడు కాళ్ళూ చేతులూ విలవిలా కొట్టుకుంటున్న చప్పుడు .. గొంతులో గురగురమంటూ శబ్దం .. కొద్ది క్షణాల్లో ఆ చప్పుడు ఆగిపోయినట్టు నిశ్శబ్దం సుడిగాలిలోని చిగురుటాకులా నర్సయ్య ఆపాదమస్తకం కంపించిపోతుంటే .. నాగరాజు మాత్రం నిమ్మకు నీరెత్తినట్టున్నాడు

సీతారాముడి మృత కళేబరాన్ని పులి బరబరా ఈడ్చుకుంటూ పొదలోంచి వెలుపలికొచ్చింది. దక్షిణం వేపున్న పొదలలోని నర్సయ్య కొద్దిగా కదలడంతో ... ముళ్ళకంపలు కూడా సరసరమంటూ శబ్దం చేస్తూ కదిలాయి

సీతారాముడి దేహంలోంచి కండను పీక్కోవడానికి తలపంచిన పులి .. చటుక్కున తలెత్తి దక్షిణం వేపు పొదలలోకి చూసింది. మసక చీకట్లో అది తమ వేపు చూడడం నర్సయ్యకు స్పష్టంగా అగుపిస్తోంది.

సరిగ్గా అప్పుడే .. గురి చూసి నాగరాజు ట్రిగ్గర్ నొక్కాడు. తుపాకిలోంచి దూసుకు వచ్చిన గుళ్ళు ఏమాత్రం గురితప్పక పులి శరీరంలోకి దూసుకుపోయాయి దాని దవడ బాగా చీలిపోయింది. సీతారాముడి కళేబరం పక్కనే ఆ పులి కూడా కుప్పలా కూలిపోయింది.

అది చచ్చిందన్న నమ్మకం కుదిరిన తర్వాత పొదలోంచి పైకి లేచాడు నాగరాజు టార్చ్ లైట్ ఫోకస్ చేసుకుంటూ మెల్లగా కదిలాడతడు నర్సయ్య కూడా నాగరాజు వెంట నడిచాడు. సీతారాముడి శవం పడివున్న స్థలానికి వాళ్ళు చేరుకున్నారు

సీతారాముడి కళేబరం పైకి టార్చ్ లైట్‌ను ఫోకస్ చేశాడు నాగరాజు. వెలుగులో ఆ దృశ్యాన్ని చూడగానే ... ఒళ్ళు జలదరించింది నర్సయ్యకు అతడి వెంట్రుకలు నిక్కబొడుచుకున్నాయి ఆ భీభత్సకరమైన దృశ్యాన్ని చూడలేక ... కళ్ళు మూసుకుని తల మరో వేపుకు తిప్పుకున్నాడు నర్సయ్య.



సీతారాముడి శవాన్ని చూస్తుంటే .. ఎంతో తృప్తిగా వుంది నాగరాజుకు. చాలా వికృతంగా క్రూరంగా పగలబడి నవ్వాడు నాగరాజు. ఆ క్షణంలో పులికన్నా నాగరాజు చాలా క్రూరమైన జంతువుగా కన్పించాడు నర్సయ్యకు.

సీతారాముడి శవం చుట్టూ నెత్తురు.

ఈగలు అప్పటికే ఆ నెత్తుటిపై వాలాయి. ఆ పరిసరాలను ఆవరించిన గాలి ... నెత్తుటి నెత్తావుల్ని విరజిమ్ముతోంది సీతారాముడి కడుపు చీలిపోయి ంది. కడుపులోని పేగులన్నీ గుత్తిగా వెలుపలకి వచ్చేశాయి. పులి పంజా దెబ్బలతో అతడి ముఖం నెత్తుటి ముద్దలా వుంది గొంతు సగానికి పైగా కొరికెయ్యబడి వుంది.

"బాబుగోరూ! యిట్టాంటి అన్యాయం. నేను నా జల్మలో సూల్లేదు. తమరు .. తమరు . కావాలనే సీతారాముని్ని పులి సేత సంపించినారు. అది వోన్ని సంపేదానికి బోతా వుంటే . తమరు కావాలనే తుపాకి పేల్సలేదు. యింత గోరం సెయ్యడం తమలాంటోడికి తగదు బాబో"- అంటూ నర్సయ్య బావురమన్నాడు

"అవున్రా నర్సిగా! సీతారాముల్ని పులిసేత నేను కావాలనే సంపించినాను. యారక తినే యీ యానాది నా కొడుక్కి నా పెండ్లాం కావాల్సొచ్చిందా? యీనెమ్మా .. యీడెంత యీని బతుకెంత? యానాది నా కొడుకు యానాదోడుగానే బతకాల' నాగరాజు గొంతు చాలా కర్కశంగా ధ్వనించింది.

సీతారాముడు నీ పెండ్లాన్ని కావాలనుకోలేదు నీ పెండ్లామే వోన్ని కావాలనుకొంది జాతి తక్కువైనా ... నీతి వున్నోడు కాబట్టే ...సీతారాముడు నీ పెండ్లానికి దూరంగానే మసిలినాడు నీ వోని మీద అనుమానమొచ్చి . నిజం తెల్సుకోకుండా నువ్వింత పాపానికి వొడిగడతావని నాకు తెలవదు - అంటూ గొంతు చించుకుని నాగరాజుకు చెప్పాలన్పించింది నర్సయ్యకు. కానీ నోరు పెగల్లేదు

"వొరేయ్ నర్సిగా! యీడేం జరిగిందో .. అది యీన్నే మర్సిపోవాల. సీతారాముడి సావు నీకూ నాకూ తప్ప .. మనూళ్ళో మూడో మన్సికి తెలవకూడదు. తెల్సిందా . యిదే తుపాకితో నిన్నూ నీ పెండ్లాన్నీ కాల్సి సంపతా. గురుతుబెట్టుకో. అడివిలో తిరగతావుంటే ... సీతారాముడి మీద పులి పడిందని, వోని అరుపు విని మనం దెగ్గరికి వొచ్చేయాళకే వోన్ని పులి సంపేసిందని, అనాక మనం ఆ పులిని కాల్సి సంపేసినామని . వూళ్ళో అందరికీ నువ్వు సెప్పాల' -అన్నాడు నాగరాజు.

అలాగే అన్నట్టు తలాడించాడు నర్సయ్య.

"సరే ... వోని పీనిగని భుజానికి యెత్తుకో వూళ్ళోకి పోదాం. రేపు తెల్లారొచ్చి యీ పులిని బండ్లో యేస్కొని పోవచ్చు"- నాగరాజు అలా అనగానే సీతారాముడి శవాన్ని ఎత్తి తన భుజం మీద వేసుకుని ముందుకు నడిచాడు. నాగరాజు చెప్పినట్టే .. సీతారాముడి చావు గురించి నర్సయ్య అందరికీ అబద్ధం చెప్పి నమ్మించాడు.

ఈ రహస్యాన్ని యిరవై సంవత్సరాల నుండి తనలోనే దాచుకున్న నర్సయ్య .. యిప్పుడు వెంకట్రాముడి పక్కన కూర్చుని .. ఆ విషయాన్నంతా వివరంగా చెప్పాడు. తన తండ్రి నాగరాజు చేత దారుణంగా చంపబడ్డాడని తెలుసుకున్న వెంకట్రాముడు ... ఆ క్షణంలో అగ్నిపర్వతమే అయ్యాడు ... మరుక్షణమే ఏదో నిస్సహాయతతో అతడు చల్లారిపోయాడు.

## 11

సూర్యుడు పూర్తిగా కనుమరుగైపోయాడు. అప్పుడే ఉదయిస్తున్న చంద్రుడు .. ఆకాశపు ఫ్లవర్ వాజ్‌లో అమర్చిన అందమైన మందారంలా వున్నాడు. అక్కడక్కడ జిల్లేడు చెట్లకు కరుచుకుని మిణుకు మిణుకుమంటూ మెరుస్తున్న మిణుగురు పురుగులు .. ఈ దేశంలోని పేద ప్రజల ఆశల్లా వున్నాయి.

మధ్యాహ్నం సంతకు వెళ్ళిన వెంకట్రాముడు, గౌరి తిరుగుప్రయాణమై వస్తున్నారు. నాలుగైదు పాము తోళ్ళు యింట్లో వుంటే . అమ్మడానికి సంతకు తీసుకువెళ్లారు. గౌరి ముందు నడుస్తోంది. ఆమె వెనుక వెంకట్రాముడు నడుస్తున్నాడు. అతడి చంకలో ... ఆవాళ సంతలో కొనుక్కొన్న కొత్త దుప్పటి వుంది




# ఆంధ్రపత్రిక సంస్థ నుంచి మరో ఆణిముత్యం
# నవ వనితా సచిత్ర పక్షపత్రిక

* అభ్యుదయానికి మనోవికాసానికి, లలితమైన వినోదానికి దర్పణాలైన వ్యాసాలు, చర్చలు.
* కాలక్షేపానికి రకరకాల హాబీలు, గృహాలంకరణలు తెలిపే శీర్షికలు.
* బొమ్మల కథలు, కమ్మని కథలు వాటికి తీరైన బొమ్మలు.
* ఒక పూర్తి నవల + 2 సీరియల్స్.
* పొదుపుకు, సదుపాయానికి అవసరమైన చిట్కాలు, రకరకాల వంటలు; వంటలకి ఉత్తరాలకి అల్లికలు, డిజైనులు, కవితలు, గేయాలు, రాశిఫలం కూడా ... బహుమతులు అన్నీ రంగులు హంగులు కలబోసిన అందమైన హరివిల్లు!
* ఆధునిక మహిళల ఏకైక పక్షపత్రిక. అందరూ చదువతగిన సచిత్ర పత్రిక వెల : 2-50

వివరాలకు :

'కలువబాల', కేరాఫ్ ఆంధ్రపత్రిక, గాంధీనగరం, విజయవాడ - 3.

విడిప్రతి వెల : రు. 2.50

చందా వివరాలు

| | ఏజెంట్ ద్వారా | - | పోస్ట్ ద్వారా |
|---|---|---|---|
| 3 నెలలకు | రు. 15-00 | - | 15-90 |
| 6 నెలలకు | రు. 30-00 | - | 31-80 |
| సంవత్సర చందా | రు. 50-00 | - | 50-00 |

సంవత్సర చందా ఒకేసారి ఆఫీసుకు చెల్లించండి.



# సర్పయాగం

సరదాగా కబుర్లు చెప్పుకుంటూ వేగంగా నడుస్తున్నారు వాళ్ళు .. ఎదురుగా మచ్చల పామును చూసినట్లు ...చటుక్కున నిలబడిపోయాడు వెంకట్రాముడు. ముందు నడుస్తున్న గౌరి తన వెనుక భర్త అడుగుల చప్పుడు విన్పించకపోవడంతో గబుక్కున ఆగి తలతిప్పి వెనక్కు చూసింది.

"అదేంది? గుదిబండ మాదిరిగా ఆట్ట నిలబడిపోతివి?"- ప్రశ్నించింది గౌరి.

"మామిడి తోట్లో ... మన గుడిసెల దగ్గర్నుంచి యెందో గట్టి గెట్టిగా మాటలు యినపడ్తా వుండాయి"- అన్నాడు వెంకట్రాముడు కాలిన బీడి ముక్కను అవతల పారేస్తూ.

అతడలా అనడంతో టే కాసేపు గౌరి కూడా చెవులు రిక్కరించి ఆలకించింది,

"అవును ... యెందో గెట్టి గెట్టిగా మాటలు యినబడ్తా వుండాయి నాగి గొంతుగా వుంది.

"నాగి గొంతు మాత్రమే గాదు. నువ్వు బాగా యిను. గోయిందుడి గొంతు గూడా యినబడ్తావుంది "

'యిద్దరూ యేమన్నా మారట్లు (పోట్లాట) పడ్తావుండారేమో"- సందేహంగా అంది గౌరి

"యేమొచ్చిందిళ్లకు? పెండ్లైనప్పట్నుంచి యిద్దరూ వొదిగ్గానే వుండారు గదా".

"అంతేనా నీకు తెల్సింది?"- అంది గౌరి, నీకు తెలియని సంగతులు చాలా వున్నాయి అన్నట్టుగా

"అదేందే అట్టంటా వుండావు?"- అన్నాడు వెంకట్రాముడు భార్య వేపు చూస్తూ.

"నాగి గోయిందుడూ శానా దినాల నుంచి యేమిటికో రంపులాడుకుంటా వుండారు."

'అవునా!"

"ఆ నడమ వొక దినం గోయిందుడు నాగిని రొంతు మూడు దెబ్బలు కూడా కొట్టాడు. యేమిటికి కొట్నాడో ఆ పాపం పున్నెం నాకు తెలవదు. నాగి నాతో సెప్పనూ లేదు. నేను దాన్ని అడగనూ లేదు' - అంది గౌరి.

"వొరి వొరి వొరి ... కొట్టేదాకా వొచ్చిందా? వొళ్ళిద్దరూ కల్సిమెల్సి వుండారని నేననుకుంటా వుండానే నాకు యీ కలిమిద్దిమవు (విషయం) తెలవదు పెద్దయ్య కూడా నాతో అన్లేదు సరే పద ఆడికి పోయినాక అన్నీ తెలస్తాయి' వెంకట్రాముడన్నాడు.

అక్కడి నుండి వెంకట్రాముడూ, గౌరి వేగంగా నడిచి పది నిముషాల్లో మామిడి తోటలోని తమ పాక వద్దకు చేరుకున్నారు నర్సయ్య పాకలోంచి గోవిందుడి అరుపులు, నాగి మాటలు యింకాగట్టిగా విన్పిస్తూనే వున్నాయి.




"యిద్దేసిన ముండా! యింటింటి సంగటి తిని కంటి కంటికి కొవ్వు పట్టుండాదే నీకు. ఆడదిగా పుడితే సిగ్గూ లజ్జా వుండొద్దా? థూ నీయమ్మ" ... అరిచాడు గోవిందుడు.

"అమ్మా గిమ్మా అని తలబిరుసు మాట్లంటే యీడెవరూ గొమ్మునుండరు" అంది నాగి.

"గొమ్ము నుండక యెంజేస్తావే లవుడి? నువ్వూ నీ యబ్బా కల్సి నా బొచ్చు గూడా బెరకలేరు."

"ఆఁ ... మీరైతే పెరికేస్తార్లే"

"నోరు ముయ్యే గుడిసేటి ముండా! నిన్ను సేస్కొని నా బతుకంతా నాశనమై పోయింది. నా కొంపలో యింగ నువ్వు చ్చనం గూడా వుండేదానికి యీల్లేదు. నీ పుట్టింటికి సావు."

"నా పుట్టింటికి బొకుండా యీ మాడిలో (మేడలో) నీ దెగ్గర తక్కువ మాట్లన్పించుకొంటా బతికేదానికి నాకేమైనా గాచ్చారమా? (గ్రహచారమా)."

"మాది మాడి కాదే. తాటాకుల గుడిసే. నీ మిండగాడెవుడన్నా మాడిలు కట్టుంటే ... ఆ మాడిల్లోనే బతుకువొ. నీ బతుక్కు మాడి వొకటే తక్కువైంది.

"యేమి? యేమంట నా బతుక్కు" మీ బతుకుల కంటే సెడిపోయిందా నా బతుకు?" .

"నోరు తెర్సినావంటే మూతి పొండ్లన్నీ రాలిపోతాయి. యెబిసారి ముండను నాకంటగట్టి ... నా బతుకులో నిప్పులు బొసిరి"- అన్నాడు గోవిందుడు.

"యెబిశారి గిబిశారి అనకు మాటలు మరియాదగా రానీ"- నాగి గొంతు తీవ్రంగా ధ్వనించింది.

"నీకు మరియాదేందే యిద్దేసిన ముండవి. యిద్దేసిన ముండగాకపోతే కట్టుకున్న ము గుని కంట్లో కారం గొట్టి ... మిండగానితో కులకతావా? అవున్లే ... నీ యిమ్మ నీతిగా బతికుంటే గదా నువ్వు నీతిగా బతికేది. అవు సేన్లో మేస్తే దూడ గట్టు మింద మేస్తాదా? తల్లి సాలు బొల్లిపిల్ల"- వ్యంగ్యంగా అన్నాడు గోవిందుడు.

"నేనూ మా అమ్మేనా సెడిపోయుండేది? నువ్వూ మీ యమ్మా శానా పెద్ద మనుషులా?"

"అరుగాసుదానా! మాయమ్మ పేరెత్తే బగిసి (అర్హత) గూడా లేదే నీకు. యెరుకులోనికి పుట్టిన బవిసి ముండా! నిన్ను ... నిన్ను ..."- గోవిందుడు నాగి జుట్టు పట్టుకుని దబదబా నాలుగు దెబ్బలేశాడు.

తన పాకలో నిలబడి, వాళ్ల మాటల్ని వింటున్న వెంకట్రాముడు ... యిక తను వెళ్ళి అడ్డు పడకపోతే నాగినిని గోవిందుడు చావగొట్టేస్తాడని గబగబా నడిచాడు అప్పటికే నర్సయ్య, మల్లక్కలు అడ్డం పడి కొడుకును వారిస్తున్నారు.

ప్రతి రోజు ఉదయం తొమ్మిది గంటలకు గోవిందుడు రైతుల బర్రెల్ని తోలుకుని మేతకు చెరువులోకి వెళ్ళిపోతాడు. మధాహ్నం ఒంటి గంట ప్రాంతంలో ..రోజూ నాగి తన భర్తకు సంగటి ముద్దల్ని తీసుకుని చెరువులోకి వెళుతుంది.

గోవిందుడు ఆ సంగటిని తిన్న తర్వాత .. నాగి యింటికి వచ్చేస్తుంది. ప్రతి రోజూ విధిగా నాగి చేసే పని యిది. ఆ చెరువులోంచి నాగి తమ పాకకు రావాలంటే ... మధ్యలో వున్న ఆ పొలాల్లో నడిచి రావాలి.

ఆ పొలాల్లో ఏపుగా పెరిగిన చెరకు తోటలు వున్నాయి. ఆ తోటల మధ్య ఒంటరిగా వెళ్ళి వచ్చే నాగిపై... ఆ వూళ్లోని ఓ యువకుడి కన్ను పడింది. యిద్దరి చూపులూ కలిశాక ... వాళ్ళు ఆ చెరకు తోటలో చాలా గ్రంథం నడిపారు. మొదటి నుండి నాగినిని అనుమానిస్తున్న గోవిందుడి కంట్లో అవాళ వాళ్ళిద్దరూ పడ్డారు.

అందుకే యిప్పుడు గోవిందుడు నాగితో పోట్లాట పెట్టుకుని చావగొట్ట-సాగాడు. వెంకట్రాముడు వచ్చి గోవిందుడిని దూరంగా లాగి సర్దడానికి ప్రయత్నించాడు.

మరుసటి రోజు ఉదయాన్నే ... నాగి పుట్టింటికి వెళ్ళిపోయింది.

(ఇంకా ఉంది)

ఎవరన్నారు నేను రిటైర్ అయ్యానని. కొత్త జీవితాన్ని ప్రారంభించానంతే! ప్రతి రోజు చిన్ననాటి స్నేహితులతో కలిసి షికారుగా పార్కుకి వెడతాను. పాట కచేరీలకు, హరికథలకు, గ్రంథాలయానికి వెడతాను. పెరట్లో మొక్కలకు నీళ్ళు పోస్తా. మనవలతో ఆడుకుంటా. ఇలా రోజంతా గడిచిపోతుంది. నేను రెండుపూటలా హార్లిక్స్ తాగుతాను. నా పనులు నేను చేసుకుని, హాయిగా కాలం గడపడానికి హార్లిక్స్ నాకు తోడ్పడుతుంది.

మాల్టెడ్ బార్లీ, వెన్నతో కూడిన పాలు, బంగారు వన్నె గోధుమలలోని పోషక శక్తుల మంచితనమంతా చక్కగా రంగరించబడిన హార్లిక్స్ ఎంతో రుచికరమైన పానీయం.

పోషక శక్తిని సమకూర్చేందుకు ఉత్తమ మార్గంగా అందరు నమ్ముతారు. 100 సంవత్సరాల్సకు పైగా ప్రపంచమంతటా లక్షలాది కుటుంబాలు హార్లిక్స్‌ని నమ్ముకున్నాయంటే ఆశ్చర్యం ఏముంది?







మంచి పుష్టికరమైనది

HMM-9046 TEL

# పితృదేవోభవ

## గోవిందరాజు రామకృష్ణారావు

స్కూటర్ బయటే స్టాండు వేసి ఇంట్లోకి దూసుకు వస్తూ 'వసూ . వసూ' అంటూ కేక పెట్టినట్లు పిలిచాడు జానకిరాం బూట్లన్నా విప్పకుండా వంటింటి గడప దగ్గరకెళ్లి 'ఇంకా తెమల్లేదా నువ్వు . చా . ఎంత చెప్పినా నీకు చెవికెక్కదు అవతల ఫ్రెండ్స్ ఫ్యామిలీస్‌తో వచ్చి ముందుగానే మేనేజర్ని కలుస్తారు హాలుదగ్గర. వాడి కూతురు అరంగేట్రం అని పొద్దునే చెప్పాగా వాడసలే తిక్క వెధవ. ఇలాంటి ఫార్మాలిటీస్ అంటే పడి చస్తాడు' గుక్క తిప్పుకోకుండా చెబుతున్నాడు

పుల్కాల కోసం తడిపి ముద్ద చేస్తున్న గోధుమపిండి వంక చూస్తూ 'ఎందుకలా అరుస్తారు నాకేం చెవుడులేదు.' వసుధ పుల్ల విరుపుగా అంది పీటపైన ముద్దను గట్టిగా కొడుతూ

'అంటే నీ ఉద్దేశం' కోపంగా అడిగాడు

'కనిపించటంలా! నేను వూరికే కూచోలా పుల్కాలు ఎవరు చేస్తారు' చిరాకుపడింది

జానకిరాంకి వెంటనే జవాబు తోచలేదు. వెళ్లి బూట్లు విప్పి మూలపడేశాడు. టవల్ తీసుకుని వాష్ బేసిన్ వైపు వెళ్తూ 'ఆ పని ఆపెయ్' కసిరాడు

'డోంట్ బి సిల్లీ'. సీరియస్‌గానే చెప్పింది

జానకిరాం షాక్ తిన్నాడు

'మీకేం మగమహారాజు ఆయనగారికి అన్ని అమర్చాలా వద్దా' నిలదీసినట్లడిగింది.

కోపం నసాలానికి పాకింది వంటింట్లోకి వెళ్లి స్టౌ ఆర్పేసి వసుధని చెయ్యి పుచ్చుకుని ఇవతలికి లాక్కొచ్చాడు హఠాత్సంఘటనకి ఆశ్చర్యపడింది వసుధ.

'మీకు మతిపోయిందా?'

'అవును . గేట్ రెడి ఇన్ టెన్ మినిట్స్' ఆజ్ఞాపించాడు

పరిస్థితి గ్రహించింది.

'ఆయనగారికి రాత్రి భోజనం?' తమాయించుకుని అడిగింది.

'మళ్లీ వచ్చాక చూద్దాం. ఒక్క పూటకి ప్రమాదం ముంచుకురాదు' తేలికగా సమస్య పరిష్కరించాననుకున్నాడు

'మీకేం అనేశారు నిందపడేది నేను' నిష్ఠూరంగా అంది.

'నిందాలేదు - బొందా లేదు. ఇలా అమర్చి అన్నీ చేస్తుంటే ముసలాయన ఇక్కడే తిష్ట వేస్తాడు. ఇప్పటికే మూడు వారాలయింది కిందటి వారమే తమ్ముడు దగ్గరికి వెళ్లిపోతాడనుకున్నాను.'

'ఇవ్వాళేదో వుత్తరం వొచ్చిందాయనకి'

'నాకవన్నీ తెలియవు. ఒకటి రెండు రోజులు చూసి నేనే చెబుతా . ' చిరాకుగా అన్నాడు.

'ఏమని చెబుతారు?' రెట్టించింది.

'తమ్ముడు దగ్గరికి పొమ్మని మాట ప్రకారం వుండాలి లేకపోతే ఏమిటి. న్యూసెన్సు. నాకు మాట తప్పితే చిర్రెత్తుకొస్తుంది' జానకిరాం కంఠం మళ్లీ స్థాయి పెంచుకుంది.

'ఎందుకలా ఇదవుతారు ... ఆయన షికారుకెళ్లి తిరిగొచ్చే టైమయింది' హెచ్చరించింది.

'వస్తే రానీ . నాకేం భయమా స్పష్టంగా చెప్పేస్తా '

'చాల్లెండి ఈ వాదనెందుకు'

'వాదనకాదు జరిగేదే అంత. నువ్వు త్వరగా చీర మార్చుకు బయలుదేరు.'

'కొంచెం కాఫీ కలిపిస్తా'

'అక్కర్లేదు. ఆఫీసులో ఫ్రెండ్స్‌తో ఇప్పుడే తీసుకున్నా .. కమాన్ గెట్ రెడి. క్విక్'

నలతగా వుండి షికారు కెళ్ళలేక మూలగదిలో మంచంమీద పడుకుండి పోయిన రామ్మూర్తి తన చెవుల్ని తాను నమ్మలేకపోయాడు. ఆ వయస్సులో మరొకరికయితే ఆ మాటలు విన్న మెదట మెదడు నరాలు చిట్లిపోయేవి

రామ్మూర్తి తత్వం వేరు జీవితం అంటే సాకల్యంగా తెలిసినవాడు. లోకంపోకడ గ్రహించినవాడు. అందుకనే ఉద్రేకపడలేదు.

ఆపుకోవాలని ఎంత ప్రయత్నించినా దగ్గు తెర ఆగలేదు గట్టిగా దగ్గుతూ వరండాలోకి వచ్చాడు' బయట వుమ్మివేయడానికి.

అప్పటికి రెడి అయిన జానకిరాం తండ్రి షికారు నుంచి తిరిగి వచ్చాడనుకున్నాడు.

వరండాలోకి వచ్చి, మేం డాన్సు ప్రోగ్రాంకి వెళ్తున్నాం. వచ్చేటప్పటికి తొమ్మిది దాటుతుంది.'

'ఫర్వాలేదురా. ఈ పూట ఎందుకో ఆకలిగా లేదు. రెండు అరటిపళ్ళున్నాయ్ తిని పడుకుంటాను.'

'నీ యిష్టం'

ఇంతలో సుధ కూడా వచ్చింది.

ఇద్దరూ స్కూటర్‌పైన వెళ్లిపోయారు.

రామ్మూర్తి వాలు కుర్చీ తెచ్చుకుని వరండాలో వేసుకున్నాడు. కూర్చుని వీధి వెంట వెళ్లేవాళ్ళని యాంత్రికంగా చూస్తున్నాడు.

గతం అంతా నెమరువేసుకుంటూ కుంగి కృశించడం రామ్మూర్తి నైజానికి సరిపడదు. పద్ధతి ప్రకారం బ్రతుకు సాగించడం అలవాటు. ముప్పై అయిదేళ్ళు తనని కంటికి రెప్పలా చూసుకున్న ఇల్లాలు పార్వతి హఠాత్తుగా కన్నుమూసి తనని ఒంటరి చేసి హాయిగా తృప్తిగా పసుపుకుంకమలతో ఏణ్ణర్థం క్రితం వెళ్లిపోయినప్పుడు కూడా పైకి నిబ్బరం సడలలేదు. గుండెల్లో సముద్రాలు పొంగినా ఆ వురవడిలో కొట్టుకుపోలేదు.

భవిష్యత్తు కీకారణ్యంలా తోచింది. అయినా దారి వెతుక్కోక తప్పదని తెలుసు. ఇద్దరు కొడుకులు ఆలోచించుకుని చెప్పారు. రెండు వారాలు ఒకరింట్లో, మరో రెండు వారాలు ఇంకొకరింట్లో వుండేటట్లు నిర్ణయించారు సరేనన్నాడు

ఈ పదిహేను మాసాలుగా కొడుకులూ కోడళ్ళూ ప్రవర్తిస్తున్న తీరు గమనించకపోలేదు జాగ్రత్తపడాలని కూడా గ్రహించాడు. కాని యివాళ తాను చెవులార విన్న మాటలు ముందు జీవితం గురించి తీవ్రంగా ఆలోచింపచేసేవిగా వున్నాయి.

క్రిందటిసారి రెండో కొడుకు దగ్గర వున్నప్పుడు' నీకేవయ్యా రామ్మూర్తీ! అదృష్టవంతుడివి రామలక్ష్మణుల్లాంటి కొడుకులు. రెండు కళ్ళు. త్వరలో నీకు బ్రహ్మాండంగా షష్టిపూర్తి మహోత్సవం జరుపుతారయ్యా' అని స్నేహితుడన్న మాటలు గుర్తొచ్చి లోలోన నవ్వుకున్నాడు

మధ్యాహ్నం రెండో కొడుకు రాసిన ఉత్తరం చదివినప్పటి నుంచి దానిని పెద్దవాడికి చూపాలా వద్దా అని ఆలోచిస్తున్నాడు జానకిరాం రాక ముందు. ఆ సమస్య తీరిపోయింది. ఇక ఆ వుత్తరంలోని సంగతులు ఎవరికి చెప్పనవసరంలేదు

తానే మరోసారి చూద్దామనుకున్నాడు లేచి వెళ్లి తీసుకొచ్చాడు కళ్ళు చదువుతున్నాయి:

'పూజ్యులైన నాన్నగారికి,

నమస్కారాలు.

క్రిందటి వారం ఇల్లు మారాం. ఇప్పుడున్న యిల్లు ఆఫీసుకి కొంత దగ్గరగా వుంది వెనకటి యింటాయన అద్దె పెంచమని గోల చేస్తున్నాడు. పైగా నీళ్ళు సరిగా రావడంలేదు. కొత్త యింట్లో నీళ్ళ యిబ్బందిలేదు కాని యిల్లు చాలా చిన్నది చుట్టుపక్కల వున్న వాళ్ళు మంచివాళ్లే మీ కోడలు రాధకి నచ్చింది. ఇద్దరు పిల్లల బడికి కూడా దగ్గరవుతుంది

అన్నయ్యకి తర్వాత విడిగా ఉత్తరం రాద్దామనుకుంటున్నాను. రాధకి ఈ మధ్య ఒంట్లో అంత బాగా వుండడంలేదు. పిల్లలతో సతమతమవుతోంది. డాక్టరుకి చూపించాను. మందులు రాసిచ్చి విశ్రాంతి తీసుకోవాలన్నాడు ఈ వివరాలన్నీ అన్నయ్యకి నెమ్మది మీద రాస్తాను.

ఊళ్లో ఇంటి సగం వాటా అద్దె నాకు సరిగా

పంపడంలేదు. అన్నయ్యవాటా అద్దె నెల నెలా పంపుతున్నారనుకుంటున్నాను. మీరు ఒకసారి అద్దెకున్నాయనకి గట్టిగా ఉత్తరం రాయండి. అన్ని ధరలు పెరిగిపోవడంతో డబ్బుకి యిబ్బందిగా వుంది.

ఇప్పుడు మీరిక్కడికి వస్తే ముఖ్యంగా చిన్న యిల్లు కాబట్టి యిబ్బందిగా వుంటుంది. అక్కడున్న యిల్లు పెద్దది. మీ కోసం విడిగా ఒక గది ఏర్పాటు చేశారుగదా! కాబట్టి తిరిగి ఇక్కడ పరిస్థితి అనుకూలం అయ్యేవరకూ మీరు అక్కడే వుండడం మంచిది. ఈ సంగతి అన్నయ్యకు రాస్తాను. అక్కడ బాదరబందీ లేదు. రఘు పబ్లిక్ స్కూల్లోనే వుంటున్నాడు. కనుక ఒదినకి పని తక్కువ. అందుచేత ప్రస్తుతం మీరు అక్కడే వుండండి. అన్నయ్యకీ ఒదినకీ నమస్కారాలని చెప్పండి.

ఇట్లు మీ
చిన్నా.

ఉత్తరం మడిచి జేబులో పెట్టుకున్నాడు. పకడ్బందీగా రాసినందుకు కొడుకు ప్రయోజకత్వాన్ని మెచ్చుకున్నాడు. దాని ప్రభావం ఎటువంటిదో వూహించేందుకు రామ్మూర్తికి ఎక్కువసేపు పట్టలేదు.

ఇక చేయవలసిందేమిటి?

జీవితంలో ఇంతవరకు ఎవర్నీ ప్రాధేయపడలేదు రామ్మూర్తి. ఎంత పెద్ద చిక్కు ఎదురైనా నిభాయించుకుని ముందుకుపోవడమే అతనెరుగు.

ఇప్పుడేం చేయాలి? పనులన్నీ నిర్ధారించుకోసాగాడు. చిన్నాని కోడల్నీ, మనవడూ మనవ రాల్నీ చూడాలనిపిస్తున్నా ఉత్తరం గట్టిగా మందలిస్తోంది.

పెద్దాడి కొడుకు రఘుని వెళ్ళి ఒకసారి చూసి రావాలి. దానికి యిబ్బంది ఉండదు.

ఊళ్ళో వున్న యిల్లు ఇద్దరు కొడుకుల పేరా రాసిచ్చాడు కాబట్టి గొడవలే వుండవు. చిన్నా కోరిన ప్రకారం అద్దె నెలనెలా సరిగా పంపమని రాయాలి.

రిటైరయ్యాక వచ్చిన డబ్బు కొంత ఫిక్సెడ్ డిపాజిట్‌లో వేసి మిగిలింది కొడుకులికి అప్పుడే యిచ్చేశాడు. ఆ సమస్య కూడా వుండదు. పోతే బ్యాంక్‌కి వెళ్ళి మేనేజరుతో కొన్ని విషయాలు మాట్లాడాలి. వెంటనే కాశీకి వుత్తరంరాసి పడేయాలి.

పెట్టె ఒకటి గట్టిది కొనుక్కోవాలి.

రెండు మూడు రోజుల్లో తాను వెళ్ళిపోతున్నట్లు వెంటనే పెద్దాడికి చెప్పాలి. వాడి మనస్సు కుదుటపడుతుంది. తనవల్ల ఎవరికీ యెటువంటి యిబ్బంది కలగకూడదు.

రామ్మూర్తి మనసు తేలికపడింది. మబ్బుల్లా కమ్ముకున్న సమస్యలు తొలగిపోయాయి.

కుర్చీ మడిచి గదిలో పెట్టాడు.

ఆకలిగా వుంది.

పొద్దున గూట్లో పెట్టిన అరటిపళ్ళు తిందామనుకున్నాడు. అక్కడవి లేవు.

కూజా వంచి గ్లాసు నిండా నీళ్ళు పట్టుకుని గటగటా తాగి మంచంమీద నడుం వాల్చాడు. అనుకున్న పనులన్నీ రెండు మూడు రోజులలో పూర్తి చేయడం చాలా అవసరం. పెందరాళే లేవాలనుకున్నాడు.

* * * *

జానకిరాంకి సామాన్యంగా ఆఫీసు అడ్రసుకి ఉత్తరాలు రావు. కవరు మీద దస్తూరి తన తండ్రిదని పోల్చుకున్నాడు. కొంపతీసి మళ్ళీ వస్తున్నానని రాయడం లేదుకదా! అనే సందేహం కలిగింది. వచ్చేందుకు డబ్బు పంపమని ఇంటికి రాస్తే వసుధ ఏమనుకుంటుందోనని ఆఫీసుకి రాసి వుంటాడు.

కవరు నెమ్మదిగా చించి ఉత్తరం బయటికి తీశాడు అది రామ్మూర్తి కాశీనుంచి రాసిన ఉత్తరం:

'చిరంజీవి జానకిరాంకి-

ఆశీస్సులు.

నాన్నా అవున్రా. మా నాన్న పేరు పెట్టుకున్నాను గదా నీకు. పుట్టినప్పట్నుంచి నిన్నలాగే పిలుస్తున్నాను.

ఈ వుత్తరం కాశీ నుంచి రాస్తున్నందుకు ఆశ్చర్యపడుతున్నావా? మీరనుకున్నట్లు నేను చిన్నా దగ్గరికి వెళ్ళలేదు. వాడు నీకు ఉత్తరం రాసి వుండడు. నాకు రాసిన ఉత్తరంలో వాడి యిబ్బందులు చెప్పాడు. చిన్న యింట్లోకి మారారట. నేను అక్కడికి వెళ్తే యిబ్బందిగా వుంటుందని రాశాడు.




ఇక మీ సంగతి నాన్నా! అరంగేట్రానికి వెళ్ళే ముందు నువ్వూ కోడలూ వాదించుకోవడం అంతా నా చెవిని పడింది. ఓపిక లేక ఆనాడు షికారుకి వెళ్ళలేకపోయాను. మీరన్న దాంట్లో తప్పులేదు. ఎవర్నీ నిందించడంలేదు.

ఇక్కడ అన్ని ఏర్పాట్లు బాగానే ఉన్నాయి. సేవాశ్రమంలో వున్నాను. ఇదివరకే వీళ్ళకి రాసి సంగతులు తెలుసుకున్నాను.

బ్యాంక్ మేనేజరుతో అన్ని విషయాలు మాట్లాడాను. ఎఫ్. డి.పైన నెల నెలానాకు వడ్డీ ఇక్కడికే పంపుతారు. అవసరమైన పత్రాలు బ్యాంకులోనే భద్రపరిచాను. మూలగది టేబుల్లో కవరుంది. కాపీలందులో వున్నాయి.

నేను వున్నంత కాలం వడ్డీ కాశీకి పంపుతారు. ఎప్పుడు పంపడం ఆపుచేయాలో సేవాశ్రమం నుంచి కబురొస్తుంది.

అటుతర్వాత ఆ డబ్బు నీకు సగం, చిన్నాకి సగం ఇవ్వాలని కూడా బ్యాంకికి రాసిచ్చాను. డబ్బు మీ యిద్దరికీ తప్పకుండా ఇస్తారు.

నేను ఇక కాశీలోనే వుంటాను. శేష జీవితం ప్రశాంతంగా గడుపుతాను. నా గురించి నీకూ చిన్నాకి సమస్యలుండవు. చిన్నాకి కూడా వుత్తరం రాస్తున్నాను.

చి. రఘుకి బాగా చదువు చెప్పించి గొప్పవాణ్ణి చెయ్. చి. సౌ. కోడలు వసుధకి దీవనలు.

నేనుండేది అన్నపూర్ణా సేవాశ్రమం. మణికర్ణికఘాట్‌కి రెండు ఫర్లాంగుల దూరంలో వుంది. నేను మీ అమ్మ దగ్గరికి వెళ్ళేవరకూ ఈ ఆశ్రమంలోనే వుంటాను. వెళ్ళిన సంగతి ఆశ్రమంవాళ్ళు తెలియజేస్తారు.

మీ అందరినీ మరోసారి మనసారా దీవిస్తున్నాను.

ఇట్లు
మీ నాన్న
రామ్మూర్తి. □

# సెక్స్ ఎడ్యుకేషన్ అవసరమా? – చర్చ

## ప్రకృతే నేర్పుతుంది



సెక్స్ జీవితావసరాలలో ఒకటి అనడం సమంజసమే. అంతేకాదు 'టీనేజర్స్'లో సెక్స్‌కి సంబంధించి కొన్ని సందేహాలు, కొంత ఆందోళనా కూడా వుంటుంది. ఈ కారణంగా వాళ్ళు తమ దృష్టిని చదువుపై కేంద్రీకరించ లేరు. అటువంటపుడు తల్లిదండ్రులో, తోడబుట్టిన వారో, ఉపాధ్యాయులో కొంత ఓర్పుతో విడమరచి చెప్పడం ద్వారా వారి సందేహాలని తీర్చవచ్చు. అంతేకానీ సెక్స్‌కి ఒక శాస్త్ర ప్రాముఖ్యత నిచ్చి పాఠశాలల్లోను, కళాశాలల్లోను బోధించవలసిన అవసరం లేదు. మానవ పురోభివృద్ధికి అవసరమంటూ ఇప్పటికే మనం లెక్కకు మిక్కిలిగా ఎన్నో సబ్జెక్ట్స్‌ని విద్యార్థులపై పెట్టాం. వాటితోనే సతమత మవుతున్న విద్యార్థి లోకానికి మళ్ళీ ఇదొక బరువెందుకు? అయినా మన చుట్టూ వున్న ప్రకృతిని కొంత నిశితంగా పరిశీలించితే యువతరం తమ సందేహాల్ని కొంత వరకు తీర్చుకోవచ్చు. ప్రకృతి, తల్లి మనకు ఆది గురువులు కదా?!

–జి. నళిని, తాడికొండ

## హానే ఎక్కువ



స్త్రీ పురుషులకు సెక్స్ అనేది వైవాహిక జీవితంలో ఒక భాగం మాత్రమే. అది భార్యా భర్తల మధ్య వుండే అనక్తిని బట్టి అర్థం చేసుకోవచ్చు. అంతే కాని కాలేజీలలో ఒక క్లాసు పెడితే చాలామందిని కాలేజీలు మాన్పించేసి ఇంట్లో కూర్చో పెడతారు. అసలు సెక్స్ అంటేనే ఆమడ దూరం పరుగెత్తే తల్లిదండ్రులు, కేవలం ఒక మగవానితో మాట్లాడితేనే వీళ్ళకు ఏ పరిచయమో అని అనుమానించే వాళ్ళు సెక్స్ ఎడ్యుకేషన్ గురించి అర్థం చేసుకోలేరు. ఇప్పుడిప్పుడే పల్లెటూళ్ళలో వుండే పిల్లలని ఆ దగ్గరలో వున్న కాలేజీలకు పంపిస్తున్నారు. సెక్స్ ఎడ్యుకేషన్ పెడుతున్నారు అని తెలిస్తే అసలు పంపించరు, అందువలన చదువుకునే వయసులో ఇది అంత అవసరంలేదు; కాబట్టి ఇది పెట్టకపోయినా నష్టంలేదు. సెక్స్ ఎడ్యుకేషన్ పెడితేనే కొంత నష్టం కలుగవచ్చు అని నా అభిప్రాయము.

- జి. లక్ష్మీకాంతమ్మ, శింగరాయకొండ

## మంచిదికాదు



సెక్స్ ఎడ్యుకేషన్ అవసరమా! అనే శీర్షికపై నాగార్జున యూనివర్సిటీ విద్యార్థుల అభిప్రాయాలు బాగానే వున్నాయి. కాని ఎంత వరకు? ఇది నేటి యువతరంపై అనేక పరిణామాలకు దారి తీస్తుంది. నేటి సినిమాలు స్త్రీని అర్ధనగ్నంగా చూపెంచడం వంటి అగౌరవమైన పనులతోనే బాధపడుతున్న స్త్రీలు, ఇంకా సెక్స్ ఎడ్యుకేషన్ కూడా ప్రవేశపెట్టి క్లాసేలలో సెక్స్ గురించి బహిరంగంగా చెపుతుంటే ఎంత అవమానమో తెలుసుకొనుట కూడా అవసరమే! ఆడపిల్లలను బయటికి పంపటానికే జడిసే ఈ రోజులలో ఈ సెక్స్ ఎడ్యుకేషన్ కూడా ప్రవేశపెట్టి ఇంకా వాళ్ళని బాధపెట్టవద్దు. యువతరం అనేక చెడు దారులలో పడతారు. సెక్స్ అనేది యువతీ-యువకుల మధ్య ఒక ప్రకృతిసిద్ధమైన సహజ చర్య. యువతీ యువకులు కౌమార దశలలో ప్రవేశించి-నపుడు వయస్సుతో పాటు సెక్స్ గురించికూడా అవగాహన వస్తుంది. కాబట్టి ప్రస్తుత పరిస్థితులలో సెక్స్ ఎడ్యుకేషన్ ప్రవేశ పెట్టడం మంచిదికాదని నా అభిప్రాయం.

- యేచినేని అనూరాధ,
అశ్వారావుపేట

## అనవసరం



మనిషి, జీవితం, సెక్స్. మనిషికి జీవితం కావాలి. జీవితంలో సెక్స్ కావాలి. మనిషి మనిషిలాగే ప్రవర్తిస్తే జీవితం అంటే ఏమిటో అర్థం అవుతుంది. అలా ప్రవర్తించలేనప్పుడు సెక్స్ వ్యామోహం మాత్రమే. యువతరానికి మనం ఉన్నత స్థాయిలో వుండాలి అనే భావనకలగాలి. చదువు విషయంలో లేనిప్రాధాన్యత'సెక్స్‌ని ఎలిమెంటరీ స్థాయి నుంచి ప్రవేశపెట్టండి" అనే భావనలోనికి దిగజారాము. అదేమిటి అని అంటే తెలియని విషయాన్ని తెలుసుకుందాం అంటారు. మరి తెలిసిన చదువు గురించి? అందుకే 'వివాహ' బంధం అర్థం పోయింది. మాతృమూర్తికి విలువ తగ్గిపోయింది. సెక్స్ ఎడ్యుకేషన్ అనవసరం అని నా భావన.

పాలడుగు లక్ష్మి, ఉయ్యూరు

## అవసరంకాదు అనర్థదాయకం



నేటి మన విద్యా విధానంలో సెక్స్ ఎడ్యుకేషన్ ప్రవేశ పెట్టడం అవసరం లేదు సరికదా అనర్థదాయకం కూడాను! ఎందుకంటే స్థిరత్వంలేని ఆలోచనా సరళి యువతీ యువకులలో ఉంటుంది. ఆ సమయంలో ఈ 'సెక్స్' గురించిన అవగాహన అనేది ఎంత ప్రమాదం తెచ్చిపెడుతుందో ఊహించవచ్చు. యువతీ యువకులు మానసిక వ్యభిచారం చేస్తుంటారనే 'రవి'గారి అభిప్రాయం ఏకీభవించదగ్గది కాదు. అలాంటి వారు ఎక్కడో ఒకరుంటారు. సెక్స్ ఎడ్యుకేషన్ వల్ల మానభంగాల సంఖ్య తగ్గుతుందనే 'శేషగిరి' గారి అభిప్రాయంలో అర్థంలేదు. ఎందుకంటే 'మానభంగం' అనేది ఇష్టంతో ప్రమేయం లేకుండా జరుపబడేది కదా మరి! అదెలా సాధ్యం?

'ఎ' సర్టిఫికెట్ సినిమాలు చూసి, సెక్స్ పుస్తకాలు చదివి యువతరం నాశనమౌతున్న 'విల్సన్ ఆలూరి'గారి అభిప్రాయం ఒప్పుకోలేనిది. ఎందుకంటే చెడిపోయే వాళ్ళు అలాంటివి చూడక పోయినా చెడిపోతారు. చిత్త చాపల్యం లేని వాళ్ళు ఎందుకు నాశనమవుతారు చెప్పండి? సెక్స్ గురించిన అవగాహన ఉంటేనే మనం అభివృద్ధిని సాధించగలం అనే 'రాంబాబు' గారి మాటలు నేను హర్షించను.

ప్రకృతిసిద్ధంగా మనిషిలో వయసు పెరిగేకొలది ఎన్నో మార్పులు వాటంతటవే జరుగుతున్నాయి.

ముఖ్యంగా ఈ సెక్స్ ఎడ్యుకేషన్ స్త్రీలకు చాలా ఇబ్బందికరమైనది. స్త్రీ సహజమైన సిగ్గు చదివేందుకు అడ్డొస్తుంది. పురుషుల ద్వారా సెక్స్ గురించిన విషయాలు వినటం కన్నా దౌర్భాగ్యం ఇంకొకటి ఉండదు. వయసుతో పాటు మనిషి ఆలోచనల్లో, అవగాహనలో మార్పు, ఎదుగుదల తప్పకుండా వస్తాయి.కాబట్టి సెక్స్ గురించి ప్రత్యేకంగా పనిగట్టుకొని మరొకరు చెప్పవలసిన అవసరం ఉండదని నా అభిప్రాయం.

- సంధ్యా బొంతల, కర్నూలు □

# రేసుగుర్రాల ఉత్పత్తితో పరుగు పందెం!



ఆక్సిడెంటల్ అరేబియన్ మందలోని రేసుగుర్రాలు

గుర్రపు పందాలు లక్షలతో కూడుకొని ఉంటాయి. ఈ అభినవ జూదం నేడు విశ్వవ్యాప్తంగా వ్యాప్తి చెంది ఉంది. ప్రపంచ ప్రసిద్ధమైన డెర్బీ, ఓక్స్, సెయింట్ లెజర్, అస్కాట్ గోల్డ్‌కప్, ఎక్లిప్స్ స్టేక్స్, ఛాంపియన్ స్టేక్స్ వంటి గుర్రపు పందాల గురించి తెలియనివారు చాల తక్కువమంది ఉంటారు. ఇటీవల జరిగిన డెర్బీ గుర్రపు పందెంలో గెలుచుకొన్న మొత్తం లక్షా నలభైవేల పవుండులు! ఊహాతీతంగా పెరుగుతున్న ఈ మొత్తాల కోసం గుర్రపు పందాలంటే ప్రపంచ పర్యంతంగా ప్రజలు ఎగబడుతున్నారని అనుకొంటే పొరపాటేమి ఉండదు.

గుర్రపు పందాలలో అదృష్టంతో పైచేయి అయినా గుర్రాల శక్తి సామర్థ్యాలపైనే అవి ఆధారపడి ఉంటాయని చెప్పకతప్పదు. గుర్రం ఎంత వేగంగా పరిగెత్తేదే అయినా, దానిని పరిగెత్తించగల జాకీ కూడా ముఖ్యమే! ఎలా విశ్లేషించుకొన్నా గుర్రము, అది పరిగెత్తగల వేగము– ఇవి రెండే రంగంలో ప్రధానమైన అంశాలుగా కనిపిస్తాయి. దీంతో రేసుగుర్రాల వేట మొదలైంది. ఈ రేసుగుర్రాలను ఉత్పత్తి చేసే కేంద్రాల సంఖ్య దినదిన ప్రవర్ధమానమవుతోంది. దీనికి కారణం రేసుగుర్రాలు పలుకుతున్న ధరలేనని చెప్పకతప్పదు. 1964లో డెర్బీ కప్పుని గెలుచుకొన్న శాంతాక్లాస్ అనే గుర్రం నాలుగులక్షల పౌండ్లకి అమ్ముడు పోయింది. 1970లో గెలిచిన నిజిన్‌స్కి అనే గుర్రం ఇప్పుడు 22,50,000 పౌండ్లకి సిండికేట్ చేయబడింది. అన్నింటికంటే అధికంగా 1976లో ఒక అమెరికన్ రేసుగుర్రము ఎనిమిది మిలియన్‌ల డాలర్‌లకి సిండికేట్ చేయబడటం అపూర్వమైన విషయంగా చెబుతారు. గుర్రపు పందాలలో పాల్గొంటే వచ్చే మొత్తాలకన్నా, గుర్రాల రేట్లే ఎక్కువగా ఉండటం ఆశ్చర్యాన్నీ, ఆందోళననీ కలిగిస్తాయి. ఈ వేలం వెర్రి ఏ పరిణామాలకి దారితీస్తుందో చెప్పటం కష్టంగా ఉంది.

గుర్రాల పనితనాన్ని గుర్తించటానికి వాటి ఎత్తు, కాళ్ళ పొడవు, శరీరం పరిమాణం, గుండె వైశాల్యం పరిగణనలోకి తీసుకోవాలని డబ్లిన్ విశ్వ విద్యాలయానికి చెందిన ప్రొఫెసర్ పాట్రిక్ కన్నింగ్‌హామ్ అభిప్రాయపడతారు. గుర్రాల వేగం కాలాను క్రమంగా పడిపోతోందని కూడా ఈయన అంటారు. వేగంగా పరిగెత్తే మగ, ఆడ గుర్రాల మధ్య సంపర్కం జరిపిస్తే వేగంగా పరిగెత్తే గుర్రాలు పుట్టే అవకాశం ఉంది. కాని అన్ని వేళలా అలా జరిగే అవకాశం లేదని ఈయన చెప్పే మాటల్లో ఎంతైనా వాస్తవముంది. వేగంగా పరిగెత్తే గుర్రాలని సృష్టించి పందాలలో పాల్గొనేలా చేసినా, ప్రమాదవశాత్తు వాటికి దెబ్బతగిలితే శ్రమంతా వృథాయేకదా అనే సందేహం ఎవరికైనా వస్తుంది. అంగవైకల్యం పొందిన రేసుగుర్రాలకి నష్టపరిహారం చెల్లించటం పరిపాటే. బ్రిటన్‌లోని అఫిషియల్ హాండి క్యాపర్ అఫ్ ది జాకీ క్లబ్ అటువంటిదే! జాకీలకే కాదు, గుర్రాలకి కూడా సహాయం అందుబాటులో ఉండటం అభినందించదగ్గ విషయమే!

గుర్రాలని ఉత్పత్తి చేసే కేంద్రాలు బ్రిటన్, జపాన్, అర్జెంటినా, దక్షిణ ఆఫ్రికా, యునైటెడ్ స్టేట్స్, జెకొస్లొవేకియాలలో ప్రముఖంగా ఉన్నాయి. మామూలుగా గుర్రాలు రెండు సంవత్సరాలకి యుక్తవయసుకి వస్తాయి. అయితే 3, 4 సంవత్సరాల వయసులో గర్భం చేసేశక్తి, గర్భధారణ శక్తి అధికంగా ఉంటాయి. చలికాలంలో సాధారణంగా గుర్రాలు కలుసుకొంటాయి. ఒక మగ గుర్రం ఎన్ని ఆడగుర్రాలతోనైనా కలవగలదు. మగ, ఆడ గుర్రాల మధ్య సంపర్కం హీన పక్షం 3-4 సార్లు జరిగితే గర్భం వచ్చే అవకాశం ఉంటుంది. ప్రతి మగగుర్రం సంభోగ ప్రక్రియలో 10-12 సంవత్సరాల వయస్సు వచ్చేవరకు పాల్గొనే శక్తిని కలిగిఉన్నా అంతకాలంపాటు వాటికి అవకాశాన్ని ఇవ్వరు. ఈ విధంగా వేగం, ఎత్తు, కాళ్ళ బలిష్టత మొదలైన అంశాలకే ప్రాధాన్యాన్ని ఇచ్చి– తెగల విషయం పెద్దగా పట్టించుకోకుండా– గుర్రాల మధ్య సంపర్కం జరిపించడంవల్ల పుట్టుకొచ్చే క్రొత్తతరంలో– వేగం సంగతి ఎలా ఉన్నా– ముక్కునించి రక్తం కారడం, బలహీనమైన మోకాళ్ళు రూపొందడం, రోగ నిరోధకశక్తి తగ్గిపోవడం వంటి దుర్లక్షణాలు ఏర్పడే అవకాశం కూడా గణనీయంగానే ఉంటాయని పశువైద్యశాస్త్ర నిపుణులు ప్రకటిస్తున్నారు.

గుర్రాల ఉత్పత్తి కూడా ఒక రేసులాగా మారిన ఈ తరుణంలో ఈ సలహాలు ఎంత వరకు పాటించబడుతాయో చెప్పటం కష్టం! ఆర్థిక దుర్వ్యవస్థ ఏర్పడటమే కాకుండా, గుర్రాల భద్రతకి కూడా ముప్పువచ్చే అవకాశముందని గ్రహించడం చాల అవసరం!

–డాక్టర్ గుమ్మనూరు రమేష్‌బాబు

గత దశాబ్దపు డెర్బీ హీరోలు ఈ రేసు గుర్రాలు



సీరియల్

# కరిగిన శిల



రావినూతల సువర్ణాకన్నన్

(గత సంచిక తరువాయి)

శాంతమ్మ ఇల్లు నాలుగు గదులు, వరండా, చుట్టూ కాంపౌండ్ వాల్, ఇంటి చుట్టూ అందమైన పూల మొక్కలు. . చూడ ముచ్చటగా వుంటుంది. అయితే ఆ ఇల్లు ఓ పెడగా వుండి విసిరేసినట్టు ఒంటరిగా వుంటుంది.

ఓ వైపు పార్కు, మరోవైపు పాడుపడ్డ ఓ పెంకుటిల్లు వుండి రాత్రిపూట నిర్మానుష్యంగా వుండడంతో కొత్తవారిక్కాస్త భయం కలుగుతుంది

అక్కడికి ఒక అరఫర్లాంగు దూరంలో అందమైన, విశాలమైన భవంతి ఒకటి అమావాస్య రాత్రుల్లో కూడా వెలిగిపోతూంటుంది. దానిపేరు "వంశధార".

ఆ భవంతి యజమాని ఎస్.పి. రామారావు. ఆయనకి, బ్రహ్మాండమైన క్వార్టర్స్ వున్నా... రాజభవనాన్ని తలదన్నేట్టుండే తన భవంతిలో తప్ప అక్కడ వుండడు.

ఆయనగారికి ఒకే ఒక్క సంతానం శ్యామల. ఎం.బి.బి ఎస్. పాసై ప్రాక్టీస్ పెట్టడానికి సిద్ధంగా వుంది.

శ్యామలకి అందాలరాశి, కాలేజీ బ్యూటి అన్న పేర్లున్నాయి. ఆడపిల్లలకుండవలసిన ఆకర్షణలున్నాయి. లంకంత ఇల్లుంది, కొండంత సంపదుంది, పడవంత కారుంది, తోడేల్లాంటి కుక్కలున్నాయి. ఇంకా ఇంటినిండా నౌకర్లున్నారు. ఇంట బైట స్నేహితులున్నారు. ఒక్కమాటలో చెప్పాలంటే కలవారికుండాల్సిన హంగులన్నీ వున్నాయి. వీటికితోడు అహం, దర్పం కూడా మెండుగా వున్నాయి.

అయితే ఆమెకి లేనివి కూడా కొన్నున్నాయి. అవే సహనం, ఓర్పులాంటివి!

అయినదానికి కాన్దానికి ఊర్కే చిరాకుపడిపోతుంది.

పేషెంట్ మూలిగితే చిరాకు !

టి.బి. పేషెంట్ దగ్గితే చిరాకు !

పసిపిల్లలు ఏడిస్తే చిరాకు.

నిద్రలో లేపితే మరీ చిరాకు.

ఇలాంటి చిరాకులింకా చాలానే వున్నాయి.

తన ఇంట్లోనూ, మెడికల్ కాలేజీలోనూ ఆవిడ చిరాకు చెల్లిందిగాని ప్రాక్టీస్పెడితే ఎలా చెల్లుతుంది?

స్వంతంగా ప్రాక్టీసు పెట్టుకోవాలంటే ఎంత ఓర్పు కావాలి ?

పేషెంట్ దగ్గినా, తుమ్మినా అప్యాయంగా చూడాలి. మూలుగుని సంగితంలా భావించాలి. పేషెంట్స్ అడిగే ప్రశ్నలన్నింటికి ఓపిగ్గా, చిరునవ్వుతో జవాబు చెప్పాలి! వారిబాధే తమబాధగా నటించాలి. మనసులో తిట్టుకున్నా పైకి మాత్రం ఉత్సాహాన్ని అభినయించాలి. తగ్గినా, తగ్గకపోయినా వాక్చాతుర్యంతో ఆ రోగిచేత తగ్గింది అనిపించాలి.

ఇదీ! ఇంత గొడవుంది ప్రైవేట్ ప్రాక్టీసులో. కాని శ్యామలకి పోలీసాఫీసర్ కూతురన్న తీహంతప్ప కించిత్ సహనంలేదు. డాక్టర్నన్న దర్పంతప్ప డాక్టరుకుండాల్సిన మాట సౌమ్యం మచ్చుకైనాలేదు.

ఇదంతా తెలిసిన తండ్రి కూతుర్ని చేరబిలిచి–

"అరె శ్యామ్! ఈ ప్రాక్టీసు గొడవ నీ కెందుకురా! హాయిగా ఇంట్లోకూర్చో! కాదంటావా మన డాక్టరంకుల్ దగ్గరికెళ్లి పేషెంట్స్ని చూడు. ఇంకా సరదాగా వుంటే గవర్నమెంట్ హాస్పిటల్లో చేరు.... మూడు నిమిషాల్లో ఆర్డర్స్ తెప్పిస్తాను..." అంటూ నచ్చచెప్ప చూశాడు.

ఆయన కతుర్ని ముద్దుగా శ్యామ్ అనీ, 'నాన్నా' అనీ అంటాడు.

"ఏమిటీ గవర్నమెంట్ హాస్పటల్లోనా?" చేదుతిన్నట్టు మొహం పెట్టింది శ్యామల.

"అవున్రా?– గవర్నమెంట్ హాస్పిటల్ అంటే అంత తేలిగ్గా తీసిపడెయ్యకు!– మనలాంటి వాళ్ళకి అదే నయం! అక్కడ నిన్నడిగే వాళ్ళుండరు!

కుడి చేతికి బదులు ఎడమచెయ్యి తీసేసినా, కడుపులో ఫార్సెక్స్‌లు వుంచేసి కుట్టేసినా, ఇంజక్షన్ రియాక్షన్‌వచ్చి పేషెంట్ హరీమన్నా, ఆపరేషన్స్ సెప్టిక్ అయినా, అన్నింటికి మించి నువ్వెంత అరిచినా అడిగే వాళ్ళుండరు. ఎందుకంటే అవి ధర్మాసుపత్రులు కనుక!".... అంటూ శతవిధాల నచ్చచెప్పాలని చూశాడు రామారావు. ఇంకా చాలా చెప్పాడు. అయినా ఆమె వినలేదు స్వంత ప్రాక్టీసు పెట్టేతీరాలంది.

ఆయన క్షణం ఆలో చనలో పడ్డాడు.

"డాక్టరన్న తర్వాత ఎంత సహనంకావాలి? కసకసలాడుతూ కట్టెవిరిచి పొయ్యిలో పెట్టినట్టు మాట్లాడే నీ దగ్గరి కెవరొస్తారే! ఏదో సరదా పడ్డావ్! చదివావ్! ఇంక పెళ్ళి చేసుకుని బిడ్డపాపలతో హాయిగా వుండు!" అంటూ సలహా ఇచ్చింది శ్యామల తల్లి శారద.

తల్లి మాటలకి చిరాకుపడిపోయింది శ్యామల.

"ఛ!ఛ! నీకు పెళ్ళి గొడవ, పిల్లల గొడవ తప్ప మరొకటి లేదమ్మా! ఇంత చదువు చదివింది పెళ్ళి చేసుకుని పిల్లల్ని కండానికా?" అంది రుసరుసలాడుతూ.

**జరిగిన కథ– 1:** శాంతమ్మ ఏకైక కూతురు సరయు. శాంతమ్మకు ముప్పయి ఏళ్ళు నిండకుండానే భర్త యాక్సిడెంట్‌లో కాలం చేసాడు. డిగ్రీ పొందిన సరయు ఎన్ని ఇంటర్వ్యూల కెళ్ళినా ఉద్యోగం మాత్రం రాలేదు. తమ ఇంట్లో అద్దెకు ఉండే రమణ అంటె సరయుకి సదభిప్రాయం లేదు. తమకున్న ఇల్లు అమ్మేసైనా సరే.సరయు పెళ్లి చేసెయ్యాలనుకుంటుంది శాంతమ్మ.

"అయితే నువ్వు పెళ్ళి చేసుకోవా?" చిత్రంగా చూసింది శారద. అసలావిడకి కూతుర్ని డాక్టర్ చెయ్యడమే ఇష్టంలేదు.

"చేసుకుంటాను! కానీ ఇప్పుడుకాదు!"

"మరెప్పుడు?"

"చేసుకోవాలనిపించినప్పుడు!"

"ఇదిగో! వింటున్నారా?" కోపంగా భర్తకేసి చూస్తూ అంది శారద.

"ఆఁ! ఆఁ! వింటున్నాను" ఏదో ఆలోచిస్తూ అన్నాడు రామారావు.

"డేడీ!.... ఏమిటి ఆలోచిస్తున్నారు?" అంది శ్యామల.

"అదే. .. నీ పెళ్ళి గురించేరా!"

"ఇదిగో డేడీ.... నేను ముందే చెప్తున్నాను. నేను ప్రాక్టీసు పెట్టాగ్గానీ పెళ్ళి చేసుకోను!. .. తర్వాత నన్ను బ్లేమ్ చెయ్యద్దు!" స్థిరంగా అంది శ్యామల.

"అవునే! చేసుకోవు!.... ఎందుకు చేసుకుంటావ్.... అసలు మేం చెప్పినమాట ఏనాడు విన్నావు గనుక! అయినా ఇదంతా నీ తప్పుకాదే! దాన్ని డాక్టర్ని చెయ్యదండీ అని నెత్తీ నోరూ కొట్టుకొని మరీ చెప్పాను మీ నాన్నకి. నా మాట విన్నారా? ఇప్పుడనుభవించనీ!" కోపంగా అంది శారద.

"అబ్బబ్బ! మధ్య నీ గొడవేవిఁటోయ్! విషయం పూర్తిగా చెప్పనీ!.... ఆఁ! ఇంతకీ ప్రాక్టీస్ ఎక్కడ పెడ్తావురా నాన్నా!" లాలనగా అడిగాడు రామారావు కూతుర్ని

"ఆలోచించి చెప్తాను డేడీ!" గారాబంగా అంది శ్యామల.

"ఆలోచించమ్మ! ఆలోచించు! బాగా ఆలోచించు. కానీ నువ్వెక్కడ ప్రాక్టీసు పెట్టినా నీ దగ్గరికి ఒక్క పేషెంటురాడు. ఒకవేళ కర్మజాలక వచ్చినా నీచేత ట్రీట్‌మెంటు తీసుకున్నాక ఇంకావీధి ఛాయలక్కూడారాడు." వ్యంగ్యంగా అంది శారద.

"ఆఁ! ఆఁ! నువ్వలాగే చూస్తుండు. నేనూ, ప్రభు కలిసి భారీ ఎత్తున నర్సింగ్‌హోమ్ ఓపెన్ చేశావాఁ వూపిరి తీసుకోవడానిక్కూడా టైమ్ లేనంతమంది పేషెంట్స్ కిటకిటలాడిపోతారు! ఆస్పైవూళ్ళో వున్న మిగతా డాక్టర్లకి కరెంట్ కర్చుకూడా రాదు." ఉత్సాహంగా అంది శ్యామల.

"ప్రభా అతగాడెవరు?" ఆశ్చర్యంగా అడిగింది శారద. తనతొందరపాటుకి గతుక్కుమన్న శ్యామల వెంటనే తేరుకుని-

"ఆఁ– ప్రభంటే... ప్రభంటే మా క్లాస్‌మేట్‌లే!" అనేసి మరో అవకాశం



# కరిగిన శిల

ఇవ్వకుండా చరచరా తనగదిలోకెళ్ళిపోయింది కూతురి ప్రవర్తనకు తల్లిదండ్రులు ముఖాముఖాలు చూసుకున్నారు.

★ ★ ★ ★ ★ ★

ఏమి తోచనప్పుడు డాబా మిదికెళ్ళి "వంశధార" వైభవాన్ని చూస్తూ కాలం గడవడం అలవాటు సరయుకి.

రెపరెపలాడుతూ అందంగా కనిపించే సిల్క్ తెరల్ని, పనివున్నా లేకపోయినా హడావిడిగా తిరిగే పోలీసు జనాన్ని, ఫ్రెండ్స్‌తో షటిల్‌ఆడే అందమైన శ్యామల్ని చూస్తుంటే టైమ్ తెలియదామెకి.

అయితే ఆ ఇంటివారితో ఆమెకి పరిచయంలేదు చీకూ చింతా లేనట్టుండే ఆ శ్యామల ఎంత అదృష్టవంతురాలు! అనుకునేది చాలాసార్లు–

మొదట్లో ఒకటి రెండుసార్లు శ్యామలని చూసి పలకరింపుగా నవ్వింది సరయు. కానీ శ్యామల మాత్రం ప్రతిగా నవ్వకపోగా ముఖం అదోలా చిట్లించింది. అప్పట్నుంచి ఆమెకి దూరంగా వుండిపోయింది సరయు.

బహుశా "సరయు తమ అంతస్తుకి సరితూగగల వ్యక్తికాదు" అన్న చిన్నచూపు కావచ్చు శ్యామలకి. అందుకే సరయుని చూసినా చూడనట్లే వుండేది.

ఆ రోజు కూడా డాబామిద కాసేపు గడిపి కిందికొచ్చింది సరయు

"అమ్మా– సరూ భోజనానికొస్తావా?" అంది శాంతమ్మ.

"పద!...." వంటింట్లోకెళ్ళి పీటలువేసి కంచాలు పెట్టింది సరయు.

నెయ్యిలేని ముద్దలు మెల్లగా మింగుతున్నారు.

మొన్నే అయిపోయింది నెయ్యి అయితే చేతిలో డబ్బులేక పోవడంతో తెప్పించలేదు శాంతమ్మ. కూతురుకి గొడ్డుకూడు పెడుతున్నానన్న బాధ ఆమె ముఖంలో కొట్టొచ్చినట్లు కనిపిస్తోంది.

"అమ్మా!– రమణగారు. . అద్దె ఇవ్వలేదుగా?" తల్లి ఆలోచన గ్రహించిన సరయు మాట మార్చింది.

"రేపు తప్పకుండా ఇస్తానన్నాడమ్మా!" అంది శాంతమ్మ మెల్లగా.

ఒకరి గురించి మరొకరు బాధపడుతూ భోజనం అయిందనిపించారు.

★ ★ ★ ★ ★ ★

కూతురి నోట 'ప్రభు' అన్న మాటవిని ఆలోచనలో పడ్డారు రామారావు, శారద ఆపైఇద్దరూ కూడబలుక్కుని మెల్లిగా కూతురి గదిలో కొచ్చారు.

'అమ్మా! శ్యామూ!" మెల్లగా పిల్చాడు తండ్రి. తల్లిదండ్రులు తన గదిలోకి తప్పకుండా వస్తారని వూహించిన శ్యామల ముఖానికి అడ్డుగా పెట్టుకున్న పుస్తకాన్ని కాస్త తొలగించి–

"ఏవిఁటి డేడీ?" అంది అమాయకంగా.

"కాస్త ఆ పుస్తకాన్ని తీసి అవతల పడేసి నీ హీరో సంగతి చెప్పరా నాన్నా!" కూతురిపక్కనే కూర్చుంటూ అన్నాడు రామారావు.

"ఏవిఁటి డాడీ!" గోముగా అంది శ్యామల.

"అదేరా. ఎవరో ప్రభు. అన్నావ్?" గుర్తు చేశాడు తండ్రి

ఆమె మర్చి పోయిందనికాదు. అదో యాక్షన్ అంతే! అది యాక్షన్ అని కూతురికి తెలుసు

"ప్రభంటే... ప్రభు. .. " శ్యామల మొహం అరుణిమ దాల్చింది.

చెప్పరా శ్యామ్... ప్రభంటే ..?"

"అదే నాన్నా! ప్రభంటే డాక్టర్ ప్రభాకర్. ఇటీవలే ఎమ్మెస్ పాసై ప్రాక్టీస్ పెట్ట బోతున్నాడు." మెల్లిగా చెప్పింది శ్యామల.

"ఇందాక నీ క్లాస్‌మేటన్నావ్?" అనుమానంగా చూసింది తల్లి

'కాస్సేపు నువ్వుండవోయ్ ... అన్నింటికి తొందరే నీకు! దాన్ని చెప్పనీ పూర్తిగా. క్లాస్‌మేట్ కాకపోతే కాలేజీమేట్! ఏమైఁదిప్పుడు?" విసుక్కున్నాడు రామారావు భార్యని.

"అది కాదండి. .."

"ష్! నా మాటవిని నువ్వు కాస్సేపు అవతలికెళ్ళు. విషయం నేను కనుక్కుంటానుగా" అంటూ భార్యకి నచ్చజెప్పి బైటికి పంపేశాడు రామారావు.

"ఆఁ ఇంక నిర్భయంగా చెప్పు!" అన్నాడు లాలనగా. శ్యామల ప్రభాకర్ విషయమంతా విపులంగా చెప్పాక తేలిగ్గా వూపిరి తీసుకున్నాడు.

"ఇంక నీకేం దిగుల్లేదురా శ్యామ్. నువ్వు నిశ్చింతగా వుండు మిగతా వన్నీ నేను చూసుకుంటాను" అంటూ కూతురికి భరోసా ఇచ్చేశాడు కూడా.

★ ★ ★ ★ ★ ★

అర్థరాత్రి ఒంటి గంట దాటింది. శాంతమ్మ, సరయు మంచి నిద్రలో వున్నారు

ఎవరో తలుపు కొట్టిన చప్పుడైంది.

త్రుళ్ళిపడి లేచింది శాంతమ్మ

మళ్ళీ తలుపు చప్పుడైంది.

శాంతమ్మ లేచి వెళ్ళి తలుపు తీసింది.

ఎదురుగా ఓ యువతి నిల్చుని వుంది. ఆమె మొహంలో కంగారు స్పష్టంగా కనిపిస్తోంది

"ఎవరమ్మా మీరు?" అంది శాంతమ్మ.

"నేను... నేను... నాపేరు లక్ష్మి!...."

"ఓ... నువ్వు రమణ కోసం వచ్చావా?" సౌమ్యంగా అడిగింది శాంతమ్మ.

"అవునండి!... కానీ అతను. స్పృహలో లేడు." దుఃఖంతో ఆమె గొంతు బొంగురుపోయింది.

"అరె! ఏమైంది? పొద్దున బానే వున్నాడే?" అతని గదికేసి చూస్తూ కంగారుగా అంది శాంతమ్మ.

"తెలియదండి!... నేను ఏడింటికొచ్చాను. అప్పటికే జ్వరం వుంది, తలనొప్పితో బాధపడుతున్నాడు. ఇప్పుడు మరి ఎక్కువయినట్టుంది. ఒకటే మూలుగుతున్నాడు. పిల్చినా పలకడంలేదు!" గుడ్లనీళ్ళు కుక్కుకుంటూ అంది లక్ష్మి.

ఓసారి కూతురికేసి చూసింది శాంతమ్మ. ఆమె హాయిగా నిద్రపోతోంది.

"పద!" అంటూ లక్ష్మితో బైటికొచ్చి రమణ గదిలో కెళ్ళింది. అతను మగతగా పడుకుని వున్నాడు. నుదుటిమీద చెయ్యేసి చూసింది శాంతమ్మ. అతనికి హైఫీవర్ వుందని గ్రహించి–

"నాయనా రమణా!" అంది మెల్లిగా అతన్ని తట్టిలేపుతూ.

## శివోక్తం

(ప్రఖ్యాత కన్నడకవి సర్వజ్ఞ వచనలు ఆధారంగా)

మానితాఖండ గురుభక్తి లేని యెడల
బోధ విభవమ్ము శిష్యుడు పొందలేడు
బీటలైనట్టి నేలల వేసినట్టి
శాలి ఎట్టుల సస్యమ్ము సంతరించు.

శూలి లింగమ్ము గల గుడి సుందరమ్ము
శుద్ధ గంగానది తటి సుందరమ్ము
సూరిలోకమ్ము వచనమ్ము సుందరమ్ము
ఇందుధర భక్త సంగమ్ము సుందరమ్ము

మడుగు నీటను విహరించు మత్త గజము
చేపలను గాంచి భీతిని చెందునొక్కొ
అల్పుడాడెడి మాటల నాలకించి
పూజ్య సుజ్ఞాని భీతిని పొందు నొక్కొ

—కనమలూరు వేంకట శివయ్య

మూసిన కనురెప్పల్ని బలవంతంగా తెరిచి ఆమెని గుర్తించినట్టు చిన్నగా నవ్వాడు రమణ అతని కళ్ళు ఎర్రగా జ్యోతుల్లా వున్నాయి

"మందేమైనా వేసుకున్నావా రమణా' అతని జుట్టు సవరిస్తూ అంది శాంతమ్మ

వేసుకున్నాను అన్నట్టు తలూపాడతను

శాంతమ్మ ఇంట్లోకెళ్ళి కాస్త కాఫీ కలిపితెచ్చి అతని చేత బలవంతంగా తాగించింది

రమణ తిరిగి మగతలో కి జారిపోయాడు

"చంపేస్తాను!' హటాత్తుగా అరిచాడు రమణ

తృళ్ళిపడ్డారు ఆడవాళ్ళిద్దరు

"రమణా!' తట్టి లేపింది శాంతమ్మ అతను పలకలేదు

మిమ్మల్ని ఒదల్ను!' కాలరాచేస్తాను మి రక్తం కళ్ళ చూస్తాను! అదిగో! వాళ్ళే! పట్టుకోండి' అంటూ గబాల్న లేవబోయాడు రమణ

శాంతమ్మ, లక్ష్మి అతి ప్రయాసగా అతన్ని ఆప గలిగారు వాళ్ళకేం చెయ్యాలో తోచడం లేదు బిక్కు బిక్కు మంటూ అలాగే కూర్చున్నారు

రాత్రంతా జ్వర తీవ్రతతో అలా మాట్లాడుతూనే వున్నాడతను తిడుతున్నా డెవర్నో మధ్య మధ్య హృదయవిదారకంగా ఏడుస్తు న్నాడు

'అవును' అద్దమైన వాళ్లందరికీ సేవలు చెయ్యడానికైతే అర్ధరాత్రయినా టక్కున మెలకువ వస్తుంది " కసిగా అంది సరయు

సరయూ! ఏవిటా మాటలు" చిరుకోపంగా అంది శాంతమ్మ

ఏం? నేనన్నది తప్పా?

తప్పా తప్పున్నరా? సాటిమనిషి బాధపడుతుంటే వెళ్ళిచూడ్డం కానిపనా? మన ఇంట్లో అద్దెకున్న వ్యక్తి అద్దమైనవాడా? స్పృహ వుండే మాట్లాడుతున్నావా? తీక్షణంగా అంది శాంతమ్మ

తల్లి ముఖంలోకి పరిశీలనగా చూసింది సరయు ఆ సమయంలో తల్లి కొత్త వ్యక్తిలా కనిపించిందా అమ్మాయికి తల్లిలో అంతకోపం ఏనాడూ చూళ్ళేదు అయినా తగ్గకుండా–

'ఏం అతను మనకి దగ్గర బంధువా? తెల్లవార్లూ నిద్రమాని సేవలు చెయ్యడానికి' కాస్త వ్యంగ్యంగా అంది

కూతుర్ని ఓసారి తీవ్రంగా చూసిన శాంతమ్మ

'ఇదిగో సరయూ! అతను మనకి చుట్టమూ పక్కమూ కాదు అతనికి సేవ చెయ్యొచ్చో కూడదో నాకు తెలియదు నాకు తెలిసిందల్లా అతను సాటి మానవుడు! జ్వరంతో బాధపడుతున్నాడు గుక్కెడు నీళ్లిచ్చే వాళ్ళైనా లేక పడున్నాడు అందుకే అతని దగ్గరుండి సేవలు చేశాను అవసరం అయితే రాత్రింబవళ్ళు

## గడుసులోకం

–బాపు







ఆ రాత్రి కాళరాత్రిలా ఎలాగో గడచింది తెలతెలవారు తుంతగా కాస్త జ్వర తీవ్రత తగ్గి ఆదమరచి పడుకున్నాడు రమణ

తేలిగ్గా వూపిరి తీసుకున్నారు ఆడవాళ్ళిద్దరూ

చీకటి తొలగి వెలుగురేఖలు పూర్తిగా రాకముందే, లక్ష్మితో చెప్పి మెల్లగా తమ ఇంట్లో కొచ్చిన శాంతమ్మ ఫిల్టర్‌లో నీళ్లు పోస్తున్న కూతుర్ని చూసి గతుక్కుమంది సరయు మాత్రం తల్లిని గమనించనట్లే వుండిపోయింది

అప్పుడే పాలొచ్చేశాయా? బ్రష్ మీద పేస్ట్ పెట్టుకుంటూ అంది శాంతమ్మ

ఆ' క్లుప్తంగా అంది సరయు

నాకు పాలవాడి కేక వినిపించనే లేదు ఏదో మాట్లాడాలన్నట్టు అంది శాంతమ్మ

అవును! నీకెలా వినిపిస్తుంది! అసలు నువ్వీ లోకంలో వుంటేకదూ?

అదికాదు సరూ!

నాకేం చెప్పక్కర్లేదు' విసురుగా అంది సరయు కూతురి కోపానికి చిన్నగా నవ్వింది శాంతమ్మ

కొరగా చూసింది సరయు

నిజంగానే నాకు వినిపించలేదమ్మా!

నిద్రాహారాలు మాని కూడా చేస్తాను

అయినా ఏ రకం బంధువని 'మేరి' మనల్ని ఆదుకుంది? ఆనాడు నేను ఒంటరిగా, నిండు చూలాలిగా నిస్సహాయ స్థితిలో తన పంచన చేరితే ఏ బంధుత్వపు మమకారంతో నన్ను కడుపులోపెట్టుకుని కాపాడింది?

ఆనాడు ఆమె ఆదుకోకపోతే నేనెక్కడుండేదాన్ని, నువ్వెక్కడుండేదానివి? అప్పుడు మనకున్న ఆత్మీయులు అదే నువ్వన్న బంధు జనమంతా ఏమయ్యారు?

సరయూ! మనిషికి మనిషి అవసరం ఎప్పుడూ వుంటుందమ్మా ఏమో! రేపు అతని అవసరం మనక్కలుగుతుందేమో! ..

చిన్నతనపు చేష్టలతో మాటలు మీరి, ఎదుటి వాళ్ళని నొప్పించడం అంత మంచిదికాదు కఠినంగా అనేసి మొహం కడుక్కొచ్చి రెండు గ్లాసుల నిండుగా కాఫీ కలిపి కూతురికొసైనా చూడకుండా పక్క పోర్షన్‌కేసి వెళ్ళింది శాంతమ్మ

రమణ తలుపు తాళం వేసుంది!

* * * *

కూతురి కిచ్చినమాట ప్రకారం ఓ మంచిరోజు చూసుకుని కేంప్ ఓటీ కల్పించుకుని, మంది మార్బలంతో ప్రభాకర్ ఇంటికెళ్లాడు రామారావు

అసలైన ఆడపిల్ల తండ్రిలా మొహంపెట్టి కాంపౌండ్‌లోకి అడుగుపెట్టాడు

## కరిగిన శిల

అయ్ బాబోయ్! అయ్ బాబోయ్! మనింటికి పోలీసు లొచ్చిత్తన్నారు అంటూ చిన్న పాలేరు యజమాని చెవిలో గుసగుసలాడాడు

వరండాలో కూర్చుని పేపరు తిరగేస్తున్న ప్రభాకర్ తండ్రి ముందు కనుబొమలు ముడివేసి, వెంటనే తీసేసి ఇంత నవ్వు ముఖానికి పులుముకుని చేతిలోని పేపర్ కిందపడేసి లేచి ఆయనకి ఎదురెళ్లి నమస్కరించేంతలో–

"నమస్కారమండి .. సుబ్బారావుగారంటే ' అన్నాడు రామారావు వినయంగా.

"నేనేనండి! దయచేయండి! తమరు. ."

"నేను ఈ జిల్లాకు ఎస్ పిని నా పేరు రామారావు!' తనని తానే పరిచయం చేసుకున్నాడు రామారావు

'అలాగా! చాలా సంతోషం రండి రండి! కూర్చోండి.. " వినయంగా అన్నాడు 'సుబ్బారావు. ఆయన కూర్చున్న తరువాత–

"చెప్పండి! తమరేం పనిమీద వచ్చారు?" అన్నాడు సుబ్బారావు తనూ 'కూర్చుంటూ

సారాకేసులగ్గానొ చ్చేసినారేటి బాబూ! అన్నాడు పాలేరు తన తెలివితేటల్ని వుపయోగించి.

"సీ మొహం, సారా కేసులకి, దొంగకొళ్ల కేసులకి ఇంత పేద్ద ఆఫీసర్లొస్తారేవిట్రా!... నువ్వు కాసేపు నోరుమూసుకో!" అని పాలేర్ని కసిరి–

"చెప్పండి!" అన్నాడు మరోసారి సుబ్బారావు కుతూహలంగా లోపల మాత్రం-

"ఈ పోలీసాళ్లెందుకొచ్చారు చెప్మా" అని తికమకపడుతూనే

'మీతో పనుండే వచ్చాను' ఆయన భావాన్ని స్పష్టంగా చదివిన రామారావు చిన్నగా నవ్వుతూ అన్నాడు

సుబ్బారావుగారి లోగిలి చూస్తుంటే ఆయనకి చాలా సంతృప్తి కలిగింది

లంకంత లోగిలి, వీధి వైపంతా ధాన్యపు పుర్లు, ఇంటి నిండా జీతగాళ్లు, 'ఇవన్నీ చూస్తుంటే వాళ్ళు లక్ష్మి పుత్రులని చెప్పకుండానే తెలిసి పోతోంది

"నాతో పనా? మీకా?" ఆశ్చర్యంగా అన్నాడు సుబ్బారావు.

"అవునండీ! మీతోనే! మామూలు పని కాదు! అతి ముఖ్యమైన పని!" ముసి ముసిగా నవ్వాడు.

క్షణం ఆలోచనలో పడ్డ సుబ్బారావు-

"ఏవిటండోయ్ అంత ముఖ్యమైన పని?" అన్నాడు. అయోమయంగా వుందాయనకి

చెప్తాను. అబ్బాయి ఇంట్లో లేడా?" గుమ్మం కేసి చూస్తూ అన్నాడు రామారావు

అప్పుడు మెరిసినట్టుగా తట్టింది సుబ్బారావుకి. ఇంత పెద్ద పోలీసాఫీసరూ తన ఇల్లు వెతుక్కుంటూ ఎందుకొచ్చాడు? అయినా తేలకుండా-

"వూళ్లోనేవున్న ఫ్రెండ్ ఇంటి కెళ్ళాడు వాడితో పనేమైనా వుందా?" సాధ్యమైనంత అమాయకంగా అడిగాడు.

"అతని చదువైపోయింది కద!"

ఆయన మాటకి జవాబు చెప్పకుండానే అన్నాడు రామారావు.

'ఆఁ! అయింది బాబూ! అయింది. వాడి చదువవడం కాదుగానీ నా ప్రాణంమీది కొస్తోంది! విసుగ్గా అన్నాడు సుబ్బారావు

'అదేవిఁటి?"

"ఎందు కడుగుతార్లెండి!. . వాడి చదువు పూర్తయిందో లేదో సంబంధాలమీద సంబంధాలు! మొన్న కలెక్టరుగారమ్మాయిని ఇస్తామని వస్తే, నిన్న మినిష్టరుగారమ్మాయినిస్తామని కబురు! పొద్దునకి పొద్దున-

"ఏమైనాసరే నా కూతుర్ని నీ కొడుక్కి చేసుకోక తప్పదు!' అంటూ నా ఎమ్ పి. స్నేహితుడొచ్చి ఒకటే గొడవ! అబ్బబ్బ! ఎవరి కెలా చెప్పాలో అర్థంకాక సతమతమౌతున్నాననుకోండి! .. ఆఁ..... ఈ గొడవలకేంగానీ . .. తమరొచ్చిన పని శలవిచ్చారుకాదు అతి వినయంగా అన్నాడు సుబ్బారావు

నేనూ అందుకేవచ్చానండి!" అనేశాడు రామారావు

'అంటే. . సంబంధం కోసమా?"

"ఆఁ! ఆఁ! అదే "

"ఆఁ! దాందేంవుంది లెండి, అబ్బాయిని రానివ్వండి! అలాగే అడుగుదాం పిల్లలు పెద్దవాళ్ళయ్యాక మనదేం వుంది చెప్పండి అంతా వాళ్ళ ఇష్టం! వాళ్ళ నెత్తిన నాలుగు అక్షంతలు వెయ్యడమే మన పని!" వేదాంతిలా అన్నాడు సుబ్బారావు

"నిజవేఁ అనుకోండి కానీ మా అమ్మాయి, మీ అబ్బాయి మంచి స్నేహితులే చూసుకునే పని లేదు" అన్నాడు రామారావు.

ఆయన ఆ మాట మెల్లగానే అన్నా పిడుగు పడ్డట్టు చూశాడు సుబ్బారావు మొహం సీరియస్‌గా అయిపోయింది

'స్నేహితులా?" అన్నాడు గంభీరంగా.

ఆయన భావాల్ని గమనించిన రామారావు-

'స్నేహితులే అనుకోండి. ఎంత స్నేహితులైనా, ఎంత ఒకర్నొకరు అభిమానించుకున్నా మన తాహతుకు తగ్గట్టు అన్నీ వున్నాయో లేదో చూసుకోవద్దూ? కట్న కానుకలు, ఇచ్చి పుచ్చుకోవడాలు వుండొద్దూ?" కట్న కానుకలు అన్న చోట ఒత్తి పలుకుతూ అన్నాడు

ఓ సారి ఆయన కేసి అనుమానంగా చూశాడు సుబ్బారావు.

"అసలే పోలీసాళ్ళు! . వీళ్ళ దగ్గర కట్నం మాటెత్తితే. . .' అన్న భయం కూడా కనిపించిందాయన ముఖంలో

ఆవలిస్తే పేగు లెక్కబెట్టే రామారావు చిన్నగా నవ్వేసి-

"నేను పోలిసాఫీసర్నే! కానీ ఓ ఆడపిల్ల తండ్రిని కూడా!" అన్నాడు మెల్లిగా

అదేదో జోకన్నట్టు భళ్ళున నవ్వాడు సుబ్బారావు తరవాత కాసేపటికి ప్రభాకర్ రావడం, విషయం విని సిగ్గు పడిపోవడం చూసి ఆలోచనలో పడ్డాడు అపై రామారావు స్థితిగతులు పిల్ల రూపు రేఖలు, చదువు సంధ్యలు తెలుసుకుని ఆనందపడిపోయాడు

రామారావు వద్దంటున్నా వినకుండా పాలేళ్ళచేత అప్పటికప్పుడు విరిపించి నాలుగు గంగా బొండాలు తాగించి-

మీ అమ్మాయి మా కోడలు!. అని అభయం ఇచ్చేసి పేరుకి ఓసారి భార్యకి పరిచయం చేసి త్వరలో ముహూర్తాలు నిర్ణయిద్దాం అని చెప్పేశాడు సుబ్బారావు

(ఇంకావుంది)

## భ్రమ

కండలు కరిగేలా మేము పడేశ్రమ
కడుపులు నింపుతుందనేది వొట్టి భ్రమ !
కావాలి మాకు అన్న వస్త్రాలు
కాల్చకండి మా కడుపుల్లో అణ్వస్త్రాలు !

ఎర్ కండిషన్డ్ స్విమ్మింగ్ పూల్స్–
ఎందుకని అడిగినవాళ్ళు నిజంగా ఫూల్స్ !
పేదల ప్రేవుల నినాదాలు
సమసమాజానికి దర్పణం పట్టే లక్షణాలు!

మట్టిగోడల మీద నాలుగు వాసాలు
చాలు అనే ఈ జన్మలకు ఆవాసాలు !
ఎన్నో యేండ్లుగా వేస్తున్న పథకాలు
చిన్న వర్షాలకే చితికిపోయే నివాసాలు !

–డా. లక్ష్మీనారాయణ



“నాకు తెలుసు... చిన్న-చిన్న పళ్ల
రాక్షసులు నా పళ్లలో కన్నాలు చేస్తాయి.

ఎందుకంటే, మా అమ్మ నాకు
విడమర్చి చెప్పిందిగా! అవి నిజంగా
'బ్యాక్టీరియా' అట, అవి నోట్లో
మిగిలిపోయిన అన్నం ముక్కలతో కలిసి
'ఆమ్లాల'ను వూరించి 'పంటి ఎనామిల్'పై
దాడి చేసి కన్నాలు అంటే 'పుప్పిపళ్లు' చేస్తాయి.



కాని నా పళ్లు పాడవవని నాకు తెలుసు.
ఎందుకంటే నా దగ్గర వుందిగా

నా సూపర్ ఫైటర్!

## ఫోర్‌హాన్స్ ఫ్లోరైడ్...
## దీని సహాయంతో పుప్పిపళ్లతో
## పోరాడ్తా. గెలిచేస్తా!






నా సూపర్ ఫైటర్‌లోని ఫ్లోరైడ్
నా 'పంటి ఎనామిల్'ను గట్టి చేసి,
నొప్పి కల్గించే పుప్పిపళ్లు కాకుండా చేస్తుంది.
మా అమ్మ ఎంత మంచిదో. రుచికరమైన, నురుగునిచ్చే
నా సూపర్ ఫైటర్ గురించి నాకంతా నేర్పింది.”

ఆకర్షణీయమైన క్రొత్త ప్యాక్‌లో!




ఫోర్‌హాన్స్ ఫ్లోరైడ్
పుప్పిపళ్లను ఎదుర్కొనే సూపర్ ఫైటర్!

429-GM-244 TFI

# అప్పులు చెయ్యకుండా జీవితం గడిపితే అదే చాలు!

"మే రేజస్ ఆర్ మేడ్ ఇన్ హెవన్" అన్న నానుడి నా విషయంలో నిజంగా జరిగింది. నా అదృష్టం కొద్దీ చదువుకున్న అమ్మాయి భార్యగా దొరికింది! ఊరికే కూర్చోవడం ఇష్టంలేక టీచర్‌గా సాయి పబ్లిక్ స్కూల్లో ఉద్యోగం చేస్తోంది. భార్యాభర్తలు ఇద్దరూ సంపాదిస్తే ఆర్థిక సమస్యలు ఉండవని నా అభిప్రాయం!" అన్నారు శ్రీ పంగనమల సుదర్శన్.

సుదర్శన్ స్పిక్ ఎరువుల కంపెనీలో ఫీల్డ్ అసిస్టెంట్‌గా పని చేస్తున్నారు.

"నేను చేసే ఉద్యోగం సీజనల్ జాబ్. నెలలో ఆదివారాలు తప్ప మిగతా రోజుల్లో టూర్‌లోనే ఉంటాను. అందువల్ల హోమ్ సిక్ అవుతూ ఉంటాను. అందరికీ ప్రభుత్వ ఉద్యోగాలూ, బ్యాంకుల్లో ఉద్యోగాలు రావుకదండీ. జీవితాన్ని, సంసారాన్ని గడుపుకోడానికి అది టెంపరరీ ఉద్యోగమైనా చెయ్యడానికి వెనకాడ కూడదని అంటాను. కాకపోతే జీవితంలో స్థిరత్వం కోసం ప్రయత్నించక తప్పదు. భారత దేశంలో అతి తక్కువ జీతంతో బ్రతికేవారున్నారు. ఎంత వచ్చినా చాలడం లేదనుకుంటూ బ్రతికేవారూ ఉన్నారు. నా ఉద్దేశంలో ఉన్నదాన్లో సర్దుకు పోతూ అప్పులు చెయ్యకుండా జీవితం గడిపితే అంతే చాలు" అనే సుదర్శన్ రికమెండేషన్ లేకుండా, లంచం ఇవ్వకుండా సంపాదించుకున్న ఉద్యోగం చిన్నదైనా, జీతం తక్కువైనా అందులో ఉన్న తృప్తి ఎంతో గొప్పది. అంటారు.

"ఈ రోజుల్లో అది సాధ్యమేనా? ఏమో మా వారు చాలా పట్టుదల మనిషి. ఇప్పుడు వచ్చే జీతాలు ఇంటి అద్దెలకు, దారి ఖర్చులకూ సరిపోతే ఏం తింటాము? ఆడది చదువుకుని ఊరికనే కూర్చుంటే ఏమొస్తుంది? అందుకనే నేను ఉద్యోగం చేస్తానంటే ఆయన కాదన లేదు. నేనే కాదు. నాలాగా చదువుకున్న స్త్రీలందరూ ఉద్యోగం చేస్తేనే ప్రస్తుత పరిస్థితుల్లో మంచిది" అన్నారు శ్రీమతి జయలక్ష్మి.

ఈ దంపతులకు ఒక కుమారుడు. "మాలాగా ఉద్యోగాలు చేసుకునే దంపతులకి పిల్లల్ని పెంచడం, వారి బాగోగులు చూడటం కష్టమైనా దగ్గర బంధువుల సహకారం ఉంటే అంత బాధని పించదు!" అన్నారు శ్రీమతి జయలక్ష్మి.

"బంధువులు చూడక పోయినా ఫరవాలేదు కాని రాబందుల్లా పీక్కు తినకుండా ఉంటేచాలు! సంసారంలో ఒక భాగం పిల్లలు. మనకున్న తీరిక సమయాలను వృధా చేసుకోకుండా వారి మీద శ్రద్ధ చూపిస్తే వాళ్ళే పైకొస్తారు. బంధువుల కన్నా స్నేహితులే నా కెక్కువండీ. ఆపదల్లో ఆదుకోనన్నా ఆదుకుంటారు....!" అన్నారు సుదర్శన్.

"ఆ విషయంలో ఆయనతో ఏకీభవిస్తాను నేను. ఉద్యోగం చేసే భార్యాభర్తలను చూసి కొంత మంది చుట్టాలు ఓర్వలేక సూటి పోటీ మాటలతో బాధ పెడుతూ ఉంటారు. ఉద్యోగం చేసినంత మాత్రాన "బరి తెగించారు" అనుకుంటే ఎలా? భార్యాభర్తల మధ్య సదవగాహన ఉంటే ఇలాంటివన్ని పట్టించుకోరు. అది లేకపోతే చాలా గొడవలొస్తాయి– ఆ గొడవలు చూసి ఆనందిస్తూ ఉంటారు చుట్టాలు!" అన్నారు శ్రీమతి జయలక్ష్మి.

"జీవితంలో కష్టాల భాగం ఎక్కువ. అది నా ప్రత్యేకానుభవం! ప్రతి క్షణం ఏదో ఒక టెన్షన్! అలాంటి సమయాల్లో మనకి మనం నవ్వుకుంటే సర్వం మర్చిపోతాం! అదే సుఖం అని నా అభిప్రాయం. అందుకనేమో సంసారాన్ని నావతో పోల్చారు. ఎన్ని ఒడిదుడుకులు వచ్చినా నేనూ నా భార్యా హాయిగా నవ్వుకుని ఆ కష్టాలను మర్చిపోతాం! కొంత మా ఉద్యోగాలు మా కష్టాలను మరిపిస్తున్నాయి!" అన్నారు సుదర్శన్. ఆయన మాటల్లో నిజం ఉంది!



శ్రీ సుదర్శన్, శ్రీమతి జయలక్ష్మి

## ఇద్దరూ ఉద్యోగస్తులైతే!

– కృష్ణాజీ

# డొనేషన్ల పర్వం! —శేఖర్




Sun Public SCHOOL

ఆ... సుబ్బారావుగారి పాట ఆరువేలు... ఆరువే.
ఒకటో సారి.....
రెండో సారి.....

ఈ సారి డొనేషన్లు కొత్త పద్ధతిలో వసూలు చేస్తున్నారే...!!!










Sun Public SCHOOL

లైసెన్స్ అక్కరలేని వ్యాపారం

రెండు గదుల ఇల్లు

అసలు నాకు ఈ స్కూల్ పెట్టాలనే ఉద్దేశ్యమే లేదురా! అయితే వాళ్ళడిగిన డొనేషన్లో సగం డబ్బుతోనే ఈ కాన్వెంట్ పెట్టి ఇందులో మా అబ్బాయిని చదివిస్తున్నా..!!

పెద్దకథ ప్రారంభం!

# మిత్ర చతుష్టయం



వంగమూలం:
**ప్రమథ చౌధురి**

తెనుగుసేత:
**ముక్కామల వెంకటేశ్వరరావు**

ఆ నాటి రాత్రి మేం క్లబ్బులో చతుర్ముఖపురాణంలో మునిగిపోయాం. రాత్రి ఎంత పొద్దు పోయిందో కూడ తెలియ లేదు. హఠాత్తుగా గడియారం పది కొట్టడంతో వులిక్కిపడ్డాం.

అంత కర్ణ కఠోరంగా మోగే గడియారం కలకత్తా మహానగరంలో కంచు కాగడాతో వెదికినా దొరకదు.

మోగినంత సేపూ చెవుల తుప్పు వొదిలి పోవాల్సిందే. దాని కంఠం మాకు సుపరిచితమే. ఐనా ఆనాటి రాత్రి దాని కంఠం మరీ కర్ణకఠోరమనిపించింది.

చేతిలో పేక అలానే వుండి పోయింది. ఏం చెయ్యాలో తోచింది కాదు. అంతలో శీతేశ్ బండివాణ్ని పిలిచి "బండి సిద్ధం చెయ్!" అంటూ హుకుం జారీ చేశాడు.

జో హుకుం' అని వినిపించింది పక్క గది నుంచి

కొంప మునిగినట్టు అలా తొందరపడతారేం' చేతిల్లో ఆట కానివ్వండి తాపిగా అన్నాడు సేన్

మహ బావుంది ఎంత పొద్దు పోయిందో తెలియడం లా? ఇంట్లో చివాట్లు తప్పవ్' అన్నాడు శీతేశ్

ఎవరి చివాట్లు? సోమ్‌నాథ్ ప్రశ్న

ఇంకెవరూ? మా ఆవిడ

బావుందోయ్' ఇంట్లో పెళ్లాం మహ నీకే వున్నట్టూ, ఎవరికి లేనట్టూ!

మి పెళ్లాలు మిమ్మల్నేనాడో అచ్చు బోసి వదిలేశారు మిరు కొంపలకు ఎప్పుడు చేరినా ఒకటే'

ఎనిమిదింటికి వెళ్లాల్సింది పదయింది రోజూ ఇంట్లో చివాట్లు తినడం తప్పడం లేదు'

రోజూ చివాట్లు తింటావా?"

'మరి తినకో

అయితే ఆ చివాట్లకు అలవాటుపడిపోయి వుండాలే'

మి సరసాలకేం గాని నేనొస్తాను గుడ్‌నైట్! అంటూ లేచాడు శీతేశ్

ఇంతలో బాయ్ వచ్చి బండివాడు ఇపుడు బండి కట్టలేనంటున్నాడండి గాలివాన వచ్చేలా వుంది దారిలో గుర్రాలు మొరాయిస్తాయ్ ఓ అరగంట చూసి బయల్దేరితే బావుంటుందంటున్నాడు సార్'

అన్నాడు.

వాడి జవాబు వినేసరికి మా కందరకూ కంగారు ఎక్కువయింది. ఒక శీతేశేనేమిటి? అందరం ఇళ్ళకు వెళ్ళవలసిన వాళ్ళమే. గాలివాన సూచనలున్నాయేమో చూద్దామని అంతా వరండాలోకి చేరాం. ఆకాశం రంగు చూసేసరికి ఒళ్ళు గగుర్పొడిచింది. పగలూ, రాత్రీ ఆకాశం ఎలా వుంటుందో మాకు తెలియనిది కాదు. కాని ఈ రోజు పరిస్థితి చూస్తే పరాయి దేశంలోని అపరిచిత మేఘాన్ని తిలకించినట్లయింది. ఆకాశమంతా దుమ్ము కొట్టుకుని గుడ్డి వెలుతురులో భయంకరంగా వుంది. చుట్టూ వున్న ఇళ్ళూ, వాకిళ్ళూ, చెట్టూచేమలూ ఎటు చూసినా ఏదో ప్రళయం రాబోతున్నట్టుగా వున్నాయి. చావుకు ముందు మెరిసే కాంతిలా సన్నని వెలుగు కనపడుతోంది. ఆ రాత్రి దృశ్యాన్ని చూస్తే భయమూ, కుతూహలమూ - రెండూ మొదలయినయ్. ప్రకృతి వూపిరి బిగబట్టినట్టు సర్వం స్తంభించి పోయేకంటే కుంభవృష్టి, గాలివానా ఇంకా ప్రచండంగా వొస్తే బావుణ్ను అనిపించింది.

సర్వం గాఢాంధకారంలో మునిగిపోతే చూడాలని కుతూహలంగా వుంది. నోరెళ్ళబెట్టి అలాఆకాశం వంక చూస్తూనే వుండిపోయా. పక్కకు తిరిగి చూస్తే మిత్రులు ముగ్గురూ అదే అవస్థలో వున్నారు. ఆ భయంకర దుస్వప్నం నుండి వాళ్ళను మేల్కొలపాలని "బాయ్! ఓ అర పెగ్ పట్రా!" గట్టిగా అరిచాను.

నా కేకతో నిద్ర లేచినట్టుగా వాళ్ళంతా ఈ లోకంలోకి వచ్చిపడ్డారు.

"మనకి గ్లాసు నిండా పోసుకు రావోయ్!" అన్నాడు సోమ్‌నాథ్.

అందరం కుర్చీలో కూలబడి అన్యమనస్కంగా సిగరెట్లు వెలిగించాం. ఇంతలో బాయ్ రావడం చూసి "నాకు పూర్తి పెగ్ పట్రావోయ్!" అన్నాడు శీతేశ్.

"ఓ. మి మాట మరిచిపోయాను. స్థూల పదార్థానికి తరళ పదార్థానికి వున్న గాఢ స్నేహం మరచిపోయాను" అన్నాను.

"నీలాగా నేనేమి వామనావతారాన్ని కాదు" విసుక్కున్నాడు శీతేశ్.

"అబ్బో అగస్త్యముని వంశంలో జన్మించావ్! ఒక్క గుటకలో సురా సముద్రాన్నే పానం చేసేటట్టున్నావ్!"

దానికి శీతేశ్ విసుక్కుని "రాయ్ బాబూ! ఈ



సమయంలో నీ చవకబారు హాస్యం రాణించదు' అన్నాడు

అతను చెప్పింది నిజమే నేనేమి ఖండించలేదు

బాహ్య ప్రకృతిలోని గుడ్డి వెలుతురు మా గుండెల్లోపల కూడా ప్రవేశించింది దాంతో మనసు కూడ రంగు మార్చుకుంది క్షణంలో మాకు కొత్త రూపం వొచ్చినట్టయింది రోజూ మాలో వుండే మనోభావాలు మనసు నుండి తొలగిపోయి వాటికి బదులుగా దాక్కొని వుండే పగటి వాంఛలు రేకెత్తసాగినయ్

"రాత్రంతా ఇక్కడే జాగరణ చెయ్యాలేమో' సందేహంగా అన్నాడు సేన్

"ఓ గంటయినా వేచి చూడందే ఎలా చెప్పగలం' అన్నాడు సోమ్‌నాద్

నలుగురం నిరాఘాటంగా సురాపానంలో మునిగిపోయాం తోడుగా దూమపానం

ఓ క్షణం తర్వాత భావావేశం ఆవరించిన వాడిలా సేన్ ఆకాశం వొంక చూస్తూ స్వగతం ఆరంభించాడు మేం ముగ్గురం చెవులప్పగించి వింటూ వుండిపోయాం!

* * * * *

## సేన్ కథనం

ప్రకృతి మహ వికృతంగా వుంది! చూస్తూ చూస్తూనే ఎంత మార్పు! క్షణం క్రితం కనపడిన జీవనం మృతప్రాయంగా వుంది చరాచర ప్రకృతి అంతా జడమయం అయిపోయింది ప్రకృతికి శ్వాసనిశ్వాసలు ఆగిపోయాయా? అనిపించుతోంది రక్తప్రసరణ కూడ ఆగిపోయింది అంతా అయిపోయినట్టే భ్రమ కలుగుతోంది ఇక మిదట ఇంకేమి లేదు! కాని ఇదంతా నిజం కాదని మికూ, నాకూ అందరకూ తెలుసు ఈ దుష్ట, వికృత, కలుషిత మాయాకాంతికి మనసు బానిసయి ఈ ప్రకృతి తిరిగి మారుతుందనే నిజాన్ని కూడ మరిపిస్తోంది మనసు ఇంద్రియాలకు బానిస కావడంతో రంగులో ఏ కొద్దిపాటి మార్పు కలిగినా

# మిత్ర చతుష్టయం

లోకమే మారినట్టు భ్రాంతి కలుగుతోంది గతంలోనే నాకీ అనుభవం కలిగింది ఈ అవకాశంలోనే నేనొకనాడు మరో కాంతి చూశాను ఆ కాంతిలో సకల ప్రపంచం ప్రాణం పోసుకొంది మృతజీవి ప్రాణం పోసుకొని పునర్జన్మ పొందాడు మిద్య తథ్యమై ఎద నిలిచింది

ఇది ఎన్నాళ్ల క్రిందటో జరిగింది అప్పుడు నేను ఎం ఏ పూర్తిచేసి ఇంటిపట్టునే వున్నా, ఏం చెయ్యనూ లేదు, చెయ్యాలని అనిపించనూ లేదు కుటుంబ పోషణ కోసం ఉద్యోగం సద్యోగం చెయ్యవలసిన అవసరమూలేదు, ఆలోచనా లేదు కూటికి, గుడ్డకి కొదవలేదు పెళ్లి పెటాకులు కూడా కాలేదు పెళ్లి అవుతుందని కలలో కూడ అనుకో-లేదు అదృష్టవశాత్తూ ఆత్మబంధువులెవరూ వుద్యోగం చెయ్యమని గాని, పెళ్లి చేసుకోమనీ గాని వొత్తిడి చెయ్యలేదు ఏమి చెయ్యనవసరంలేని పూర్తి స్వాతంత్ర్యం వుండేది ఒక విధంగా జీవితంలో సెలవు కాలం లాంటిది కావాలనుకుంటే ఆ సెలవును జీవితాంతం పొడిగించగలిగి వుండే-వాడిని ఇలాంటి సదవకాశం మికే గనక దొరికితే చచ్చినా వొదులుకునేవారు కాదు అయినా దాని వల్ల నాకు సుఖశాంతులు లేకపోయినయ్ అయితే దానికి మొదటి కారణం నా ఆరోగ్యం సరిలేక-పోవడం అలాగని పెద్ద అనారోగ్యమూ లేదు క్రమేణా ఓ రకమైన జడత్వం నా నర నరాల్లో పేరుకుంది శరీరంలో కోరికల సత్తువ రోజు రోజుకూ క్షీణిస్తూ వచ్చింది నాకు తెలీకుండానే అంగాంగంలో ఓ రకమయిన అలసత్వం చోటు చేసుకుంది సోమరితనమే దానికి కారణమని ఇప్పుడనిపిస్తుంది డాక్టర్లు నా మిద ఎన్నో పరీక్షలు జరిపి శారీరక రోగమేమి లేదని కేవలం మానసికమనీ తేల్చిపారేశారు నిజానికంతే ఆ మానసిక రోగానికి కారణం కవిరాజులు సయితం తేల్చలేనటువంటిది వారి దాకా ఎందుకు? మానసిక రోగికే తన రోగ కారణం తెలీదు నలుగురూ అనుకొనే సంసార తాపత్రయం నాకు లేదు ఏ ప్రియురాలూ నా మనసు హరించి పారిపోలేదు చెబితే ఎవరూ నమ్మరు కాని ఇది నిజం నిండు యవ్వనంలో వున్నా ఏ వంగ యువతి నా దృష్టిని ఆకట్టుకోలేదు నా మానసిక ప్రవృత్తి ఎంత అస్వాభావికంగా తయారయిందంటే ఏ అబలకూ నా గుండెలో గుప్పెడు చోటివ్వలేదు

నా మనసుకు సుఖశాంతులు లేకపోవడానికి కారణం నా మనసు ప్రపంచంతో వేరయిపోవడమే నా మనసులో వైరాగ్యం చోటు చేసుకుందని కాదు పరిస్థితి దానికి పూర్తిగా భిన్నం జీవితం పట్ల వైరాగ్యమూ లేదు సాంసారిక ప్రకృతిలోని దేనిపట్లా అనురక్తి వుండేదికాదు దేహం ఇక్కడుంటే, మనసు యూరోపులో వుండేది ఆ మనసు మిద యూరోపు కాంతిపడింది ఆ కాంతిలో చూస్తే ఈ దేశంలో ప్రాణమున్నట్టు అనిపించేది కాదు మన పనిముట్లూ మాటామంతి, ఆలోచనా సరళి, మన యిష్టాలు అన్నీ తేజోవిహీనంగా, శక్తిహీనంగా, దుర్బలంగా, రుగ్మతతో, స్తబ్దుగా, మృతప్రాయంగా వుండేవి నా దృష్టికి మన సామాజిక జీవనం అంతా ఒక బొమ్మలాట మాదిరిగా కనపడేది అసలు మనమే ఒం బొమ్మగా మారి మరో అందమైన బొమ్మతో నృత్యం చేస్తున్నామా! అనిపించేది ఆ పరిస్థితికంటె మరణమే మేలని నాకు తెలుసు కాని నేను చావాలనుకోలేదు జీవించాలనే వాంఛించేవాడ్ని కేవలం శారీరకంగా గాక మానసికంగా జీవించాలని, అదికూడా వుజ్వలంగా వుండాలని కోరుకొనేవాడ్ని ఈ వ్యర్థ ఆకాంక్ష నా మనశ్శరీరాలను జీర్ణం చేసి వేసింది ఎందుకంటే ఆకాంక్షకు స్పష్టతగాని, నిర్దిష్టమయిన అవలంబనగాని లేవు ఆ స్థితిలో వ్యాకులత మినహా నా మనసులో మరేమిలేదు ఆ వ్యాకులత కూడ కేవలం కాల్పనికం అది ఒక ఆదర్శ నాయికను సృష్టించింది జీవితంలో ఆ నాయిక సాంగత్యం లభిస్తే సజీవుణ్నయి తలెత్తగలనని అనిపించేది ఈ మృతదేశంలో అలాంటి సాంగత్యం లబించదని కూడ నాకు తెలుసు

నా మనసంతా ఆవరించిన ఆ వాతావరణంలో మన సామాజిక జీవనంగానీ దానిలో ఆమోదప్రమోదాలు గాని నాకు గిట్టేవికావు దానితో ఇక్కడి సమాజాన్ని కాదని యూరోపు నాటక, సాహితీ జగత్తులో శరణాగతి పొందేవాణ్ని ఆ లోకంలోని నాయికా నాయకులే రాత్రింబవళ్లు నాతో వుండేవారు, ఈ కాల్పనిక మూర్తులే నిలబడేవారు, నలుదిశలా నన్ను నీడలా వెంటాడేవారు అయితే నా మానసిక అవస్థ ఎంత అస్వాభావికంగా వున్నా నేను విచక్షణా జ్ఞానాన్ని మాత్రం కోల్పోలేదు ఆ జ్ఞానమే నాలో లోపిస్తే, ఆ మానసిక వికారాన్నుండి విముక్తి లభించకపోతే నాలో మానసిక శారీరక అమానుషత్వం చోటు చేసుకునేది నా అనారోగ్య స్థితి విషమించకుండా జాగ్రత్త పడాలనే విషయం నాకు బాగా తెలుసు శారీరక ఆరోగ్యాని



# "ఈనాటి నా ఈ సౌభాగ్యం జై కిసాన్ ఎరువుల వరం"

"నా పాలిట జైకిసాన్ పేరు సుఖసౌభాగ్యాలకు మారు పేరు. ఎందుకంటే, శక్తివంతమైన జైకిసాన్ ఎరువులు నీటిలో ఇట్టే కరుగుతాయి, మొక్కలకు వెంటనే అందుతాయి. ప్రతి నేలకూ, ప్రతి పంటక అనువైన ఈ ఎరువులు పొలంలో బంగారం పండిస్తాయి."

**జైకిసాన్ యూరియా 46.4% నత్రజని,**
**జైకిసాన్ సంపూర్ణ 19:19:19,**
**జైకిసాన్ సామ్రాట్ 18:46:0.**

ఈ ఎరువులు మీకు అన్ని గ్రామాల్లోనూ వ్యాపించి వున్న జువారి వారి ప్రకాశవంతమైన పసుప్పచ్చ దుకాణాల్లో దొరుకుతాయి. సుశిక్షితులైన డీలర్లు పుష్కలమైన పంట పండించడానికి మీకు అన్ని విధాలైన సేవా సహకారాలనూ అందిస్తారు.

---

సరైన సంతులిత ఎరువులు వాడితే అత్యధిక లాభాలు చేకూరుతాయి. జువారి వారి ఉచిత భూసా పరీక్ష సేవను వినియోగించుకొని ప్రయోజనం పొందండి.

---













## జై కిసాన్ రాజ్యం–ధాన్యలక్ష్మీ సామ్రాజ్యం

**జువారి అగ్రో కెమికల్స్ లిమిటెడ్, గోవా.**

ప్రాంతీయ విక్రయ కార్యాలయాలు: సికింద్రాబాద్, విజయవాడ, బెంగుళూరు, హుబ్లి, నాగ్‌పూర్, పుణె, ఇందోర్, ఆగ్రా, జువారినగర్.

LINTAS ZUA 135 2317 1

## మిత్ర చతుష్టయం

కాపాడుకుంటే మానసిక దారుఢ్యం కాపాడుకొగలనని కూడ నాకు తెలుసు అందుకని రోజూ నాలుగైదు మైళ్ళు షికారు వెళ్ళేవాణ్ని. అయితే సాధారణంగా సంధ్య తరువాతే బయలుదేరేవాణ్ని. ఒకో రోజు భోజనం చేసి బయలుదేరేవాణ్ణి. ఒకో రోజు ముందుగానే బోజనం చేసి బయలుదేరితే అర్ధరాత్రికి గాని యింటికి చేరేవాణ్ని కాదు ఆ నాటి రాత్రి జరిగిన ఘటన జీవితంలో ఎన్నటికి మరచి పోలేను ఈనాటికి ఆ పుటన జరిగినట్టుగానే వుంటుంది నాకు

ఆ రోజు పూర్ణిమ ఒంటరిగా విహరిస్తూ రాత్రి పన్నెండు గంటలకు గంగాతీరం చేరుకున్నాను దారంతా నిర్మానుష్యంగా వుంది అయినా యింటికి రావాలనిపించలేదు కలకత్తాలో ఆ రాత్రి కురిసిన వెన్నెల పుష్కరానికోమారు గాని కనిపించదు చంద్రుని వెన్నెల్లో ఓ రకమయిన మత్తు వుంది. ఆ వెన్నెల భూమ్మీద, నీటిపైన, ఇళ్ళ మీద, చెట్ల పైన ఎక్కడ ప్రసరించినా మత్తుగా నిద్రపోయినట్టుంటుంది కాని ఆ రాత్రి ఆకాశంలో వెన్నెల ఆటుపోటు కానవచ్చింది చంద్రలోకం నుండి అవరిళ, అసంఖ్యాక వెన్నెల కిరణాలు వెల్లువగా వచ్చి పృథ్విని ముంచెత్తాయి ఆ వెల్లువలో వెన్నెల దిగ దిగంతాల తెల్లని నురుగులా వ్యాపించి షాంపైన్ నురుగులా హృదయంలో వువ్వెత్తున లేచి నవ్వులా కరిగిపోయింది నా మనసులో ఆ వెన్నెల నిషా ఆవరించింది నిరుద్దేశంగా విహరించేవాణ్ని మనసులో అస్పష్ట ఆనందమేగాని ఏ విధమయిన చింతా భావన లేదు

హఠాత్తుగా నా దృష్టి నది మీద పడింది ఎన్నెన్నో ఓడలు వెన్నెల్లో బారులుతీరి మెరుస్తున్నాయి ఓడల ఆకృతి అంత అందంగా వుండటం మున్నెన్నడూ నేను చూళ్ళేదు. సుదీర్ఘ దేహాలతో సూటిగా సాగిపోయే వాటి శక్తి అమేయం, అప్రతిహతం సుదూర అనంత సాగర తీర స్వప్న లోకాల నుండి అసంఖ్యాక విహంగాలు తరలివచ్చి రెక్కలు ముడుచుకుని పవళించాయా అనిపించింది ఆ వెన్నెలతో పాటే ఆ విహంగాలన్నీ రెక్కలు విప్పుకొని తమ దేశం తరలిపోతాయి ఆ దేశమే యూరోప్ ఐతే మీరూ, నేనూ కళ్ళతో చూసిన యూరోప్ కాదు. యూరోపు సాహిత్య మథనంతో నేనూహించిన కవి కల్పిత రాజ్యం ఈ ఓడల్లో నేనూహించిన స్వాప్నిక రాజ్యం కళ్ళ ముందు ప్రత్యక్షమయింది ఆకాశమంతా వేలాది మల్లెల గుత్తులు వేలాడుతూ గుభాళిస్తున్నాయి నలుదిశలా తెల్లని పూలవాన కురుస్తోంది ఆ పూలన్నీ చెట్ల మీదా, పచ్చిక బయళ్ళపైనా, దారులపైనా రాలి ధవళకాంతితో మెరుస్తున్నాయి ఆ రాత్రి మిరాండా, డెస్డిమోనా, బియాట్రిస్, టిషాల దర్శనం లభిస్తుందనీ వారి స్పర్శతో పునర్జీవనం పొందుతాననీ, మేలుకొంటాననీ, అమరుణ్నవుతాననీ అనిపించింది. నా చిరకాంక్షిత శాశ్వత స్త్రీమూర్తి సశరీరంతో దూరాన నిలబడి నా కోసమే నిరీక్షిస్తున్నట్టు కల్పనా నేత్రాలతో స్పష్టంగా చూడగలిగాను నిద్ర ఆవరించిన మనిషిలా తూగుతూ నడుస్తూ నడుస్తూ అరుణపథం చేరుకుని చూడగా దూరంలో ఓ నీడ అటూ ఇటూ వూగుతోంది ఆ వైపే ముందుకు సాగాను క్రమక్రమంగా ఆ నీడ సజీవమూర్తిగా మారింది అది మానవాకారమని పోల్చుకోడానికి అనుమానం అడ్డు రాలేదు మరింత సమీపించగా ఆ మానవాకారం దారి పక్క బెంచి మీద కూర్చుని పోయింది. మరింత దగ్గరయి తేరిపార జూడగా ఆమె ఓ ఆంగ్ల సుందరి! పూర్ణ యవ్వన! అపూర్వ సుందరి! అలాంటి రూపం మానవమాత్రులకు సాధ్యంకాదు

ఆమె మూర్తీభవించిన వెన్నెల ఆమె సమక్షంలో నిలిచి నిర్నిమేష నేత్రాలతో చూస వుండిపోయాను అమె కూడ తదేకంగా న చూస్తోంది మా ఇద్దరి కళ్ళు కలుసుకున్నప్పు అమె నేత్రాలు దేదీప్యమానంగా ప్రకాశిస్తున్నట్టు కన్పించాయి. మానవ నేత్రాల్లో అలాంటి జాజ్వల్యమానమైన జ్యోతి నా జీవితంలో ఎన్నడూ చూడలేదు అమె కనుల కాంతి సూర్యకాంతీ కాదు; చంద్రకాంతీ కాదు విద్యుత్కాంతి వంటిది ఆ కాంతి ప్రబావంతో చరిద్రబింబం కూడ మరింత వుజ్వలంగా ప్రకాశిస్తోంది చరాచర సృష్టి యావత్తూ ఒక్క క్షణం కాంతి పుంజమై నా ముందు ప్రత్యక్షమయింది జడప్రకృతి ప్రాణం పోసుకొని మనోహరంగా సాక్షాత్కరించింది. ఆ క్షణంలో 'ఈథర్' స్పందనం చర్మ చక్షువుతో చూడగలిగాను నా ఆత్మ ఆ 'ఈథర్' స్పందనంతో ఐక్యమైపోయినట్లు దివ్య దృష్టితో గోచరించింది ఇదంతా అనాటి కాంతిమాయ ఈ మాయా ప్రభావంతో బాహ్య జగత్తేగాక అంతర్జగత్తు కూడ పూర్తిగా రూపాంతరం పొందింది నా దేహం, మనసు ఒక దానితో ఒకటి ఏకమై చిరకాల స్వప్నం సఫలమయినట్టు ఓ సుందరమూర్తి ఆకారం ధరించింది నా మంత్రముగ్ధ మనసులో జ్ఞానం, బుద్ధి, చైతన్యం లోపించినయ్

నేను అచేతనంగా నిల్చుని వుండటం చూసి ఆమె నా వంక చూసి చిరునవ్వు నవ్వింది ఆ చిరునవ్వుతో నాకు ధైర్యం కలిగింది దాంతో మెల్లగా వెళ్ళి ఆమె ప్రక్కనే బెంచీ మీద కూర్చునిపోయాను - అనుకుని కాదు కొంచెం దూరంగానే ఇద్దరి మధ్య నిశ్శబ్దం ఆవరించింది కళ్ళు తెరిచే కలగంటున్నాను ఆ స్వప్న లోకంలో శబ్దంలేదు అసంభవాలన్నీ నాకు సంభవాలుగా గోచరించడమే నేను

్రనసడానికి ప్రమాణాలు ఈ కలకత్తా
ఓ బెంగాలీ రోమియో బాగ్యంలో విదేశీ
తటస్థపడదనే కనీస జ్ఞానం కూడ ఆ
్పోయాను

ఆ స్త్రీలో కూడ సుఖం లోపించిందని.
ం కూడ నావంటిదేననీ అనిపించింది
ి వున్న ప్రపంచం నుండి ఆమె
అనిపించింది నాలాగానే అపరిచిత
తీక్షలో రేయింబవళ్ళు శూన్యంగా
తన స్వప్న సుందరుని చేరుకుని
పర్పించి జీవనం సపలం చేసుకోవాలని
ంది ఈ కారణంగానే వుభయులం ఆ
ర్ణమివెన్నెల పిలుపుతో అక్కడ
ం!

మా కలయికలో విదాత హస్తం లేకపోలేదు 'ఈ కలయిక సూచనప్రాయంగా అనాది కాలంలోనే కనిపించింది, ఈ కలయిక అనంతం' అనుకుంటూ ఆమె వొంక దృష్టి సారించాను క్షణం క్రితం జాజ్వల్యమానంగా ప్రకాశించిన ఆ కళ్ళు వినీలంగా, విషాదంతో మెరుస్తున్నాయి ఏదో గంభీర విషాదం ఆ కనుల్లో గూడుకట్టుకొన్నట్టు అనిపించింది ఆమె కనుల్లో కానవచ్చిన కారుణ్యం మానవమాత్రుల్లో నేనెన్నడూ చూడలేదు. ఆ కారుణ్య కాంతి నా మనశ్శరీరాలను కదిలించివేసింది ఆ ఆవేశంలో ఆమె చేతిని నా చేతిలోనికి తీసుకున్నాను ఆ కర స్పర్శతో నా శరీరం పులకరించింది మనస్సరోవరంలో జలతరంగిణి రాగాలాడింది కళ్ళు మూసుకుని ఆ నవాగత ప్రాణి వేదనను అంతరాంతాల్లో అనుభవిస్తూ వుండిపోయాను

హఠాత్తుగా ఆమె తన చేతిని లాక్కొని నిలబడిపోయింది కళ్ళు తెరచి చూడగా ఆమె నిలువెల్లా భయంతో వొణికిపోతోంది చుట్టూ ఓసారి చూసి దక్షిణ దిశగా నడవసాగింది నేనామె దారి వంకే చూస్తూండిపోయాను ఆరడగులపైగా వున్న దీర్ఘకాయుడైన ఓ ఆంగ్లేయుడు నలుగురైదుగురు అనుచరులను వెంట పెట్టుకొని ఆ స్త్రీని వెంటాడుకుంటూ కాబోలు వస్తున్నాడు ఆ సుందరి రెండడుగులు ముందుకు వేస్తూ తిరిగి వెనక్కి చూస్తోంది మళ్ళీ ముందుకు సాగుతోంది వెనక్కు చూడడం మానలేదు ఆ ఆంగ్ల బృందం

## "యామినీలతలు"

వాళ్ళంతా
ఆకలికి
ఆకలిని తీర్చడానికి
ఆకలి ఆకలిని తీర్చుకోడానికి
అమ్ముడు పోయిన
అందమైన శరీరాలు!
నీతికి నిజాయితీకి
ఆకలిని తీర్చే మగతనం లేదని తెలిసి,
మనుషుల్లో వాటి జాడకై వెదికి, అలసి,
ప్రపంచం మీద పగబూనిన
మానవత్వపు సున్నిత సుందర శకలాలు–
వెలుగులో వెలుగు కోసం వెదికి ఫలితం లేక
చీకటిలో సిగ్గుని వేలం వేసే ఎల్లోరా శిల్పాలు–
నడి బజారులో విలువల్ని హరిస్తున్నప్పుడు .
చీకటితో సిగ్గునీ, హృదయాన్నీ దాచుకుని
శరీరంతో ధన మదాన్ని వేలం వేసే
యామినీ లతలు!!!

–బి. ఐ. ఆర్. రెడ్డి.

ఇది అందరూ అనుకునే మాట. ఈ కలియుగంలో జన సమూహానిదే బలం. పదిమంది చెప్పినదే ధర్మం, న్యాయమున్నూ. అందువల్ల ఈ యుగంలో జనుల శక్తికే బలం-




వెనుకటి యుగాల్లో తపశ్శక్తి, ప్రభుశక్తి ప్రధానంగా ఉండేవి. జనసామాన్యపు శక్తికి ప్రాధాన్యం ఉండేది కాదు. మహర్షుల తపశ్శక్తి మిక్కిలి ప్రధానంగా ఉండేది. మహా మునులు ఎవ్వరితోనూ, ఏ విషయంలోనూ జోక్యం పెట్టుకోకుండా, అడవుల్లోనే ఉండి తపస్సు చేసుకుంటూ వుండేవారు. తమకు ఎవ్వరైనా హానిని కలుగజేస్తే, తమ తపశ్శక్తి వల్ల తగిన శాస్తి చేసేవారు. మహారాజులు కూడా వారికి భయపడేవారు. తపశ్శక్తి తర్వాతిది ప్రభుశక్తి. ప్రభువుల ఆజ్ఞను అందరూ శిరసావహించవలసినదే! "ఎందుకు ఇలా చెయ్యాలి?" అని ప్రశ్నించడానికీ అవకాశం లేదు ప్రజాభిప్రాయంతో పని లేదు. ప్రభువు తనకు తోచినట్లు చెయ్యవలసినదే! అలా అని, అతడు ఎన్నడూ అధర్మంగాగాని, అన్యాయంగా గాని ప్రవర్తించేవాడు కాడు. కాని యీ కాలంలో ప్రతీ దేశంలోనూ అధిక సంఖ్యాకుల అభిప్రాయానికే ఎక్కువ శక్తి ఉన్నది. ఎట్టి క్లిష్ట పరిస్థితులనైనా అది ఎదుర్కొగలదు.

పురాణ యుగంలో క్రూరకర్ములైన రాక్షసులుండేవారు. వారు అడవుల్లోనే ఉండి తమకు అపాయం కలుగుతుందనే సందేహం ఉన్నప్పుడూ, ఆహారం కోసం అక్కడికి వచ్చేవారిని హింసించేవారు. కాని ఊళ్ల మీద పడేవారు కారు. కారణం లేనిదే హింసించేవారు కారు. కాని, యిప్పుడు వారిని మించిన తీవ్రవాదులు, భీభత్సకారులూ విశ్వమంతటా వ్యాపించి ఉన్నారు. వీరి నివాసం గ్రామాల్లోనూ, పట్టణాల్లోనే కాని అడవుల్లో కాదు. అమాయకులైన ప్రజలను కారణం లేకుండానే నిర్దాక్షిణ్యంగా చంపడం, జన సంక్షోభం కలిగించడం వీరి అర్థం లేని లక్ష్యాలు. వీళ్ళు నూటికీ, కోటికి ఒక్కర వీళ్లని కనిపెట్టడం ప్రజలకు సులభ అలా కనిపెట్టి, వాళ్లని పట్టుకొనే శక్తి ప్రజలకు ఉన్నది. ఉపేక్షిస్తే తమ ముప్పు కలగవచ్చు. వారు కొంత ధైర్య వహించి, ఈ పనికి సిద్ధపడితే వి సంక్షోభం తగ్గుతుంది. అమాయకు ప్రాణాలు నిలుస్తాయి. ప్రజల సహకార లేనిదే ప్రభుత్వం దీన్ని నివారించలేద ప్రభుత్వం ప్రజల చేతుల్లోనే గదా ఉన్నద

-బులుసు వేంకట రమణయ

---

ఆమెను సమీపించగా ఆమె పరుగుతీస్తోంది ఆమెను తరుముకుంటూ వాళ్ళు పరుగెడుతున్నారు, కాసేపటికి ఏదో పెద్ద అరుపు వినిపించింది ఆ అరుపు ఎంతో అస్వాభావికంగా, వికటంగా వుంది భయంతో కట్టెనైపోయాను నాలో కదలిక లేకుండా పోయింది తరవాత చూస్తే వాళ్లంతా ఆమెను పట్టుకుని నా వద్దకే లాక్కుని వస్తున్నారు ఆ ఆంగ్లేయుడు కూడ వెంట నడుస్తున్నాడు వీళ్ల అత్యాచారాల నుండి ఆమెకు విముక్తి కలిగించాలని అనిపించింది ఆ పాశవిక హస్తాల నుండి ఆమెను విడిపించాలని వాళ్ల వైపే నడవసాగాను ఆమె వికటాట్టహాసంతో ఆ ప్రాంతమంతా ప్రతిధ్వనించింది ఆ వికటాట్టహాసంలో వికట వేదన వినవస్తోంది ఆ అపూర్వ సుందరి వున్మాదిని కాబోలు! పిచ్చాసుపత్రి నుండి పారిపోయి వచ్చి వుండవచ్చు! సిబ్బంది వెంటాడి పట్టుకు పోతున్నారు

* * * * *

ఆమే నా తొలి ప్రేయసి, మలి ప్రేయసి కూడాను. ఆ తరవాత యూరోపులో పూలకన్నా సుకుమారమయిన కన్యలను, తారలకన్నా మిన్నగా కాంతులీనే సుందరాంగులను చూశాను ఆ క్షణంలో వాళ్ల వైపు ఆకర్షితుణ్నయ్యాను వాళ్ల ఆకర్షణకు మనసు లొంగిపోయే సమయంలో ఆ వికటాట్టహాసం చెవుల్లో ప్రతిధ్వనించేది మనసు పాషాణమయ్యేది. ఆనాటి నుండి అనంత స్త్రీప్రకృతిని కోల్పోయాను కాని దానికి బదులు నన్ను నేను తిరిగి పొందగలిగాను - అంటూ సేన్ తన కథనం ముగించాడు

* * * * *

మేమంతా నిశ్శబ్దంగా వుండిపోయాం ఇంతసేపూ శితేశ్ కళ్ళు మూసుకుని ఆరడుగుల కాయం మంచం మీద పడుకుని వుండిపోయాడు అత చేతిలో నుండి నేలమీద పడి దుర్గంధ విరజిమ్ముతున్న మూరెడు 'మనీలా' చుట్ట అత అంతరాంతరాల్లో రగులుతోన్న అగ్ని ప్రమాణంగావుంది శితేశ్ ని పోతున్నాడనుకున్నాను. హఠాత్తుగా నీళ్ల ఎగిరిన బొమ్మిడాయిలా నిశ్శబ్దం నుండి ఒక వుదుటున లేచి కూర్చున్నాడు ఆ రాత్రి ఛాయ అష్టధాతు నిర్మితమయిన అతని దేహం బౌద్ధమూర్తిలా కనిపించింది ఆ మూర్తి అ సన్నని గొంతుతో మాటాడసాగింది. బుద్ధభగవాను తన ప్రియ శిష్యుడు ఆనందునికి స్త్రీ జాతి పట చేసిన వుపదేశం పునరావృత్తమయినట్టు మాత్ర లేదు

(ఇంకా ఉం




### బి.కె.ఆర్. సోంపేట

★ ప్రేమ - కామం యీ రెండింటికి సంబంధం వుందా?

● ఉంది కనుకనే ప్రేమ వివాహంతో ముడిపడా లంటారు

### ఎన్. జె. విజయనగరం

★ రచయితకు, లేదా రచయిత్రికి ఉండవలసిన లక్షణం ఆత్మవిశ్వాసమా? మనోనిబ్బరమా?

● ముందు రాయడం రావాలి తరవాత - ఆత్మవిశ్వాసం వుండాలి తరవాత మనోనిబ్బరం కావాలి లేకుంటే - ఎవరెలా రాయమంటే అలా రాసే స్థితికి వచ్చేస్తారు

★ నేటి సాహిత్యంపై మీ అభిప్రాయం?

● అమ్మే చెట్టుకి ఆకులే చెప్తాయంటారు అది నిజం అని నిరూపిస్తోంది - నేటి రచనా ధోరణి

### ఎస్. ఎస్. ఆర్. మార్కాపురం

★ నేను ఒక అమ్మాయిని ప్రేమించాను ఆమె కూడా నన్ను అభిమానిస్తుంది కాని ఈ మధ్య మాట్లాడటం మానేసింది అసలు నన్ను ప్రేమించడం లేదా?

● గట్టి చిక్కే తమ్ముడూ - మాట్లాడడం, అభిమానించడం ప్రేమెలా అవుతుంది?! నీతో మాట్లాడిన ప్రతి ఆడపిల్లా నిన్ను ప్రేమిస్తోందనుకుంటే ఎలా?

### ఆర్. కె. పెద్దాపురం

★ మావారు ఐ ఏ ఎస్ ఆఫీసరు. మా వారు బడా వ్యాపారి అంటూ గొప్పలు చెప్పుకొంటారు మీ ఆడవారు ఒక వైపు సమాన హక్కు లంటూ మరొక వైపు బర్త్ ల స్టేటస్ కలుపుకొంటూ సంఘంలో పొజు కొడతారు

● చిత్రం - ఈ దేశంలో చదివినా, ఉద్యోగి అయినా - ఏమైనా సరే ఆడది - ఎవరికో కూతిరిగనో, కోడలుగానో, తల్లిగానో, పెళ్ళాంగానో, ప్రియురాలిగానో స్నేహితురాలిగానో మాత్రమే చూడబడుతుంది గాని - ఒక వ్యక్తిగా చూడబడదు అందుకే - నేను ఫలానా అని చెప్పుకుంటారు ఆడవాళ్ళు

### కె. వి. ఆర్. గుంటూరు

★ జీవితాన్ని ఎలా గడిపితే బాగుంటుంది?

● ఆ మీమాంసలో పడితే - జీవితం గడిచిపోతుంది జీవించడం ప్రారంభించడం ముఖ్యం

### రాజు, నారాయణపేట

★ చెంప కింద చెయ్యి పెట్టుకుని చింత చేస్తారెందుకు ఈ వయసులో బేపికరుగా వుండక?

● అలా వుండడం ఎవరికేనా సాధ్యమా?!

### హరనాధ్, కొంకుదురు

★ ఈ విశాల ప్రపంచంలో మరణం లేనిది ఏది?

● చేసిన మంచి

★ అలసిసొలసి పోయిన స్త్రీ కోరేదేమిటి?

● మనశ్శాంతి, కాస్త ఒంటరితనం, ఎప్పుడూ ఎవరి కోసమో తాపత్రయ పడే స్త్రీ తనకి తానై తన వూహలను కలపోసుకుందుకు క్షణమేనా ఏకాంతం కోరుతుంది




### ఎం. కె. ఆర్. విశాఖ

★ బ్యాంకులో ఆఫీసరుగా పని చేస్తూ, బ్యాంకులో పని చేస్తున్న శ్రీమతిని కలిగి 'ఆస్తిపాస్తులు లేని మాలాంటి వాళ్ళం నెలకి నాలుగు రాళ్ళు వెనకేసుకో లేకపోతున్నాం' అని ఇంటర్వ్యూలో అన్నారు మరి మగవాళ్ళ సంపాదన మీదే సంసారాలు గుడుపుతున్న మాలాంటి వాళ్ళని ఒక దగ్గిర పెట్టి చంపి పారేస్తే మిగిలిన వాళ్ళు హాయిగా బ్రతకవచ్చును కదండీ?

● డబ్బు లేనివాడు డుబ్బుకి కొరగాడన్న నమ్మకం వున్న వాళ్ళ బాధలవి" సంపాదన తిండికే సరిపోక కొందరు బాధ పడిపోతూ వుంటే, సంపాదనలో మిగలడం లేదని కొందరూ, సంపాదనే లేదని కొందరూ బాధపడడం -మామూలే నైతికావసరాలపై కంటే ఆర్థికావసరాలు ఎక్కువగా కన్పించే మెటీరియలిస్టిక్ సమాజం యిది అందుకే ఎంత సంపాదించినా సరిపోదనిపిస్తుంది

### ఎస్. వి. ఆర్. సంగం జాగర్లమూడి

★ ఈ మధ్య మీరు కూడా విరివిగా సహపంక్తి భోజనాలు చేస్తున్నారట కొంపతీసి రాజకీయాల్లోకి రావటం లేదు కదా? మేమంతా యాంటీ చేయవలసి వస్తుంది

● మరేం బెంగ పడకండి ఆ ప్రమాదం లేదు' ఇక సహపంక్తి - మా యింట్లో అంతా కూర్చుంటే - సహ పంక్తే! మాది నానారాజ్య సమితి'

### ఆర్. ఎం. ఎస్. ఆర్. అంబుసోలి

★ మీ జవాబులు రాను రాను బోరు కొట్టేస్తున్నాయండి

● దోన్ట్ వర్రీ యంగ్ మాన్! అందుకే కదా పత్రికలో యితర శీర్షికలుంట?!

### జి. ఎస్. ద్రాక్షారామం

★ స్త్రీ అర్ధ రాత్రి ఒంటరిగా తిరగాలని, అప్పుడే దేశానికి నిజమైన స్వాతంత్రం వచ్చినట్టని అప్పుడు గాంధీ, యిప్పుడు రాజకీయవాదులు చెప్పి పాపోతున్నారు. వీరి ఆలోచనలు ఆచరణలోనికి రావాలంటే ముందు దొంగలను, రౌడీలను, హంతకులను సమూలంగా అరికట్టాలని నా ఉద్దేశ్యం.

● మరి రాజకీయవాదులనేంచేద్దాం?! .... మన దేశమే పెద్ద క్రిమినల్ సెటిల్మెంటుగా తయారైంది. చూడ్డం లేదా.

### సి.ఎస్. ఎమ్మిగనూరు

★ ధనవంతునికి పేదవానికి ఉన్న తేడా?

● డబ్బు

★ రాజకీయాలలో విద్యార్థులు?

● పావులు!

★ దేవునిపై మీకు నమ్మకం వుందా?

● ఉంది బొత్తిగా కష్టానికి సుఖానికి నేనే బాధ్యురాలనని అనుకోడానికి భయం నాకు.

★ మనిషి విలువ ఎప్పుడు తెలుస్తుంది?

● మనిషిని తొలగించినప్పుడు 

# ఆంధ్ర సచిత్ర వారపత్రిక

## 1986 దీపావళి కథల పోటీ
## మొత్తం బహుమతులు రు. 7,200/-

ఎప్పటిలాగే ఈ ఏడాది కూడా దీపావళి కథల పోటీని నిర్వహిస్తున్నాము. గత ఏడాదికంటే ఈసారి బహుమతుల మొత్తాన్ని పెంచాము. గతంలో లాగే ఇప్పుడు కూడా సంపాదకుని ఎన్నికలో ఉత్తమంగా వచ్చిన ఆరు కథలని అకారాది క్రమంలో ఆంధ్ర సచిత్ర వార పత్రిక దీపావళి సంచికలో, ఆ తరువాతి సంచికలో ప్రచురిస్తాము. అటు తరువాత పాఠకుల బాలట్ నిర్వహిస్తాము.

**ముగింపు తేదీ : 16 ఆగస్టు 1986**

పోటీలో ఎన్నికైన ఆరు కథలకు ఒక్కొక్క దానికి రు 700/- చొప్పున బహుమతి లభిస్తుంది. ఆ తరువాత పాఠకుల బాలట్‌లో మొదటి, రెండవ, మూడవ స్థానాలలో వచ్చిన కథలకి వరుసగా రు. 750, రు. 650/- రు 550/- వంతున అదనపు బహుమతులుగా అందజేస్తాము మిగిలిన మూడు కథలకి ఒక్కొక్క దానికి అదనంగా రు. 350/- చొప్పున ప్రత్యేక బహుమతిగా ఇస్తాము.

### నిబంధనలు

1 కథా వస్తువు తెలుగు వారి సామాజిక జీవితానికి సంబంధించినదై ఉండాలి
2 కథ వ్రాత ప్రతి పన్నెండు అర రావు (ఎక్సర్ సైజు పుస్తకం పేజీకి రెట్టింపు) పేజీలకి మించి ఉండకూడదు కాగితానికి ఒక వైపే సిరాతో లేదా బాల్‌పెన్‌తో రాయాలి వ్రాతప్రతిపై "1986 దీపావళి కథల పోటీకి' అని మొదటి పేజీ పై భాగంలో స్పష్టంగా రాయాలి
3 అనువాదాలు, అనుసరణలు, కాపీ కథలు పంపరాదు గతంలో ప్రచురింపబడిన రేడియోలో ప్రసారం అయిన, ఇతర పత్రికలకి పరిశీలనకి పంపిన వాటిని పోటీకి పంపరాదు ఈమేరకి రచయిత(త్రు)లు హామీ పత్రం రాసి సంతకం చేసి వ్రాత ప్రతితో పాటు పంపాలి హామీ పత్రం లేని రచనలు పరిశీలింపబడవు ఆంధ్రపత్రిక సంస్థలోని ఉద్యోగులు, వారి బంధువులు ఈ పోటీలో పాల్గొనరాదు
4 రచయితలు, రచయిత్రులు కలం పేరుతో రాసినా తమ అసలు పేరు, పూర్తి చిరునామా వ్రాత ప్రతి మీద స్పష్టంగా రాయాల్సి ఉంటుంది
5 సంపాదకుని ఎన్నికలో బహుమతి పొందిన ఆరు కథలనీ ఆయా రచయిత(త్రు)ల పేర్లు లేకుండా ప్రచురిస్తాము తరువాత బాలట్ ఫలితాలతో పాటు వారి పరిచయాలని ఫొటోలతో సహా ప్రచురిస్తాము
6 పోటీలో బహుమతి పొందిన కథా రచయిత(త్రు)లు తమ ఫొటో, జీవిత విశేషాల ప్రచురణకి అంగీకరించవలసి ఉంటుంది
7 రచనలపై వచ్చే ఎలాంటి పేచీలకైనా ఆయా రచయిత(త్రు)లే బాధ్యత వహించవలసి ఉంటుంది
8 పోటీకి పంపే కథలు 16 ఆగస్టు 1986కి గానీ, ఆలోగా కానీ మా కార్యాలయానికి చేరేలా పంపాలి ఆ తరువాత అందిన వాటిని పోటీకి పరిశీలించటం జరగదు
9 పోటీకి పంపిన కథలని ఎటువంటి పరిస్థితులలోనూ తిప్పి పంపటం జరగదు కాబట్టి రచయిత(త్రు)లు వాటితో పాటు తపాలా బిళ్లలు అతికించిన, స్వంత చిరునామా కల కవర్లు జతపరచి పంపనవసరం లేదు
10 పోటీలో బహుమతి పొందని కథలలో కొన్నిటిని సాధారణ ప్రచురణకి స్వీకరించి వీలు వెంబడి వాటిని ప్రచురించటం జరుగుతుంది ఆ విషయాన్ని ఆయా రచయిత(త్రు)లకి తెలియ చేస్తాము ప్రచురణకి స్వీకరించని కథల విషయంలో ఆయా రచయిత(త్రు)లకి తెలియ చెయ్యటం సాధ్యం కాదు వాటి విషయంలో ఎటువంటి ఉత్తర ప్రత్యుత్తరాలకి అవకాశం లేదు
11 పోటీకి పంపే కథలని సంపాదకుడు, ఆంధ్ర సచిత్ర వార పత్రిక, గాంధీనగరం, విజయవాడ-520 003 అన్న చిరునామాకి పంపాలి వ్యక్తుల పేర పంపరాదు కవరు పై భాగంలో '1986 దీపావళి కథల పోటీకి" అని స్పష్టంగా రాయాలి

రచయిత(త్రు)లు అందరూ ఉత్సాహంగా ఈ పోటీలో పాల్గొని దీనిని జయప్రదం చేయగలరని ఆశిస్తున్నాము.

–సంపాదకుడు

# సినిమా వి



స్వప్న, "సమర్థుడు"లో

నిర్వహిస్తున్న పై సంచలనాత్మక చిత్రానికి ఊటీలో ఒక ప్రభోదాత్మకమైన గీతం చిత్రీకరింపబడిన అనంతరం మద్రాసులో షూటింగ్ జరుగుతోంది. కీర్తి, చంద్రమోహన్, సత్యనారాయణ, జె. వి. సోమయాజులు, గిరిబాబు, నూతన్ ప్రసాద్, కోట శ్రీనివాసరావు, పి. ఎల్. నారాయణ, శివప్రసాద్, రాజశేఖర రెడ్డి, త్యాగరాజు, తులసి, నిర్మల, విజయకుమారి, కుమారి వరలక్ష్మి తెరముందు; మోదుకూరి జాన్సన్, వేటూరి, రాజ్–కోటి, పుష్పాల గోపికృష్ణ, కళాధర్, శీను, సూపర్ సుబ్బరాయన్, కోటగిరి గోపాలరావు తెర వెనుక నిపుణులతో ఏ. చంద్రశేఖర రెడ్డి దర్శకుడు. జి. హనుమంతరావు నిర్మాణ సారథ్యంలో ఈ చిత్రాన్ని నిర్మిస్తున్న జి. ఆదిశేషగిరిరావు "దసరా కానుకగా రిలీజ్ చేస్తున్నాం," అన్నారు.

## చిత్రీకరణ ముగిసిన "తలంబ్రాలు"

"నేటి ఆధునిక సమాజంలో మహిళలు ఎదుర్కొనే

"ధర్మపీఠం దద్దరిల్లింది" లో శో



## కౌముదీ పిక్చర్స్ "ఓ ప్రేమ కథ"

"సంఘం సృష్టించిన అడ్డుగోడలను పడగొట్టి విజయం సాధించిన ప్రేమికుల జంట మధురమైన గాథ. ప్రేమ పాత్రలో రాధిక, ప్రేమికుడుగా సర్వదమన్ బెనర్జీ నటిస్తున్నారు," అన్నారు ఎం. ఎస్. రెడ్డి. ఈయన నిర్మిస్తున్న పై చిత్రం షూటింగ్ జూన్ 23న మొదలైంది. జీవిత, సత్యనారాయణ, గొల్లపూడి మారుతీరావు, జయమాలిని, కృష్ణవేణి ఇతర పాత్రధారులు. డాక్టర్ రావూరి భరద్వాజ కథకుడు. మల్లెమాల మాటలు, పాటలు రాశారు. ఎం. రంగారావు సంగీతం, పి. ఎస్. ప్రకాష్ ఛాయ, భాస్కరరాజు శిల్పం, శివశంకర్ నృత్యాలు, జయంపు కృష్ణ సహకార దర్శకత్వం, జె. వి. వి. సత్యనారాయణ సహాయ దర్శకత్వం, సాయిరత్న ప్రొడక్షన్, సత్తిబాబు సంయుక్త దర్శకత్వంతో బి. జి. నాయుడు ప్రొడక్షన్ ఎగ్జిక్యూటివ్. "సెప్టెంబర్ 3కి షూటింగ్ ఫినిషవుతుంది," అన్నారు స్క్రీన్‌ప్లే, దర్శకత్వ బాధ్యతలు వహించే రాజశ్రీ.

## కృష్ణ సమర్పించే "నా పిలుపే ప్రభంజనం"

"మమతను పెంచడమే మానవధర్మం అనే అంశంతో జాతి సమైక్యతను చాటి చెప్పే విప్లవాత్మక, రాజకీయ ఇతివృత్తం. నవతకు ప్రోత్సాహాన్ని, యువతకు ఉత్సాహాన్ని, ప్రజలలో చైతన్యాన్ని, సామాజిక స్పృహను కలిగించే చిత్రం," అన్నారు కృష్ణ. ఈయన సమర్పిస్తూ ప్రధాన పాత్ర

## స్టాలు జి. వి. జి.

సమస్యలు, వాటికి పరిష్కార మార్గం చూపే చిత్రం. మే 26 నుంచి హైదరాబాద్‌లో ఒకే షెడ్యూల్లో షూటింగ్ పూర్తి చేశాం," అన్నారు ఎం. ఎస్. ఆర్ట్ మూవీస్ అధినేత ఎం. శ్యామ్‌ప్రసాద్ రెడ్డి, కల్యాణ చక్రవర్తి, జీవిత, రాజశేఖర్ ఆదిగాగలవారు పాల్గొన్నారు. గణేష్‌పాత్రో మాటలు. మల్లెమాల పాటలు, సత్యం సంగీతం, పి. లక్ష్మణ్ ఛాయ, సూరి శిల్పం, కె. వి. మార్తాండ్ కూర్పుతో కోడి రామకృష్ణ స్క్రీన్‌ప్లే, దర్శకత్వ బాధ్యతలు వహించిన ఈ చిత్రం ఎం. ఎస్. రెడ్డి సమర్పణ.

### వినయ్ ఆర్ట్ పిక్చర్స్ చిత్రంలో కృష్ణ, శ్రీదేవి

"జూన్‌లో మొదటి షెడ్యూల్ పూర్తయింది. జూలై 11-15, ఆగస్టు 25-31, సెప్టెంబర్ 23-30 షెడ్యూల్స్‌తో షూటింగ్ పూర్తయి పోతుంది." అన్నారు కె. బాపయ్య. ఈయన దర్శకత్వంలో, మిద్దే రామారావు సారథ్యంలో టి. శ్రీనివాసరెడ్డి నిర్మిస్తున్న

ాబు. జయసుధ





"పరశురాముడు"లో కృష్ణ, కీర్తి

చిత్రంలో కృష్ణ, శ్రీదేవి, రావు గోపాలరావు, వేలు, వీరభద్రరావు, ప్రభృత తారాగణం. పరుచూరి సోదరులు మాటలు, పాటలు రాశారు. చక్రవర్తి సంగీతం, వెంకట్ ఛాయ, డి. వెంకటరత్నం కూర్పు, సాయి కుమార్ శిల్పం, సలీం నృత్యాలతో ఎన్. వెంకటేశ్వరరావు, ఉదయ్ కుమార్ ప్రొడక్షన్ బాధ్యతలు వహిస్తున్నారు.

### "దొంగ మొగుడు"

"యండమూరి వీరేంద్రనాథ్ అముద్రిత నవల ఇది. ప్రేక్షకులు రెట్టింపు ఆతురతతో ఎదురు చూస్తుంటారు గనుక అందరికీ సంపూర్ణ సంతృప్తి కలిగించే రీతిలో ఈ చిత్రాన్ని రూపొందించటానికి మా మహేశ్వరి మూవీస్ యూనిట్‌లోని ప్రతి ఒక్కరూ ప్రత్యేక శ్రద్ధతో కృషి చేస్తున్నారు. ఫలితం. మహాద్భుతంగా ఉంటుందని మా అందరి దృఢ విశ్వాసం. కాశ్మీర్‌లో ఒక పాటను మున్నెన్నడూ కనీ వినీ ఎరుగని రీతిలో పిక్చరైజ్ చేశారు మా డైరెక్టరు. సెప్టెంబర్‌లోగా షూటింగ్ పూర్తయి పోతుంది."

అన్నారు ఎస్. పి. వెంకన్నబాబు. ఈయన చిత్రంలో ద్విపాత్రలు నిర్వహించే చిరంజీవి సరసన రాధిక, భానుప్రియ నాయికలు. సత్యనారాయణ, రావు గోపాలరావు, చరణ్‌రాజ్, అల్లు రామలింగయ్య, వేలు, కె. ఆర్. విజయ ఇతర తారాగణం. సత్యానంద్ మాటలు. చక్రవర్తి సంగీతం, లోక్‌సింగ్ ఛాయ, శ్రీనివాసరాజు శిల్పం, డి. వెంకటరత్నం కూర్పుతో మోహన్ ప్రొడక్షన్ కంట్రోలర్, సత్యం, కె. వి. నర్సయ్య ప్రొడక్షన్ ఎగ్జిక్యూటివ్స్.



"దొంగ మొగుడు"లో చిరంజీవి, రాధిక

# సినిమా

## కొమ్మినేని దర్శకత్వంలో "తాతయ్య కంకణం"

"ఇది ఆద్యంతం అలరింప చేసే జానపద చిత్రం. పాటలను హొగెనకల్‌లో పిక్చరైజ్ చేస్తాం. ఆగస్టులో షూటింగ్ పూర్తవుతుంది," అన్నారు కొమ్మినేని. ఈయన కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో టి.

బ్రహ్మాజీరావు, బి. ప్రభాకరరావు నిర్మిస్తున్న శ్రీ ప్రభా ఆర్ట్స్ వారి పై చిత్రం షూటింగ్ జూన్ 15 నుంచి జరుగుతోంది. నరసింహరాజు, నళిని, జె. వి. సోమయాజులు, నాగేష్, జయమాలిని, అనూరాధ పాల్గొంటున్నారు. కర్పూరపు ఆంజనేయులు మాటలు. ఆత్రేయ పాటలు, కె. వి. మహదేవన్

"మొనగాడు"లో అర్జున్, ముచ్చెర్ల అరుణ



సంగీతం, హెచ్. ఎస్. వేణు ఛాయ. పి. వెంకటేశ్వరరావు శిల్పం. శ్రీ రామమూర్తి సంయుక్త దర్శకత్వం. కె. పి. శర్మ ప్రొడక్షన్. కందస్వామి కూర్పుతో సున్నా వెంకట్రావు సహనిర్మాత. ఆర్. రామరాజు సమర్పణ.

## కొమ్మినేని దర్శకత్వంలో "తాయారమ్మ - తాండవకృష్ణ"

"నిశ్చితార్థం కూడా అయ్యాక ఆంజనేయస్వామి భక్తుడైన పెళ్ళికొడుకు తనకు పెళ్ళి పెడాకులూ వద్దు, బ్రహ్మచారిగానే ఉండిపోతాను – అని భీష్మించుకుని కూర్చుంటే, పెళ్ళికూతురి గతి ఏం కావాలి? ఆమె ఏం చేస్తుంది? ఇది భలే తమాషా సబ్జెక్టు. జూన్ 1 నుంచి 15 వరకు మొదటి షెడ్యూల్ పూర్తి చేశాం," అన్నారు కొమ్మినేని. ఈయన స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో పోలా రామయ్యశెట్టి సమర్పించే లోకేశ్వరి ఆర్ట్ క్రియేషన్స్



నా పళ్ళే నాకు ప్రాణం – వాటినే భీమా చేస్తాను!

వారి పై చిత్రంలో అర్జున్, రజని, గొల్లపూడి, జె. వి. సోమయాజులు, అల్లు రామలింగయ్య, పద్మనాభం, త్యాగరాజు, నళినీకాంత్, అర్జా జనార్ధనరావు, షావుకారు జానకి, వై. విజయ, బేబీ సీత, వీరభద్రరావు, రాళ్ళపల్లి వగైరా నటవర్గం. కె. రవీంద్రబాబు కథ, కాశీ విశ్వనాథ్ మాటలు, జాలాది పాటలు, చక్రవర్తి సంగీతం, కబీర్‌లాల్ ఛాయ, శివశంకర్ నృత్యాలు, జూడో రత్నం సాహసాలు , రవీంద్రబాబు కూర్పు, దిలీప్‌సింగ్ శిల్పం, రమణమూర్తి – జి. నాగేశ్వరరావు ప్రొడక్షన్, జయప్రసాద్‌రెడ్డి – వి. వి. కె. మల్లయ్య సహకార దర్శకత్వంతో కె. ఎల్. ఎన్. శాస్త్రి ప్రొడక్షన్ కంట్రోలర్. "జూలై 10–25, ఆగస్టు 1–15 షెడ్యూల్స్‌తో షూటింగ్ పూర్తవుతుంది," అన్నారు నిర్మాత పోలా శ్రీనివాసులు.

## ఎన్. బి. చక్రవర్తి దర్శకత్వంలో "మొనగాడు"

"చెల్లెలి సుఖ సంతోషాల కోసం స్టంట్ మాస్టర్ వృత్తిని స్వీకరిస్తాడు హీరో. కొందరు హీరోలకు డూప్‌గా వేస్తాడు. ఆ హీరోలుగా బాలకృష్ణ, సుమన్ ప్రత్యేక దర్శనమిస్తారు." అన్నారు ఎన్. బి. చక్రవర్తి. ఈయన స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో పి. హెచ్. వి. నరసింహారెడ్డి నిర్మించిన సి. వి. ఎన్. ప్రొడక్షన్స్ వారి పై చిత్రంలో అర్జున్, రజని, గొల్లపూడి, రాజేష్, వేలు, అరుణ, వై. విజయ, అనూరాధ నటించారు. సత్యానంద్, వేటూరి, చక్రవర్తి, ఎస్. సుధాకర రెడ్డి, సాయి, సాహుల్, వెంకటేశ్వరరావు, సలీంబాబు, గణేశ్ తెర వెనుక కృషి చేశారు.



"మన్నెంలో మొనగాడు"లో వెన్నెల

## "తాత మనవళ్ళు" తదుపరి చిత్రంలో శోభన్‌బాబు, విజయశాంతి

శ్రీ కామాక్షి క్రియేషన్స్ చిత్రం "పరిచయం" పేరును "తాత మనవళ్లు"గా మార్చినట్లు నిర్మాత ఎన్. కృపాకరరెడ్డి తెలియజేస్తూ," మా తదుపరి చిత్రాన్ని నవంబర్‌లో ప్రారంభించి. ఫిబ్రవరిలో పూర్తి చేస్తాం." అని కూడా అన్నారు. ఈ కొత్త చిత్రంలో శోభన్‌బాబు, విజయశాంతి నాయకానాయికలు. గణేష్‌పాత్రో మాటలు, వేటూరి గీతాలు, చక్రవర్తి సంగీతం, సుధాకరరెడ్డి ఛాయతో కె. మురళీమోహనరావు డైరెక్టరు.

# పాఠకులకి సూపర్ హీరోయిన్ విజయశాంతి సమాధానాలు!



తెలుగు సినీ ప్రేక్షకుల అభిమానాన్ని విశేషంగా చూరగొని 1985 వ సంవత్సరానికి ఉత్తమనటిగా ఎన్నికైన సుప్రసిద్ధ నటీమణి విజయశాంతి ఆంధ్రసచిత్ర వారపత్రిక పాఠకుల ప్రశ్నలకి సమాధానాలు ఇస్తారని తెలియ చేయటానికి సంతోషిస్తున్నాము. త్వరలో ప్రారంభించే ఈ శీర్షికకి తమ ప్రశ్నలని పంపవలసిందిగా పాఠకులని కోరుతున్నాము. వారం వారం ప్రచురింపబడే ఈ శీర్షికలో విజయశాంతి ఎన్నిక చేసిన ఉత్తమ ప్రశ్నకి ప్రతివారం ఆమె ఆటోగ్రాఫ్ ఉన్న కలర్ ఫోటో బహుమతిగా లభిస్తుంది.

(ఈ శీర్షికకి ప్రశ్నలని పంపే వారు క్రింద ఇచ్చిన కూపన్ పూర్తి చేసి 'విజయశాంతి సమాధానాలు ఆంధ్రసచిత్రవారపత్రిక, గాంధీనగరం, విజయవాడ–520003 అన్న చిరునామాకి పంపాలి.

ఒక కూపన్‌లో ఒక ప్రశ్నని మాత్రమే రాసి పంపాలి. విడిగా రాసిన వాటిని పరిశీలించటం జరగదు.

పాఠకులు ఉత్సాహంతో ఈ అవకాశాన్ని ఉపయోగించుకోగలరని ఆశిస్తున్నాము. –సం.)

———— కూపన్ ————

ఆంధ్రసచిత్ర వారపత్రిక

## విజయశాంతి సమాధానాలు

ప్రశ్న : ______________________________

______________________________

______________________________

పంపిన వారి పేరు : ______________________________

పూర్తి చిరునామా : ______________________________

______________________________

______________________________

## ముగ్గురు జంటలతో "దబ్బెవరికి చేదు"

ఇంతవరకు కథలు అందించిన మల్లాది వెంకట కృష్ణమూర్తి ఆయన దబ్బెవరికి చేదు" నవలకు తొలిసారిగా సంభాషణలు కూడా సమకూరుస్తున్నారు ఆగస్టు 1 నుంచి 31 వరకు ఒకే షెడ్యూల్లో షూటింగ్ పూర్తవుతుంది అన్నారు ఎ పోతరాజు ఈయన సమర్పణలో తారకనామా మూవీస్ అనే నవ సంస్థ అధినేతలు ఎస్ రామలింగరాజు వాసిరెడ్డి ఉమామహేశ్వరరావు నిర్మించే పై చిత్రంలో చంద్రమోహన్ శరత్‌బాబు రాజేంద్రప్రసాద్, మనోచిత్ర సులక్షణ, సీత అల్లు రామలింగయ్య వేలు, వీరభద్రరావు ఒక కీలకమైన పాత్రలో సత్యనారాయణ పాల్గొంటారు వాసూరావు సంగీతం కోటేశ్వరరావు ఛాయ డి రాజగోపాల్ కూర్పుతో పి ఎస్ ప్రసాద్ నిర్మాణ సారథి



అందరికీ బాలరంజని అంటే ఇష్టం అందుకే ఈ నేస్తాల అత్యవసర సమావేశం!

(ఫొటో : పి. రవిచందర్)

సినిమా

## బాలయ్య రూపొందించే "వసువుతాడు"

హీరో ప్రేమ్ (తులసీరామ్) సుధ (రాధ) ప్రేమించి పెళ్ళి చేసుకోవాలనుకుంటారు కాని అది సుధ అన్న శ్రీకాంత్ (శరత్‌బాబు)కు ఇష్టం లేదు తను పని చేస్తున్న కంపెనీ ఛైర్మన్ కొడుకుని పెళ్ళి చేసుకుంటే ఆ కంపెనీకి మేనేజింగ్ డైరెక్టర్ అవగలడని అతని ఆశ. అందుకని ప్రేమ్ సుధలకు ఎన్నో అవరోధాలు కల్పిస్తాడు. చివరికి అందర్నీ ఎదిరించి ప్రేమ్ సుధలు గుళ్లో పెళ్ళి చేసేసుకుంటారు. ఆ తర్వాత కథ ఎన్నో మలుపులు తిరుగుతుంది. ఈ సన్నివేశాలన్నీ తీశాక రషెస్ చూసుకుంటే, తులసీరామ్ సహజమైన చక్కని నటనకు నాతో పాటు మరెందరికో ఆశ్చర్యం, ఆనందం కలిగాయి. ఇక తిరుపతి పరిసరాలలో నాలుగు ఫ్యాయిట్లు పిక్చరైజ్ చేయవలసి ఉంది," అన్నారు ఎం. బాలయ్య, బి. ఎ. ఈయన కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో అలపర్తి సూర్యనారాయణ, మన్నవ వెంకట్రావు నిర్మించే అమృతాఫిలిమ్స్ వారి పై చిత్రంలో అల్లు రామలింగయ్య. నూతన్ ప్రసాద్, దేవదాస్ కనకాల, సాక్షి రంగారావు, అన్నపూర్ణ, పండరీబాయి, లక్ష్మీసుధ, రేఖ తదితర నటవర్గం. పాటల సంభాషణలకర్త. కొసరాజు, జాలాది, సీతారామశాస్త్రి గీతాలకు చక్రవర్తి బాణీలు కూర్చారు. ఎం. జి. ఆర్. మణి ఛాయ. కె. ఎల్. ధర్ శిల్పం, వి. ప్రసాద్ సహకార దర్శకత్వం. బి. సత్యానాయుడు సంయుక్త దర్శకత్వం. ఎస్. పి. ఎస్. వీరప్ప కూర్పుతో కె. రవికుమార్ ప్రొడక్షన్ మేనేజర్.

'ఒక రాధ, ఇద్దరు కృష్ణులు"లో శ్రీదేవి



## సూర్య దర్శకత్వంలో నరేష్ చిత్రం "దిగ్విజయం"

"నాది డైనమిక్ రోల్. 50 రోజుల షూటింగ్‌లో 20 రోజులు పూర్తిగా రాత్రుళ్ళలోనే షూట్ చేశాం," అన్నారు నరేష్. ఈయన నిర్మించిన విక్టరీ ఫిలిమ్ సర్క్యూట్ వారిపై చిత్రంలో తులసి, త్రినాథ్, గొల్లపూడి, వేలు, వీరభద్రరావు, రాళ్ళపల్లి, పొట్టి ప్రసాద్, ధమ్, మాడా, రాజ్–కోటి సంగీత దర్శకుల జంటలోని రాజ్, మాస్టర్ బ్రూస్‌లీ, కల్పనారాయ్, నవనట బృంద, ఒక కీలకమైన పాత్రలో జయసుధ పాల్గొన్నారు. సత్యానంద్, రాజ్–కోటి, అప్పలాచార్య, వడ్డేపల్లి కృష్ణ ప్రభృత సాంకేతిక వర్గంతో శ్రీనివాసరావు సహనిర్మాత. సూర్య కథ, స్క్రీన్‌ప్లే రచయిత, దర్శకుడు.

□

EXCELLENT ENTERTAINMENT MOVIE OF THE YOUNG MEN !




నిర్మాత: కమలహాసన్

దర్శకత్వం: రాజశేఖర్ కె.కం., సంగీతం: ఇళయరాజా

నిర్వహణ: ఆర్.ఎమ్.చంద్రశేఖర్

గుంటూరు: మల్లిసెట్టి మురళీధరరావు; త్రూ: రాంప్రసాద్ ఫిలింస్; నెల్లూరు: కవిత ఫిలింస్; కావలి, త్రూ: మారుతి ఫిలింస్;
పెద్ద: ఉషా పిక్చర్స్, వైజాగ్: శ్రీచిత్ర: వైజాం: శ్రీవెంకటకృష్ణా ఫిలింస్: విడెడే: సత్యనారాయణ కంబైన్స్;

# అభిమాన తారలపై అభిప్రాయం

శ్రీదేవి నా మనోరంజని
నా హృదయ రాణి
సుమధుర హాసిని
మంజుల మధురభాషిణి
హావభావాల అభినేత్రి
అభినయాన సుగాత్రి

అందుకే నేను ఆమె అభిమానిని. ఆమె



'కళామతల్లి' సిగలో 'మరుమల్లియ'. ఆమె తెలుగు, హిందీ ప్రేక్షకులకు, అభిమానులకు "ఆరాధ్య దేవత". అందం, అభినయం,అన్నీ కలబోసిచేసిన అందాల సుందరి "శ్రీదేవి" "వసంత కోకిల" చూసిన వారికెవరికైనా అర్థం అవుతుంది. ఆమె నటిస్తే ఆ పాత్రకే అందం వస్తుందని, శోభ చేకూరుతుందని. కాని ఈ మధ్య ఆమె తెలుగు సినిమాలలో అరుదుగా కన్పించుతోంది. డాన్స్, డ్యూయెట్స్‌కు పరిమితం కాకుండా వెరైటీ పాత్రలలో నిండైన వస్త్రధారణతో అభిమానుల హృదయాలలో చిరస్థాయిగా నిలిచేటట్టు నటించాలని, నటించి మెప్పించగలరని ఆశిస్తున్నాను.

-ఎన్. జ్యోతి, తణుకు

★ ★ ★

నైతిక విలువలు దిగజారి పసలేని కథ ఇతివృత్తాలతో చిత్రాలు నిర్మితమౌతున్న నేటి వ్యాపారాత్మక పరిశ్రమలో పాత్రలో లీనమై జీవం పోయగల సామర్థ్యం కలవాడే నటుడు. సామర్థ్యం గల నటుడు అందంతో సంబంధం లేకుండా



అనతికాలంలోనే గుర్తింపబడి ప్రేక్షక హృదయాల్లో చెరగని స్థానం సంపాదించుకొంటాడు. అటువంటి సామర్థ్యం గల "నట భాస్కరుడే" ఇటీవల పరిచయమైన సుత్తి వేలు- "నాలుగు స్తంభాలాట" మొదలుకొని హాస్య నటుడిగా పరిచయమై అనేకరకములైన పాత్రలలో నటనా వైశాల్యం కనబరిచి ప్రేక్షకలోకం మెప్పు పొందారు- "దేశంలో దొంగలు పడ్డారు" చిత్రంలో ఒక ఉపాధ్యాయుడుగా ఆయన అభినయం మిక్కిలి ప్రశంసనీయం. "ప్రతిఘటన" చిత్రంలో ప్రళయభీకరమైన ఆయన నటనా విజృంభణం ఆ చిత్ర విజయానికి మొదటి కారణంగా చెప్పక తప్పదు. అటువంటి మంచి పాత్రల్ని జారవిడుచుకోకుండా వ్యాపారదృష్టిని విడచిపెట్టి తన నటస్ఫూర్తితో రసికులను పులకింప చెయాలని కోరుకుంటూ యున్నాను.

-బెలగాం గణేష్, శ్రీకాకుళం

★ ★ ★

డాషింగ్, డేరింగ్, డైనమిక్ హీరో అయిన సుప్రీంస్టార్ చిరంజీవిగారిని అభిమానించే లక్షలాది అభిమానులలో నేను ఒక దాన్ని. "చిరంజీవి" అనే పేరుకు తగ్గట్టుగానే ఆయన చిరంజీవిగా వుంటారు. చిరంజీవి గారి నటనా విధానమంటే నాకెంతో ఇష్టం. అతని డాన్సు అన్నా, ఫైట్స్ అన్నా నేను ఎక్కువ ఇష్టపడతాను. చిరంజీవి గారు నటించిన చిత్రములను చాల చూసాను. కొలది కాలములోనే అగ్రనటులలో ఒకరుగా పేరు తెచ్చుకున్నారు.



"గూండా" చిత్రం చూచి నేను చిరంజీవి గారి అభిమాని నయ్యాను. ఆ చిత్రంలో అతనియొక్క నటనా విధానము చెప్పుకో దగినది. పున్నమినాగు, అడవి దొంగ, ఖైదీ, చిరంజీవి, విజేత, కొండవీటి రాజా మొదలగు చిత్రములలో చిరంజీవి గారి పాత్ర ఎంతో బాగున్నది. విజేత చిత్రంలోని చిరంజీవి గారి పాత్ర అందరిచేత ప్రశంసలు అందుకున్నది. అదే విధముగా కుటుంబ కథా చిత్రములలోను, పౌరాణిక, జానపద చిత్రములలో కూడా నటించి నట్లయితే చిత్రసీమలో గొప్పగా పేరు తెచ్చుకో గలరు. తెచ్చుకుంటారని నా అభిప్రాయము. చిన్న పిల్లలు సహితము చిరంజీవి గారి అభిమానులే. అంతే కాకుండా అన్ని చిత్రములలోనూ ఒకే మాదిరిగా స్టెప్స్ వేయకుండా జాగ్రత్త పడగలరని కోరుచున్నాను.

– జి. సుధ, పేరేచర్ల, గుంటూరు.

★ ★ ★

నా అభిమాన నటి సుజాత . నటన అన్నపదానికి అర్థం చెప్పగల నటీమణులలో సుజాత ఒకరు. ఆమె గొప్ప నటి అని చెప్పడానికి ఒక్క "గోరింటాకు" చిత్రం చాలు. ఈ చిత్రం ద్వారా సుజాత ప్రేక్షకుల హృదయాలలో చిరస్థాయిగా నిలిచిపోయారు. ఆమె మొదట చిత్రం 'గోరింటాకు'లో ఒక ప్రేమికురాలుగ, వంశగౌరవంలో మాతృమూర్తిగా, 'సుజాత'లో ఒక బాధ్యతగల డాక్టరుగా ఆమె నటన అవధులు లేని సముద్రం. "ఏడంతస్తుల మేడ"లో నాగేశ్వరరావుగారు ప్రక్కన ఎంతో అద్భుతంగా నటించారు. ఆమె మోడ్రన్ డ్రస్సులకు దూరంగా



కట్టు, బొట్టు తెలుగింటి ఆడపడుచులా, హుందాగా వుండటంలో ఆమెకు సాటి చిత్ర పరిశ్రమలో మరెవరూ లేరు. ఆమె నిగర్వి కూడ. ఫోటో పంపమని రాసిన వెంటనే సైన్ చేసిన ఫోటో పంపారు. సుజాతగారి అభిమానిగా ఆమెకు నేనిచ్చే నిర్మాణాత్మకమైన సూచనలు ఏమిటంటే మంచి కథవున్న చిత్రాల్లో పాత్రలు పోషించమని, పాటలలో స్టెప్స్ కొంచము ఇంప్రూవ్ చేసి తెలుగు ప్రేక్షకులను రసరంజితులను చెయవలసినదిగా నా మనవి.

-ఎస్. హెచ్. సుజాతనాయుడు, బంటుమిల్లి.

★ ★ ★

నా అభిమాన తార జయసుధ నటనలో, చతురతలో, అభినయంలో పొరపాటు రాని నటి. దుఃఖంలో, చిలిపితనంలో, గర్వంలో, ప్రేయసిగా, భార్యగా, తల్లిగా ఒక్కటేమిటి నవరసాల కథానాయిక. మూడు సంవత్సరాలు సూపర్‌స్టార్ అయినా ఇకముందు కూడ తెరపై కనిపిస్తూ నటనలో జీవించాలని ఈ చెల్లెలి చిన్న కోరిక. దర్శకత్వం వహించినా తెరమరుగు కారాదని



అభ్యర్థన. వంటింటి కాపురంలో 16 సం.ల కన్య అయిన మధ్య తరగతి కుటుంబకుని కూతురి నటన మొదటిసారి నన్ను అభిమానిగా మార్చింది.

-యన్. కళావతి, కోనాసముందర్, నిజామాబాద్ జిల్లా

# మీ పాపాయికి
# అందించండి సెరిలాక్ లాభం



## ఘనపదార్థాలను తొలిసారిగా రుచి చూపిస్తూ

సుమారు 4వ నెల నుంచి మీ పాపాయికి పాలతోపాటు ఘనపదార్థాలూ కావాలి. దీన్ని సెరిలాక్ కానుకతో ప్రారంభించేందుకు ఇదే సరైన సమయం.

**పోషకాహార లాభం :**
సెరిలాక్ ప్రతి మోతాదులోనూ మీ పాపాయికి కావలసిన పోషక పదార్థాలు-ప్రొటీన్లు, కార్బొహైడ్రేట్లు, క్రొవ్వుపదార్థం, విటమిన్లు, ఖనిజాలు అన్నీ ఉన్నాయి. మీ పాపాయికి ప్రత్యేక అవసరాలకు తగినట్టుగా సరైన పాళ్ళలో అన్నీ సమతూకంలో ఉన్నాయి.

**రుచి లాభం :**
సెరిలాక్ మంచి పోషక పదార్థాలకు, మంచి రుచిని కలిపింది. పాపాయిలకు సెరిలాక్ రుచి భలే ఇష్టం.

**సమయం ఆదా లాభం :**
సెరిలాక్ ముందుగా వండినది. దానిలో పాలూ పంచదార ఉన్నాయి. దాన్ని వెచ్చటి నీటిలో కలిపితే చాలు. క్షణంలో ఆహారం తయారు.

మీ పాపాయికి సమతూకంలో పోషకాహారాన్ని అందించేందుకు తయారుచేయడంలో పరిశుభ్రత ను పాటించేందుకూ డబ్బా మీది సూచన లను జాగ్రత్తగా పాటించండి.

ఉచిత సెరిలాక్ పుస్తకం కోసం వ్రాయండి.
సెరిలాక్
పోస్ట్‌బాక్స్ నం: 3.
న్యూఢిల్లీ-110 008.






Nestlé

SAA/FSL 379(R)/TEL

## సెరిలాక్ రక్షణ: పోషకాహారంలో పరిపూర్ణం-ఎంతో రుచికరం




సీరియల్

# జీవితం చేజారిందా?

కాకాని కమల

(గత సంచిక తరువాయి)

ప్రతీ జీవికి భగవంతుడు కొంత దుఃఖంతో పాటు అంతో ఇంతో ఆనందాన్ని కూడా ప్రసాదిస్తాడు

మానవుడు అల్పజీవి

కష్టాలు వచ్చినప్పుడు గడవనట్లు అనిపించిన కాలమే సుఖాలు వచ్చినప్పుడు సునాయాసంగా కాలం పరిగెడుతున్నట్లు అనిపిస్తుంది

పూలలో తేనెలా ఈ 'సుఖం" అన్న పదం నిక్షిప్తమై లేకపోతే మనిషికి జీవితం వ్యర్థం'

ఈ పరమార్థం తెలుసుకుంటే చాలు. మనిషికి రేపు మీద ఆశ కలుగుతుంది

లేనినాడు నిరాశతో కృంగిపోతూ బ్రతుకుని అంతం చేసుకొంటాడు

కాని అది తప్పు

అనంత సృష్టి వికాశాన్ని వీక్షించే మహాభాగ్యం నుంచి వంచితులు కావద్దంటాడు "కవి.

ప్రతీ మనిషికి అంతరాత్మే శత్రువు.

ఆ శత్రువును జయించ గలిగితే మనిషి మహనీయుడు అవుతాడు

నిబిడాంధకారం లోంచి ఎవరో వెలుగులోకి తోసినట్లు చాలా రోజుల తరువాత సీతకి ఎంతో ఆనందంగా వుంది నిన్నటిదాకా ఒంటరి తనంతో, నిరాశా నిస్పృహలతో కృంగిపోయిన మనసే ఇప్పుడు కొత్త ఆశలు చిగురింప చేసుకుంటోంది

వసంతంలో కోయిల లేత మావి చిగురులు మెక్కి తియ్యగా గొంతు సవరించుకొన్నట్లు. ఇన్నాళ్ళకి జీవిత మాధుర్యం తెలుస్తుంది

మరుభూమిలో మల్లె తీగలు పూసినట్లు వైరాగ్యం నింపుకొన్న ఆమె గుండెలో రాగోదయం అయ్యింది.

**జరిగిన కథ –14:** రోజులు గడిచేకొద్దీ ప్రభాకర్, సీతల మధ్య తియ్యని అనుబంధం ఏర్పడుతోంది. సంధ్య స్మృతి చిహ్నంగా మిగిలిన ఎర్ర గులాబీలను సీత కోసిందని, ఆ పూలు కోస్తే తను కొయ్యాలి కానీ వేరెవ్వరూ కొయ్యడానికి లేదని కఠినంగా చెప్తాడు ప్రభాకర్. సీత స్తంభీభూతురాలయింది ఆ ఉదయమే తనకిద్దానై సాయంత్రం సినిమా కెళదామని భర్త చెప్పిన మాటల కామె హృదయం తియ్యగా స్పందించింది. కానీ ప్రభాకర్ అంత కఠినంగా [illegible] ఘోషించింది ప్రభాకర్ కూడా భార్య[illegible] అంత [illegible] ప్రవర్తించి ఉండకూడదని బాధపడతాడు.

[illegible]

సీతకి తను తల్లిని కాబోతున్నానన్న విషయం తెల్సిన క్షణం నుంచి ఆ ఆనందం ఎవరికైనా చెప్పుకోవాలి అన్న ఆరాటం అధికమైంది

కాని ఎవరికి చెప్పుకుంటుంది?

భర్త ప్రభాకర్ వున్నాడు

కాని అతనికి తనపై ప్రత్యేక ఆదరణ లేదు

తనకి ఆనందాన్ని కలిగించిన విషయం అతనికి ఆనందాన్ని కలిగిస్తుందన్న నమ్మకం అసలే లేదు

అతడు కేవలం కొన్ని అవసరాలు గడవటం కోసమే తనని పెళ్ళి చేసుకున్నాడు

అసలు అతనే అన్న మాట ఏమిటి?

ఒక విధంగా చెప్పాలంటే తనూ అంతే'

జీవితం' అనే ఒక పెద్ద అవసరం గడవటం కోసమే ఈ పెళ్ళికి తలవంచింది అందుకే – భార్యా భర్తలుగ తమిద్దరూ ఒకే కప్పు కింద బ్రతుకుతున్నా ఇద్దరి మధ్య కొలతల కందని దూరం వుంది అంతు తెలియని అగాధం వుంది

అందుకే తనకి సంసారంలో మాధుర్యం దొరక లేదు అసలైన సుఖశాంతులు లభించ లేదు

ఎందరిలో వున్నా తన చుట్టు ఒక పరిధి గీసుకొని అందులోనే ఏకాకిలా మిగిలి పోయింది

కాని–

ఇప్పుడు

ఆ పరిధి నుంచి, ఆ ఏకాకిత్వం లోంచి తనను బయటికి లాగటానికి తనకి ఒక చిన్న తోడు రాబోతూంది'

తన మోడు జీవితానికి ఒక ఆలంబన

తనని ప్రేమించి తన కోసం కన్నీరు కార్చే ఒక తియ్యని మమకారం'

మరి ఆనందం కాక ఏమిటి?

ఇక్కడికి వచ్చి ఏడాది కావస్తుంది

కాని తను ఏం పొందింది?

నిరాదరణ నిస్పృహ'

ఈ భర్త ఈ ఆస్తి ఈ ఇద్దరు పిల్లలు తనకి ఏమి కారని తెలుసు

ఏరు దాటటానికి తెప్పలాగ తన అవసరం వీళ్ళకి ఎంతవరకో ఎరగనిది కాదు

ప్రభాకర్ తన మనసేమిటో ముందే చెప్పాడు

ఇంక ఈ పిల్లలు మాత్రం ఎవరు?

అతని రక్తాన్ని పంచుకుని పుట్టిన వాళ్ళే కదా?

ఎంత పెట్టినా మా అమ్మవి అవుతావా? అన్నట్టు ఏన్ని ఎంత ప్రేమగా పెంచినా 'అమ్మ' కాలేదు

అందుకే తనకంటు ఓ 'బాబు' కావాలి అనుకుంది సీత

తను ఏడిస్తే బాధ పడేవాడు, తను ఆనందిస్తే సంతోషపడే వాడు తన రక్తాన్ని పంచుకు పుట్టిన పేగు బంధం కావాలి అనుకుంది సీత

తనకి 'ప్రేమ' అనిపిస్తే వాడ్ని ఎత్తుకుని ముద్దు పెట్టుకుంటుంది

కోపం వస్తే వాడ్ని కొడుతుంది

ఆ స్వతంత్రం కావాలి

తన రక్తం ధారపోసి వాడ్ని పెంచుతుంది

అవసరం అయితే రేపు వాడు తన రక్తాన్ని నా కోసం ఇవ్వటానికి సిద్ధపడాలి

అలాంటి స్వచ్ఛమైన ప్రేమ తనకి కావాలి

ఇదేమి పేరాశ కాదు

దురాశ అసలే కాదు

ఆ కోరిక ఇప్పుడు సఫలీకృతం కాబోతూంది

ఆనందం కాక మరేమిటి?

ఏ స్త్రీ కయినా అంతకంటె వేరే ఏం కావాలి?

మాతృత్వాన్ని మించిన జీవన సాఫల్యం వేరే ఇంకేముంది?

రేపు గురించి తల్చుకొన్న కొద్దీ సీతకి మనసు స్థిమితం తప్పుతూంది

అయితే ఈ సంతోషం అంతటితో ఆగలేదు తనలో పుప్పొంగి పురకలు వేస్తున్న ఆనందాన్ని ఎవరికైనా చెప్పుకోవాలి కొద్దిగా సెలబ్రేట్ చేసుకోవాలి అనిపించ సాగింది

కాని ఎవరు వున్నారని తనకి?

మనసు విప్పి మాట్లాడటానికి

హృదయ పూర్వకంగా అభినందనలు చెప్పే వ్యక్తి ఏదీ?

కాగా –



# జీవితం చేజారిందా

భర్తకి చెప్పాలంటే సీతకి ఎందుకో కొద్దిగా భయం లాంటి భావం కలిగింది.

అతనికి ఇష్టం వుంటుందో వుండదో .

ఈ పూర్ సీత అంటేనే అతనికి విముఖత్వం.

ఇంక తనకి పిల్లలు అంటే మాత్రం ఏం ఆదరణ వుంటుంది? అనిపించింది సీతకి

అందుకే ఒక విధమైన వెరపుతో భర్తకి కూడా చెప్పలేదు

జరగనీ.... కాలం నెమ్మదిగా జరుగుతుంటే ఎవ్వరూ చెప్పనక్కర్లేకుండానే అతనికి తెలుస్తుంది.

"ఇది దాచితే దాగే విషయం కాదు కదా? అనుకొని నిశ్శబ్దంగా వుండిపోయింది సీత

పువ్వులో మకరందంలా తన ఆనందాన్ని తనలోనే దాచుకుంది

* * * *

క్యాలండర్‌లో నాలుగు కాగితాలు మలిగాయ్

ఋతువు మారింది

గ్రీష్మం పోయి వసంతాగమనం అయ్యింది

చెట్లు పచ్చగా చిగురులు తొడిగాయి

తీగలు లతలు సాగి పుష్పించాయి

ఈసారి ప్రకృతితో పాటు సీత మనసు కూడా పులకరించింది

ఆమెలో అణువు అణువునా నవ వసంత శోభ!

పచ్చగా చేవదేలి పూత పిందెతో వున్న చెట్టులా సీత శరీరం కొత్త అందాలు సంతరించుకుంది.

మునుపు లేని హుందాతనం, నిండుతనం వచ్చి చేరాయి

మెరుగు పెట్టిన బంగారంలా శరీరానికి మంచి కాంతి వచ్చింది

నాలుక రుచులు కోరుతోంది

మనసు వూహలు అల్లుతూంది

గర్భిణీ స్త్రీలకి ఐదవనెల్లో ఎన్నో అపురూపాలు చేస్తారు

చేతుల నిండా శ్రీమంతపు గాజులు తల నిండా పూలు

కాని సీతకి ఇలాంటి వేడుకలు ఏమి లేవు

సినిమాల్లో, కథల్లో ఇలాంటి సన్నివేశాల్ని ఎంతో ఘనంగా అపురూపంగా చూసింది సీత.




కాని వాస్తవం అనుభవానికి వచ్చేసరికి సీతకి ఈ చిన్న విషయంలో కూడా అసంతృప్తే మిగిలింది

భర్త అనురాగం, కానుకల మాట అటుంచి అసలు విషయం భర్తకి చెప్పటానికే తగని భయం అనిపించింది.

అసలు అతనికి తనంటేనే అంతంత మాత్రపు ప్రేమ . .

ఇంక తల్లిని కాబోతున్నానంటే అతని రియాక్షన్ ఎలా వుంటుందో ఆమె వూహకి అందటం లేదు

ఉరమని పిడుగులా గర్జిస్తాడో .. చల్లని మలయ మారుతంలా అలరిస్తాడో ?

మూడవ నెల వచ్చాక తల్లికి ఉత్తరం రాద్దామనుకుంది

కాని ఆ ప్రయత్నం కూడా విరమించుకుంది

కారణం – తల్లి సంగతి సీతకి తెలియంది కాదు అసలు సుభద్రమ్మ ఆలోచనా ధోరణే వేరు

సీత లక్షాధికార్ల కోడలు అయినా సీత వల్ల వీసం ఎత్తు వుపకారం జరగటం లేదని, నయాపైసా సొమ్ము కూడా పుట్టింటికి ఆసరా అవటం లేదని, తమ దారిద్ర్యం ఏమి తొలగి పోలేదని ఇప్పటికే ఆవిడకి సీత మీద గొంతు దాకా కోపం, అక్కసు పేరుకొని వున్నాయి.

సీతకి నెల జరిగింది అన్న విషయం తెలిస్తే రెక్కలు కట్టుకుని వాలుతుంది

కాని ఏమి ప్రయోజనం?

తల్లి ధోరణి సీతకి నచ్చదు

కూతురి మీద ప్రేమకంటె అల్లుడి సొమ్ము మీదే మమకారం ఎక్కువ

అందుకే సీత తల్లికి ఉత్తరం వ్రాయాలన్న ఆలోచన విరమించుకుంది

కాని

వుప్పొంగే సముద్రాన్ని ఆపలేనట్లు ఆమె లోని ఆనందానికి అవధులు వెయ్యటం మాత్రం అసాధ్యం అయింది

ఒక రోజు .

* * * *

సీత మంజుని, హరిబాబుని నీట్‌గా ముస్తాబు చేసి తను కూడా మంచి చీర కట్టుకుని అందంగా అలంకరించుకుంది

కింద కార్పెట్ మీద పిల్లలిద్దర్ని కూర్చో పెట్టుకుని రకరకాల బొమ్మలు పేర్చింది

మంజుకి వున్న బొమ్మల సెట్లోంచి కొన్ని బొమ్మల్ని ఏరి సీత ప్రత్యేకంగా ఒక చిన్న 'కొలువు' తయారుచేసింది

అది బిడ్డని తొట్లో వేసే వేడుక!

మధ్యలో స్టాండ్‌కి చిన్న ఉయ్యాల

ఆ తొట్లో ఒక చిన్న బాబు బొమ్మ ఊయల చుట్టూరా రకరకాల అలంకరణల్తో ఆడవాళ్ళ బొమ్మలు

అవన్ని జపాన్ బొమ్మలు అతి ఖరీదైన సెట్స్ అక్కడక్కడ దీపాలు పట్టుకున్న పనివాళ్ళు

ఊయల తొట్టికి కుడి ప్రక్కగా బాబు తల్లితండ్రి బొమ్మ

వాళ్ళ పక్కన ఇద్దరు చిన్న పిల్లలు నిల్చున్నట్లు అతి నేర్పుగా అమర్చింది సీత

'కీ' ఇవ్వగానే తమాషాగా కళ్ళు, చేతులు, తలలు తిప్పుతూ అందంగా అద్భుతంగా వున్నాయి బొమ్మలు

ఆ పనితనం చూస్తుంటే అవి కేవలం బొమ్మలు అనిపించవు

ప్రాణం వున్న మనుషులు అనిపిస్తారు

తలలు కదిలిస్తాయి, కళ్ళు కదిలిస్తాయి. చేతులు పైకి కిందకి ఆడిస్తాయి మాట్లాడినట్లు పెదవులు సయితం కదులుతాయి

సీతకి ఆ ఇంటి మొత్తంలో ఆ బొమ్మలు ఒక అద్భుత ఆకర్షణ! వాటి పట్ల ఒక విధమైన క్యూరియాసిటి!

తన మనసులోని కలలు కోరికలు. .. అన్ని ఆ బొమ్మల రూపంలో అమర్చి మురిసి పోతుంది

ఇప్పుడూ అలాగే తనకి పుట్టబోయే బిడ్డని వుయ్యాలలో వేసే వేడుకని

బొమ్మల రూపంలో అమర్చింది.

ఉయ్యాల ప్రక్కన నిల్చున్న భార్యాభర్తల బొమ్మల ప్రక్కన నిల్చున్న చిన్న పిల్లల్ని చూపిస్తూ ...

"మంజూ! ఈ రెండు బొమ్మలు ఎవరో తెలుసా? నువ్వూ. హరి' అంది.

మంజు విచిత్రంగా సీత మొఖంలోకి చూసింది

'అయితే మరి నీ బొమ్మ ఏది పిన్ని?"

"ఇదిగో. " ఉయ్యాల ప్రక్కన నిల్చున్న దంపతుల్ని చూపించింది.

"ఇది నేను ఈయన. .. మి... నాన్న!"

"ఓ! . " కిలకిలా నవ్వింది మంజు

చిన్న చేతులతో చప్పట్లు కొడుతూ అంది.

భలే బాగున్నాయ్ పిన్ని, మరి ... ఆ ఉయ్యాల ఎవరికి?"

సీత మంజు కళ్ళలోకి చూస్తూ చిన్నగా నవ్వింది ఆ పిల్ల బుగ్గ మీద ముద్దు పెట్టుకుని చెప్పింది

"ఆ చిన్న బొమ్మ తమ్ముడుది "

"తమ్ముడు నా ప్రక్కన వున్నాడుగా పిన్ని?"

"ఊఁ!.. వారిస్తున్నట్లు అంది సీత

'తమ్ముడు అంటే ఈ తమ్ముడు కాదు ఇంకో బుల్లి తమ్ముడు మన ఇంటికి రాబోతున్నాడు హరిబాబు కంటె చిన్న తమ్ముడు చెప్పి తియ్యగా నవ్వింది

మంజుల కళ్ళల్లో ఆనందం తొణికింది

"ఎప్పుడు పిన్ని?

తొందర్లో

'నిజంగానా పిన్ని?'

'నిజంగా '

"అలాగా హాయ్ హాయ్ అయితే నాకు ఆడుకుందుకు ఇద్దరు తమ్ముళ్ళు . మరి . వాడి పేరు ఏమిటి పిన్ని?"

"వాడి పేరా? ఊఁ వాడి పేరు .. నీ యిష్టం. మా చిన్నారి మంజుకి ఏ పేరు ఇష్టం అయితే ఆ పేరు పెడదాం సరేనా? అందాక వాడి పేరు నాని అనుకుందాం బాగుందా?"

'ఓ! బాగుంది కాని వాడు చిట్టి తమ్ముడు ఎప్పుడు వస్తాడు పిన్ని?"

సీత తలవంచుకుని చేతి వేళ్ళు ముడిచి లెక్క పెట్టి చెప్పింది

ఎప్పుడా?. ఆఁ... ఇంకొక ఐదు నెల్ల తరువాత. సరేగాని మరి చిట్టి తమ్ముడికి ఆడుకుందుకు నీ బొమ్మలు ఇస్తావా?"

'ఓ.. ఇవన్ని వాడికే ఇచ్చేస్తాను పిన్ని" సంబరంగా చేతులు, కళ్ళు హుషారుగా తిప్పేసింది మంజు

"మరి నేను పన్లో వున్నప్పుడు వాడు ఏడిస్తే ఎత్తుకుంటావా?'

విచిత్రంగా చూసింది మంజు

"ఎందుకెత్తుకోను పిన్ని? నువ్వు తమ్ముడ్ని అస్తమానం ఎత్తుకుంటున్నావుగా! చిట్టి తమ్ముడ్ని నేను ఎత్తుకుంటాను "

నా తల్లే! నాకు తెలుసు నీ మనసు బంగారం

సీత ముందుకి వంగి ప్రేమగా మంజు బుగ్గలు పుణికి ముద్దు పెట్టుకుంది

ఇంతలో బాబు కెవ్వు కెవ్వుమని ఏడవటం మొదలు పెట్టాడు

"ఓరి ఓరి అక్కని ముద్దు పెట్టుకున్నానని నీ కప్పుడే కోపం వచ్చేసిందరా? . అల్లరి దా దా " అంటూ బాబుని ఎత్తుకుని ఒళ్ళో కూర్చోపెట్టుకుంది మరొక చేత్తో మంజుని కూడా దగ్గరకి తీసుకుంది

ఆ ఇంట్లోకి ఇంకొక చిన్న ప్రాణి రాబోతోందంటే తనతో పాటు పాప మంజు కూడా సరిసమానంగా ఆనందాన్ని పంచుకునే సరికి సీతకి చాలా సంతోషం అనిపించింది

"పసి పిల్లలు కల్లాకపటం ఎరుగని అమాయకులు దేముడితో సమానం అంటారు ఇందుకేకాబోలు 'అనుకుంది తృప్తిగా

ఆ రోజు సాయంత్రం ప్రభాకర్ ఇంటికి రాగానే మంజు తూనీగలా తండ్రి




ఎ. బి. ఎ; రామచంద్రపురం

మనం ప్రతి రోజూ ఆహారంలో కూరలలో అల్లం వాడుతూ ఉంటాం కదా? అల్లంవల్ల శరీరానికి ఏదైనా ఉపయోగం ఉందా? మనం ప్రతినిత్యం ఉపయోగించే అల్లంలోని ఔషధ విలువలను గురించి చెప్పండి.

అల్లానికి జీర్ణ శక్తిని కలిగించే గుణమూ, వాంతులను తగ్గించే గుణమూ, కడుపులో పుండుని తగ్గించే గుణమూ, పిత్త వికారాన్ని తగ్గించే గుణం ఉందని ఆయుర్వేద శాస్త్రం తెలియజేస్తున్నది.

అధికంగా తింటే జిగట విరేచనాలు అవుతాయనీ, మూల వ్యాధి ఉన్న వారు దీనిని మితంగా వాడాలని ఆయుర్వేద వైద్యుల అభిప్రాయం.

అలోపతీలో టంక్చర్ జింజిబెరిస్ కొన్ని ఔషధాల తయారిలో వాడబడుతుంది.

జి. ఎస్; హైదరాబాదు

మా పాప వయస్సు 4సం లు స్వీట్సు ఎక్కువగా తింటూ ఉంటుంది, 2, 3 నెలల కొకసారి నులి పురుగుల వలన బాధ పడుతూ ఉంటుంది అప్పుడు మందు వేస్తాను అలా ఊరికే వేస్తూ ఉంటే మంచిదేనా?

స్వీట్సు తినటానికీ నులి పురుగులకీ సంబంధం లేదు. ఆ పురుగుల గ్రుడ్లను మింగటం జరిగితే క్రిములు వస్తాయి. కింద పడ్డ ఆహార పదార్థాలని వాడకూడదు. గోళ్ళు కత్తిరింపబడాలి. మల పరీక్ష చేసి పురుగులు ఉన్నాయని తెలిస్తేనే మందులు వాడవలసి ఉంటుంది.

అనవసరంగా ఏ మందు వాడినా హానికరమే!

పి. జి. ఎమ్; ధన్‌భాద్

నా వయస్సు 18 సంవత్సరములు. నాకు 7, 8 సంవత్సరముల వయస్సప్పుడు మట్టి, బలపములు తినే అలవాటున్నదట. గత 5 సంవత్సరముల నుండి శరీరం అంతా తెల్లగా అయిపోయి, ముఖం వాచినట్లు వుంటోంది. కొంచము దూరం నడిస్తే అలసట వచ్చేస్తోంది. డాక్టర్‌కి చూపిస్తే కడుపులో పాములున్నాయని మందు వ్రాసిచ్చారు. 6 మార్లు మందులు వాడినా ఒక్క పాము గూడా పడలేదు. టానిక్‌లు గూడా వాడాను. కాని నయమవలేదు

నెత్తురు, మలం పరీక్ష చేయించి కడుపులోని క్రిములను కనుగొని వాటికి తగిన మందు వాడటం అవసరం. ఆన్‌కైలో స్టోమా అనే పురుగులు కంటికి కనబడవు.

అనీమియా (రక్తం లేమి) వల్ల మీరు వ్రాసిన లక్షణాలేర్పడతాయి. ఒకసారి చేసిన మల పరీక్షలో ఏమీ తేలకపోతే మళ్ళీ మళ్ళీ పరీక్ష చేయించవలసి ఉంటుంది. □

## జీవితం చేజారిందా

గదిలోకి పరిగెత్తింది

"నాన్నా! మరే.... మనింటికి. . తొందర్లో ఇంకొక చిన్న తమ్ముడు రాబోతున్నాడట. పిన్ని చెప్పింది .. మరే... వాడు ఆడుకుందుకు నా బొమ్మలు ఇస్తానని కూడా చెప్పాను నాన్నా... ." అంది వుత్సాహంగా

ఆ మాటలు వింటూనే ప్రభాకర్ నొసలు ముడిపడ్డాయి

నల్లగా కమిలినట్లు మొఖం మలినం అయింది

ఈ విషయంలో అతనికి ఈ మధ్య కొద్దిగా అనుమానం రాకపోలేదు సీతలో శారీరక మార్పులు గమనించాడు.

కాని నమ్మకంగా అనుకోలేకపొయ్యాడు

మంచి తిండి, పోషణ వుండటం చేత ఒళ్ళుచేసి రంగు తేలిందేమో!

'అలాకాక వేరే ఏదన్నా విశేషం అయితే ఆమే తనకి స్వయంగా చెప్పి వుండేది కదా? అనుకొన్నాడు

కాని తనకిగా తను ఆమెని ఆ విషయం అడగటానికి అహం అడ్డు వచ్చింది

ఈ మధ్య ఇద్దరి మధ్య కొద్దిపాటి మనస్పర్థల వల్ల సీత కూడా చాలా విషయాల్లో అంటీ ముట్టనట్లుగానే వుండటంతో భార్యాభర్త లిద్దరి మధ్య కాస్త దూరం పెరిగింది

కాని –

ఇప్పుడు మంజు చెప్తున్న విషయం వింటుంటే ప్రబాకర్‌కి రక్తం సలసలా మరిగినట్లు అయ్యింది

సీత మీద పట్టరాని ఆగ్రహం వచ్చింది.

"ఈ విషయం కనీసం నాకు చెప్పాలన్న ఖాతరు కూడా లేదా? ఆమెకి ఇంత ధైర్యం ఎక్కడ్నుంచి వచ్చింది?" అనుకొన్నాడు ఆవేశంగా

"అసలు తనకి ఈ పెళ్ళి ఇష్టం లేదు అనుకుంటే మళ్ళీ పిల్లలా? తను ఏదైతే జరగ కూడదని అనుకున్నాడో.. ఏ విషయం గురించి భయపడ్డాడో ఇప్పుడు అక్షరాలా అదే జరుగుతూంది ఈ సీత. దిస్ డర్టీపూర్ ఉమెన్ మాస్టర్‌ప్లాన్ వేసింది రేపు ఆమెకి పిల్లలుపుడితే బాబుని– పాపని ఇప్పటిలా చూస్తుందా? ఇంత శ్రద్ధగా వాళ్ళని కనిపెట్టుకుని వుంటుందా? ఊహుఁ సరికదా ముందు ముందు తననుంచి తన పిల్లల్ని వేరుచేసి, మందో మాకో పెట్టి తన మనసు మార్చేసి ఆ తరువాత తన బిడ్డకి పట్టం కట్టించాలని చూస్తుంది ఇలాంటి సవతి తల్లి కథలు తను ఎన్ని వినలేదు... కాని. . నో. నో అలా జరగటానికి వీలులేదు."

ప్రభాకర్ అసహనంగా తల విదిల్చుకున్నాడు.

ఆవేశంతో మంజుని ఎత్తుకుని దూకుడుగా వంటగదిలోకి వెళ్ళబోతుంటే ఇంతలో రంగా ఎదురు వచ్చి–

"సాబ్! ఎవరో విజిటర్సు వచ్చారు " అన్నాడు

ప్రభాకర్ చిరాకు కప్పి పుచ్చుకొని పాపని దింపి తిరిగి డ్రాయింగ్ రూమ్‌లోకి వెళ్ళాడు. అతని మనసంతా అతలా కుతలంగా వుంది తుఫాను ముందరి ప్రశాంతతలా ఆవేశాన్ని అతికష్టంతో అణుచుకొన్నాడు

ఇంతలో కంపెనీ తరఫు పార్టీస్ లోపలికి రావటంతో తప్పనిసరిగా "మూడ్' మార్చుకుని వాళ్ళతో బయటికి వెళ్ళాడు

కాని అతని మనసుకి స్థిమితం లేదు

(ఇంకా ఉంది)





కామెంటరీ స్పష్టంగా వినిపిస్తుందని
ఘంటాపథంగా చెప్పగలం.

అయితే ఆట బాగా జరుగుతుందని
మేము మాత్రం ఎలా చెప్పగలం!

ఆటలో ఎగుడు దిగుళ్లు ఎన్నయినా ఉండొచ్చు.
అయితే బ్యాటరీలోనా .. ఉహుం!
ఇది నిజంగా ఒక వాగ్దానం. ఇదే నోవినో సుగుణం.
నొవీనో విషయంలో నాణ్యత అన్నది శుష్క వచనం కాదు.
మరింత మన్నికైనదీ, మరింత శక్తి గలదీ, మేలైన లీక్
రెసిస్టెన్స్ గలదీ అంటూ అదే పనిగా జపం చేసే వట్టి
మాటల వరస కాదు.
నొవీనో నాణ్యత, ఈ బ్యాటరీని వాడినప్పుడల్లా
మీకై మీరే చూడగలదీ, వినగలదీనూ.
నొవీనో.
తన నాణ్యత తానే స్వయంగా నిరూపించుతుంటుంది—
అనుక్షణం, నిరంతరం.



నొవీనో
లఖన్‌పాల్ నేషనల్ లిమిటెడ్
బరోడా, గుజరాత్
నేషనల్ పానాసోనిక్
ఉత్పాదనల నిర్మాతలైన,
జపాన్ దేశపు మట్సుషిటా ఎలక్ట్రిక్
వారితో సమిష్టి ప్రయత్నం.

# ఓహో! నొవీనో

Sista's-LNL-241/86 TEL A

# "మొక్కిన వరమీని వేల్పు"

— (ఆదూరి సావిత్రి)

"బాగా రాయండి నాన్నా, అన్నీ చదువుకున్నారుగా' పెన్నుల్లో ఇంకు పోసుకున్నారా? హాల్ టికెట్స్ తీసుకున్నారా?" అన్నది పార్వతి

"అన్నీ తీసుకున్నాం లేమ్మా! మరి మేం వస్తాం " సన్నగా నవ్వుతూ అన్నారు వాసు, బాబు

దేముడికి దణ్ణం పెట్టుకోండి '

"పెట్టుకున్నాం చలాకీగా నవ్వుతూ వెడుతున్న కొడుకుల వేపు మెరుస్తున్న కళ్ళతో చూస్తూ నిలబడ్డ పార్వతి ఇహ లోపలి కొచ్చి నా కన్నం పెడతావా? అన్న భర్త మాటలకు ఉలిక్కిపడి వంటింట్లోకి నడిచింది

మీరు కొన్ని ప్రయివేట్లు తగ్గించుకోండి మీ కసలే ఒంట్లో బాగోటల్లేదు " నెయ్యి వెచ్చబెట్టి అన్నం మీద వేస్తూ అన్నదామె

'ఇప్పుడే బాగోలేదనుకుంటే ఎలా? ఈ సంవత్సరంతో వాళ్ళ ఇంటరయిపోతుంది మంచి, మార్కులతో పాసవుతారు ఇద్దర్ని కోచింగ్‌కు పంపిస్తాను భగవంతుడి దయవల్ల అందులో నెగ్గితే నా భారం సగం తగ్గుతుంది లేదా డబ్బు కట్టి, వన్ ఇయర్ కోచింగ్‌కి పంపుతాను అప్పుడింక డొటుండదు నా శక్తంతా ధారపోసి వాళ్ళని చదివిస్తాను తండ్రి కష్టమే పిల్లల భవిష్యత్తును నిర్మించేది నువ్వు నా ఆరోగ్యం గురించి అనవసరంగా బాధపడకు నేను బాగనే ఉన్నాను. అనునయంగా అన్నాడు ప్రసాదరావు

నాలాగా కాకుండా వాళ్ళలో ఒకడు డాక్టరు, ఒకడు ఇంజనీరు అయితే .. నా శ్రమ ఫలితాన్ని కళ్ళారా చూసుకుంటూ వాళ్ళు మన కన్నా ఉన్నత స్థితిలో ఉండటం చూసి గర్వపడుతూ

పిల్లల గురించి, వాళ్ళ భవిష్యత్తు గురించి భర్త కళ్ళ ముందు సృష్టిస్తున్న స్వర్గాన్ని ఒక్కక్షణం మైమరచి చూసి, అంతలోనే తేరుకుని చటుక్కున' భర్త చెయ్యి పట్టుకుంది పార్వతి

ప్రశ్నార్థకంగా చూశాడు ప్రసాదరావు

"మజ్జిగలో మీరు ఉప్పు బదులు, నెయ్యి వేసుకుంటున్నారు'

'ఓహ్' చూసుకోలేదు అంటూ నవ్వేశాడాయన మడత లేసిన కండువా భుజం మీద వేసుకుని, జోళ్ళు తొడుక్కుని, తను పని చేస్తున్న ఎలిమెంటరీ స్కూలు వేపు సాగిపోయాడు ప్రసాదరావు

దాన్ని అందరూ 'వీధి బడి' అంటారు ఆ పేరు దానికి చక్కగా సరిపోతుంది ఒక చిన్నగది, వరండాతో ఒక వేపు కాస్త ఒంగిపోయిన' పెంకుటిల్లది. ఒకటి, రెండు క్లాసులు వరండాలోను, మూడు, నాలుగు, ఐదు తరగతులు గదిలోను జరుగుతుంటాయి వరండాలో క్లాసుల్ని రంగనాథం, గదిలో క్లాసుల్ని ప్రసాదరావు చూస్తుంటారు బడి వరండా ఓపెన్‌గా రోడ్డు మీదికి ఉంటుంది. అక్కడ కూర్చున్న పిల్లలు రోడ్డు మీద వచ్చే పోయే మనుషుల్ని, గంగిరెద్దు మేళాన్ని, పంపుల దగ్గర కొట్లాటల్ని చాలా ఆసక్తిగానూ పలకా పుస్తకాల వేపు అనాసక్తిగానూ చూస్తున్నారు

"చదవరేరా వెధవల్లారా, ఏం సోద్యం చూస్తున్నారు? అక్షరాలు రాయరేమే మీరు? అంటూ గదుముతున్నాడు రంగనాథం

ఇంతలో ఒక అడుక్కునే వాడు కోతి పిల్లకి గౌనూ లాగూ తొడిగి, దాని చేత రకరకాల ఫీట్స్ చేయిస్తూ వస్తున్నాడు. వాడు బడి ముందరికి రాగానే పోలోమని లేచారు పిల్లలు ఒక పక్క నుంచి రంగనాథం బెత్తం తీసుకుని వాళ్ళను కంట్రోల్ చెయ్యటం ప్రారంభిస్తే రెండో పక్క నుంచి అయన్ని లెక్క చెయ్యకుండా అరుచుకుంటూ తోసుకుంటూ నవ్వుతూ కోతి చేసే ఫీట్స్ చూస్తున్నారు పిల్లలు ఆయన రెండో వేపు రాగానే మొదటి వేపు ఇదే పరిస్థితి ..

నెత్తిన చేతులెట్టుకుని ఉసూరుమని కుర్చీలో కూలబడ్డ రంగనాధాన్ని చూసి "పిల్లలంతా చదువు మానేసి ఇలా రోడ్డున పడి ఎగురుతుంటే చూస్తూ కూచున్నావేం అయ్యా పంతులూ? ఈ సర్కారు బడిలో చేర్చిన దగ్గర్నుంచీ మా పిల్లలకి ఒక ముక్క రావటంలేదు ఇందుకే కాబోలు! గవుర్నమెంటోళ్ళిచ్చే జీతాలు నూకటమే గానీ 'ఆ ఇశ్వాసంతో పిల్లలకి చదువు చెప్పే నీతి లేదు మీకు. " ఒక కుర్రాణ్ణి రెక్క పట్టుకు లాక్కొచ్చి రంగనాథం ఎదురుగా కూలేసి దులపటం మొదలెట్టిందో ఆడమనిషి 'కాస్త పిల్లోళ్ళని చూడవయ్యా. నువ్వు కూడా కోతి ఆటని చూస్తున్నావా ఏమిటి?" అని హేళనగా నవ్వి వెళ్ళిపోతున్న ఆమె వేపు ఉక్రోషంగా చూశాడు రంగనాథం. ఆ కోపంతో పిల్లలని బాదటం మొదలిడుతుండగా ప్రసాదరావు వచ్చాడు.

'ఏమయింది?" అన్నాడాయన.

"నా ఖర్మం సార్! ఏం చెప్పను? మామూలే! మనకున్నవి అయిదు క్లాసులు మనం ఇద్దరు మాస్టర్లం బడి చూస్తే నడి రోడ్డు మీద చుట్టూ గోడయినా లేదు రోడ్డు మీద జరిగే భాగోతాలన్నీ కళ్ళకు కట్టినట్లు కనిపిస్తుంటే ఇహ వీళ్ళకి చదువు మీద ఆసక్తి ఏం ఉంటుంది సార్?

పెల్లలూడిన గోడలు యువకోసే నేల కోళ్ళూడిన కుర్చీ జీతాల్లేని పంతుళ్ళు ఇంతకన్నా గర్వకారణమేముంది సార్ మన. బోర్డు స్కూళ్ళ చరిత్రలో ?

కనీసం మూడు విశాలమైన గదులతో చుట్టూరా తాటి ఆకుల దడితో ఉన్న పాక లోపలున్న ఖాళీ ప్రదేశంలో పిల్లలు తమ చిట్టి చిట్టి చేతులతో నాటిన పూల చెట్లు, కాయగూరల పాదులు ఆరోగ్యవంతమైన గాలి, నీరు, అందులో ఆసక్తిగా చదివే పిల్లలు ఏ నెల కానెల జీతాలు తీసుకుంటూ సంతృప్తిగా పిల్లలకు చదువు చెప్పే మాష్టర్లు " అంటున్న రంగనాదాన్ని ఆపుతూ మీరెప్పుడూ గగన కుసుమం లాంటి ఆ కలలో విహరిస్తూ వాస్తవం అలా లేదనే ఉక్రోషంతో అభంశుభం తెలీని పిల్లల్నిలా బాదటం వివేకమనిపించుకోదు. మనది బీద దేశం గనక మన పిల్లలిలా పడిపోయిన గోడల వీధి బడుల్లో చదువుకుంటున్నారని సంతృప్తిపడాలి మనం ' అని అతన్ని మందలించి లోపలి కెళ్ళి తన క్లాస్‌లు తీసుకున్నాడు ప్రసాదరావు

'కాలేజీలో తన పిల్లలు పరీక్ష లెలా రాస్తున్నారో' అనుకుంటూ వాళ్ళకు పాఠాలు చెపుతున్నాడాయన

* * * *

తల వంచుకుని ఏక ధాటిగా రాసుకు పోతున్నాడు వాసు లెక్చరర్స్ స్ట్రైక్‌లో ఉన్నారు

"ప్రభుత్వం మొండి వైఖరి అవలంభిస్తోంది. గతంలో ఒప్పుకున్న కోర్కెలే తీర్చటం లేదు అని లెక్చరర్లు బ్లేమ్ చేస్తుంటే ఆ స్టేట్‌తో పోల్చండి ఈ స్టేట్‌తో పోల్చండి అందరి కన్నా మేమే ఎక్కువ జీతాలు పే చేస్తున్నాం మీరు స్ట్రైక్ చేస్తే మేం బెదిరిపోతా మనుకున్నారా? నెవ్వర్' ఇతర ప్రభుత్వోద్యోగుల్ని నియమించి మరి పరీక్షలు నిర్వహిస్తాం' వాళ్ళ చేతనే పేపర్లు దిద్దిస్తాం ." అంటూ వాదించి బెదిరిస్తోంది

రాష్ట్రప్రభుత్వం అన్నట్టుగానే ప్రభుత్వోద్యోగుల' సాయంతో పరీక్షలు నిర్వహిస్తోంది. . కాలేజీలో ఇన్విజిలేటర్స్‌గా తమ లెక్చరర్స్ కాకుండా అంతా

'త్తవాళ్ళు కనపడుతుండటంతో కొందరు స్టూడెంట్స్‌లో ఒకరకమైన పిరికితనం చోటు సుకుంది..

మూడు నెలల నుంచీ లెక్చరర్స్ స్ట్రయిక్‌లో ండటం మూలాన పోర్షన్ కాలేదు. అయినా రక్షలు యధావిధిగా జరిగిపోతున్నాయి...

ప్రభుత్వానికీ లెక్చరర్స్‌కి మధ్య జరుగుతున్న యుద్ధంలో విద్యార్థులు నలిగిపోతున్నారు.

ఏదైనా టెక్నికల్ కోర్స్‌కు వెళ్ళాలంటే ఈ ఇంటర్ ర్నింగ్ పాయింటు. ఇది పాసవుతే గాని విద్యార్థికి విష్యత్తు లేదు.

ఏమవుతుందో, పోర్షన్ కాకపోవటం మూలాన లివైన విద్యార్థికి చచ్చి చెడి పాస్ మార్కులొస్తే... హావరేజ్ స్టూడెంట్‌కి అవీ రాక ఎందుకూ కాకుండా గాతాడు.

అందరి మనసుల నిండా భయం... టెన్షన్... ఆ లేజీలో కాపీలు జరగవు. ప్రిన్సిపాల్ స్ట్రిక్ట్‌గా ంటాడు. అందుకని స్టూడెంట్స్ కష్టపడి శ్రద్ధగా వదువుతారు.

కానీ... ఈ సారి తెగించి కొందరు స్టూడెంట్స్ 'పీలు కొట్టటం ప్రారంభించారు..

"స్క్వాడ్!" సమీపంలో కేక వినిపించగానే తన జేబులో ఉన్న కాపీలని ఖంగారుగా విసిరేశాడు పదీప్...

స్క్వాడ్ ఆ రూంలో కొచ్చింది...

తన ముందున్న పేపరు లాగెయ్యబడటంతో క్యాగ్రత చెదిరి అయోమయంగా చూశాడు వాసు...

"కాపీ కొడుతున్న నేరానికి నిన్ను డిబార్ యిస్తున్నాను." అన్నాడు స్క్వాడ్‌లో ఉన్న ్యక్తులలో ఒకడైన ఈశ్వరయ్య.

"నేను కాపీ కొడుతున్నానా! నే నెప్పుడూ అలా ేను. కావాలంటే చెక్ చెసుకొండి సార్." ుసంగా అన్నాడు వాసు.

వాసుకు సమీపంలో పడి ఉన్న కాగితం మడతను ాపిస్తూ "ఇదేమిటి?" అన్నాడు ఈశ్వరయ్య.

"అది నాది కాదుసార్. నేను మెరిట్ స్టూడెంటుని. ా చేసే అవసరం నాకు లేదు....." అంటూ భయపడ్డాడు వాసు. తన గురించి చెప్పాడు. పరకు కన్నీళ్ళతో ఈశ్వరయ్య కాళ్ళ మీద పడ్డాడు...

దేనికీ చలించ లేదు ఈశ్వరయ్య. వాసు కాపీ కొడుతుండగా పట్టుబడ్డాడని, అతన్ని డిబార్ వెయ్యమని రాసేసి చేతులు దులుపుకున్నాడు. వాసు చేతిలో నుంచి పేపర్ లాగేసుకుని అతన్ని బయటకు పంపేశారు.... దిమ్మెర పోయినట్లుంది వాసుకి. జరిగిందంతా ఒక్కసారి కళ్ళ ముందుకు తెచ్చుకుని ఒణికి పోయాడు. తనమీద తల్లిదండ్రులు ఎన్ని ఆశలు పెట్టుకున్నారు! తండ్రి తన భవిష్యత్తును అందంగా తీర్చి దిద్దటం కోసం రక్తాన్ని చెమటగా మార్చి శ్రమిస్తున్నాడు....

ఒక్క నెల రోజులు కోచింగ్ తీసుకుంటే తను ఎంట్రన్స్‌లో నెగ్గుతాడు.

కానీ.... ఇప్పుడి అవకాశ మేది? తన భవిష్యత్తును డిబార్ అనే భయంకరమైన గోతిలో కప్పెట్టారు. చెయ్యని నేరానికి తనకి శిక్ష. తలిదండ్రుల కిహ తన మొహం ఎలా చూపాలి? వ్యర్థంగా ఇంట్లో ఎలా కూచోవాలి? ఛై.... ఛై.... గా....డ్!

ఊరి బయటున్న చెరువు గట్టుమీద రావి చెట్టు కింద కూర్చుని మోకాళ్ళలో తలపెట్టుకుని కుమిలి కుమిలి ఏడుస్తున్నాడు వాసు.

అవమానం.....రోషం.... బాధ.... నిస్సహాయత ఆ పసి హృదయాన్ని కుదిపేస్తున్నాయి....

* * * *

"ఒదినగారూ! ఓ గరిటెడు కాఫీపొడి ఉంటే ఇస్తారా?" అంటూ వచ్చింది పక్కింటి కామేశ్వరి.

పార్వతి ఇచ్చిన కాఫీ పొడి అందుకుంటూ "పిల్లలు పరీక్ష రాయటాని కెళ్ళారా?" అన్నదామె.

"ఔనండి." అన్నది పార్వతి.

"మా అబ్బాయి కూడా వెళ్ళాడు. ఏం రాస్తారో ఏమో. ప్రాక్టికల్స్ కంభంలో జరిగాయి. మార్కులు సరిగ్గా పడవని గోల పెట్టాడు వాడు. లెక్చరర్ల స్ట్రైక్.... పోర్షన్ కాక పోవటం.... ఒకటే దిగులుగా ఉంది. వాళ్ళకిది టర్నింగ్ పాయింటు. పరీక్ష పేపర్లు కూడా ప్రభుత్వోద్యోగులే దిద్దుతార్ట! మి అన్నయ్యగారి లాంటి వాళ్ళ చేతుల్లోకి పేపర్లు వెళ్ళాయను కొండి. విద్యార్థుల పని గోవింద. లెక్చరర్ల కంటే.... అది వాళ్ళ ప్రొఫెషన్ గనక సరిగ్గా చూసుకుని మార్కు లేస్తారు.

మి అన్నయ్య గారి లాంటి వాళ్ళకు సైన్స్ గురించి హిస్టరీ గురించి ఏం తెలుస్తుంది? "ఒకవేళ ఇది తప్పు అన్సరేమో! తను రైటు కొడితే" అది కూడా తెలీదా అనుకుంటారేమో అనే భయంతో" ప్రతి ప్రశ్నకు "ఇంటూ" కొట్టి సున్నా మార్కు లేస్తారు. వీళ్ళందరి పట్టుదలల మధ్యా స్టూడెంటు సర్వనాశన మయి పోయేలా ఉన్నాడు. పేపర్లు దిద్దే నాటికయినా వీళ్ళు స్ట్రైక్ విరమిస్తే బావుండును.

అన్నట్టు "పొయ్యిమీద పాలు పెట్టానండోయ్! వస్తానూ?" అంటూ వెళ్ళి పోయింది కామేశ్వరి.

"ఇలా కూడా జరుగుతుందా? తన బిడ్డల పేపర్లు



# ఈ·వేమన·పద్యాలు



ధనము కూడబెట్టి దానంబు చేయక
దాను దినక లెస్స దాచుగాక
తేనెటీగ గూర్చి తెరువరికిచ్చురా
విశ్వదాభిరామ వినురవేమ.

ఎవరి చేతుల్లో పడతాయో' భగవంతుడా' ఎలాగో ఈ గండం నుంచి బయట పడెయ్యి నాయనా' నీ కొండ కొస్తాం చేతులు జోడించి కళ్ళు మూసుకుంది పార్వతి

'అమ్మా అమ్మా అన్నయ్య . అన్నయ్యని డిబార్ చేశారు. కళ్ళ నిండా నీళ్ళతో ఉద్వేగంగా అన్నాడు బాబు

అప్పుడే లోపలి కొస్తున్న ప్రసాదరావిది విని నడుం విరిగి పోయిన వాడిలా కూలబడ్డాడు

'ఏమిట్రా' నిజమా! వాడి నెందుకు చేస్తారు? వాడసలు కాపి కొట్టడు కదురా' ఏడి? వాడేడి?" ఖంగారుగా భయంగా అడిగింది పార్వతి గుండెల్లో రైళ్ళు పరుగెడుతున్నట్లుం దామెకు

## "మ్రొక్కినవరమీని వేల్పు"

"ఎంత వెతికినా అన్నయ్య కనపడ లేదు. ఇంటికి రాలేదా?" అన్నాడు బాబు

'అయ్యో' మి రెళ్ళి చూడండి! బిడ్డ ఏం అఘాయిత్యం చేస్తాడో! వాడి మనసెంత దెబ్బ తిని. ఉందో' నా బిడ్డలకు కాపీ కొట్టాల్సిన ఖర్మ లేదని. వాడు తెలివైన వాడని. కష్టించి చదువుతాడని ఆ డిబార్ చేసి నాయనకి చెప్పండి. వాడి గురించి ఎవర్నడి గయినా సరే. వాడెలాంటి వాడో తెల్సుకోమనండి ఆ కాయితం వెనక్కి తీసుకోమనండి వాడి జీవితాన్ని మొగ్గలోనే తుంచెయ్యొద్దని బ్రతిమాలండి! ముందు వాసు ఎక్కడున్నాడో వెతకండి' ఏడుస్తూ అన్నది పార్వతి

ప్రాణాలు కూడగట్టుకుని లేచాడు ప్రసాదరావు ఇప్పుడిహ ఎవర్ని బ్రతిమాలినా ఏం ప్రయోజన ముండదని తెలుసాయనకి

వాసు ఏం అఘాయిత్యం చేశాడోనని తల్లడిల్లి పోతూ బయటకు నడిచాడు. తన దుఃఖాన్ని కడుపులోనే దాచుకుని ఆ చితికిన మనసుకు ఓదార్పు నివ్వాలి. ధైర్యం చెప్పాలి .

నిస్సత్తువగా, కళ్ళు చీకట్లు కమ్ముతున్నట్లుగా ఉందాయనకి. తన బిడ్డల భవిష్యత్తు గురించి ఎన్ని కలలు కన్నాడు! వాళ్ళ తెలివి తేటల్ని చూసి ఎంత మురిసి పోయాడు

అనాలోచితంగా ఆయన పాదాలు చెరువు వేపు నడిచాయి

చెరువు ఒడ్డున గుంపు.. ఆ గుంపు మధ్యలో నిర్జీవంగా పడిఉన్న వాసు శరీరం .

నో... నో.. దిక్కులు పిక్కటిల్లేలా అరిచాడు ప్రసాదరావు.

"పాపం' పంతులుగారి కొడుకు చెరువులో పడ్డాడు .

ఏం? ఎందుకూ?"

డిబార్ చేశారని .. పాపం' తెలివైన కుర్రాడు ఎక్కడో ఏదో పొరపాటు జరిగింది '

ఇవేవీ ప్రసాదరావు తల కెక్కటం లేదు తమ గుండెలో చిచ్చుపెట్టి నిర్దాక్షిణ్యంగా నిష్క్రమించిన వాసును చూసుకుని కుమిలి కుమిలి ఏడుస్తున్నాడాయన.

సుడిగాలిలా పరుగెత్తు కొచ్చిన పార్వతి కొడుకు శవం మీద మొదలు నరికిన చెట్టులా విరుచుకు పడింది. .

ఒక దోషికి శిక్ష పడక పోయినా ఫర్వేదు గాని ఒక నిర్దోషిని అనాలోచితంగా శిక్షించటం ఎంత దారుణ పరిస్థితులకు దారితీస్తుందో.... అహంభావంతో తను చేసిన అతి చిన్న చర్య ఆ కుటుంబం మీద ఎంతటి హృదయవిదారకమైన పరిణామాన్ని సృష్టించిందో తెలీని ఈశ్వరయ్య మాత్రం మధ్యాహ్నపు భోజనం పూర్తి చేసి హాయిగా గుర్రు పెడుతున్నాడు.. .

లెక్చరర్లు స్ట్రైక్ విరమించారని. పేపర్లు వెళ్ళే దిద్దుతారని కామేశ్వరి చెపుతుంటే విరక్తిగా చూసింది పార్వతి.

"ఈ పని ఎప్పుడో జరిగితే.... ప్రభుత్వం మొండిగా ప్రవర్తించకుండా ఉంటే .. లెక్చరర్లు తమ వైఖరిని మార్చుకుని ఉంటే.... సకాలంలో పోర్షన్ పూర్తయ్యేది. అప్పు డీ కాలేజీలో మాస్ కాపియింగ్ జరిగేది కాదు. తన బిడ్డ ఇలా బలి అయ్యేవాడు కాదు. .."

ఆమె రెండు కళ్ళూ నీటితో నిండి పోయాయి ఆ గుండెకు తగిలిన గాయాన్నెవరు మాన్పగలరు?!

కొడుకు ఫోటో గుండెల కదుముకుని, గుండెలవిసేలా రోదిస్తోంది పార్వతి . □



# రాంగ్ నంబర్




హుఁ! ఇప్పటికి ఓ పదిసార్లు రింగ్ చేసా.. ప్రతిసారీ రాంగ్ నెంబరే...
అయిదు రూపాయలు వేస్తు...!
టెలిఫోన్ బూ


మీ ఫోన్లోనే కాదండీ... ఇక్కడ మా ఫోన్లలో కూడా రాంగ్ నెంబర్లొస్తున్నియ్...!
ఎక్స్ఛేంజ్


నన్ను నమ్మండి.. నాకెవరితోనూ సంబంధం లేదు...'రాంగ్ నెంబరై' ఉంటుంది...!


హమ్మయ్య... పీడ విరగడైంది..!
మంచిపని చేసారండి..!
మునిసి పాలిటీ


ఈ రాంగ్ నెంబర్ల వల్ల భలే కలిసొచ్చిందోయ్.
నేను లోకల్ నెంబరుకి రింగ్ చేస్తే...
మద్రాసులో ఉన్న మా బామ్మర్దికి
అందింది....!
ఎమ్వీఆర్...


ఈ రోజు రాత్రి పదిగంటలకు పాతికవేలు తీసుకుని ఊరి బైట మర్రి చెట్టు దగ్గర కురా..!


వ్వాట్ నాన్సెన్స్...?

సీరియల్

# కాల్‌గర్ల్

## దూరి వెంకట రావు

(గత సంచిక తరువాయి)

## 10

చంద్రం జైలు నుండి తిరిగొచ్చేవరకూ దుర్భరమైన వంటరి జీవితం గడిపింది సరోజ

షావుకారు సుబ్బయ్యకు ఇల్లు తాకట్టుపెట్టి జీవనం సాగిస్తోంది

మూడు నెలల జైలుశిక్ష పూర్తి అవడంతో చంద్రాన్ని విడుదల చేసారు

తమ్ముడి రాకతో ఆమెలో కొత్త వుత్సాహం పుంజుకుంది ఆ రోజు వాడికి తలంటి నీళ్ళు పోసింది కొత్త బట్టలు తొడిగింది పాయసం వండి పెట్టింది అమ్మా నాన్నను వాడిలో చూసుకుని మురిసి పోయింది తనేదైనా ఉద్యోగం చేస్తూ వాడిని బాగా చదివించాలని అనుకుంది అందుకే రోజూ దిన పత్రిక చూస్తూ కనిపించిన ప్రతి ఉద్యోగానికి ధరఖాస్తు పెట్టింది పిలిచిన ప్రతి ఇంటర్వ్యూకి హాజరైంది కాని ఎక్కడా ఉద్యోగం మాత్రం అవలేదు

రోజులు భారంగా గడుస్తున్నాయి భూమి సూర్యుని చుట్టూ మరోసారి పరిభ్రమించింది

"అమ్మా! అప్పు చూస్తే బాగా పెరిగి పోయింది ఇప్పటివరకు పైసా జమ కట్టలేదు ఎప్పుడడిగినా ఇవాళో రేపో ఇస్తానంటావు నా కవతల చూస్తే బోలెడు ఖర్చు లున్నాయి ఉన్నపళంగా డబ్బైనా కట్టు, లేకుంటే ఇల్లైనా స్వాధీనం చేయి నిలదీసి అడిగాడు సుబ్బయ్య

వాడి మాటలకి భయపడి పోయింది సరోజ అవసరానికి ఆదుకుంటున్న సుబ్బయ్య ఎంతో మంచివాడని ఇన్నాళ్ళూ అనుకుంది కాని ఈ రోజు వాడో యమ దూతలా కనిపించాడు తనకున్న ఒక చిన్న ఆధారం ఆ ఇల్లే అది కూడా లేకపోతే తల దాచుకోవడానికి తావే వుండదు అందుకే మరి కాస్త గడువిమ్మని ప్రాధేయ పడింది

సుబ్బయ్య అంగికరించక పోవడంతో అప్పు తీర్చే మరో మార్గంలేక ఇల్లు అతడికే అమ్మేసి కొద్దిపాటి సొమ్ముతో చంద్రాన్ని తీసుకుని ఉన్న వూర్ను విడిచి పెట్టింది.

అక్క తనకోసం పడుతున్న అవస్థను అర్థం చేసుకున్నాడు చంద్రం.

తమ్ముడికోసం తానెన్ని కష్టాలైనా పడాలనుకుంది సరోజ

పట్నంలో కాలుపెట్టిన సరోజకు ఎక్కడ బస చేయాలో బోధపడ లేదు లాడ్జిలో వుందామంటే భయ మేసింది. మిది మిక్కిలి డబ్బుతో కూడుకున్న పని ఇల్లు అద్దెకు తీసుకునేంత స్తోమత లేదామెకు మరెలా తల దాచుకోవాలో అర్థంగాక బస్‌ష్టాండులో, రైల్వే స్టేషనులో కొద్ది రోజులు యాచకుల మాదిరి కాలం గడిపింది అలాంటి చోట్ల భద్రతలేదని గమనించి సత్రవలో అతి తక్కువ అద్దెలో గది సంపాదించి కాలాక్షేపం చేయసాగింది

ఇంటి దగ్గర వంటా వార్పూ చంద్రం పనైతే, ఉద్యోగం కోసం రోజంతా ఊరుమిద తిరగడం సరోజ వంతైంది

సరోజ చంద్రాన్ని దగ్గర కూర్చొబెట్టుకుని చదివిస్తోంది.

బాబూ.. చంద్రం అలా రోడ్డువరకు నాపెట్టె పట్టుకుంటావా? స్టేషనుకు వెళ్ళాలి" అన్నాడు ప్రక్కవాటాలో వున్న ఒకాయన చంద్రాన్ని వుద్దేశించి.

'ఏమిటండి ఎవర్ని మీరు సామాను పట్టుకో మంటున్నారు?" కోపంగా అడిగింది సరోజ

ఎవర్నేంటమ్మా మీ తమ్ముణ్ణే ఊరికే పట్టుకోనక్కర్లేదు రూపాయి ఇస్తాను

"మా తమ్ముడు కూలివాడను కొంటున్నారా? వాడికా అవసరం లేదు మీరు మరోసారి ఈ మాటంటే సహించేది లేదు మనుషులను చూసి మర్యాదగా ప్రవర్తించండి' అన్నది సరోజ మరింత కోపంగా

"స్టాండులో అందరి పెట్టెలూ మోయవచ్చు గాని నాపెట్టె మాత్రం పట్టుకో కూడదన్న మాట ఔన్లే పొరుగున వున్నాను కదా సిగ్గేమో మరి '

'మీ రనే దేమిటి, నా చంద్రం బస్సు స్టాండులో సామాన్లు మోస్తున్నాడా? ఎవరు చెప్పేరు మీకు త్రి ఫులా బుసలు కొట్టింది సరోజ

'ఎందుకమ్మా ఆ గావు కేకలు. మీ తమ్ముణ్ణడుగు వాడే చెబుతాడు' అక్కడ నుండి వెళ్ళి పోయాడతను

ఈ మాటు ఆమె కోపం ఆకాశాన్ని అంటుకుంది

"ఏమిరా చంద్రం నువ్వు కూలి చేస్తున్నావా? డబ్బులు కోసం పెట్టెలు మోస్తున్నావా?

సరోజ కళ్ళలో కోపాన్ని చూసిన చంద్రం గజగజా వణికి పోయాడు భయంతో వాడి నోటంట మాటలు రాలేదు

"చెప్పరా చెప్పు ఈ అక్క మీద ప్రమాణం చేసి చెప్పు నువ్వు కూలిపని చేయడం లేదని చెప్పరా?"

'నువ్వు డ డ. డబ్బు లేదని బ. బ. బాధపడుతూ వుంటే చూడలేక నీకు స స. సాయం చేద్దామని ఆ పని చేసాను" అన్నాడు చంద్రం

వాడి మాటలకి సరోజ చంద్రం చెంపల మీద కోపంతీరా ఎడా పెడా కొట్టింది "ఒరేయ్ చంద్రం! ఇంకా మీ అక్క బ్రతికుందంటే నీ కొసమేరా లేకుంటే ఏనాడో చచ్చి పోయేది నువ్వు కూలి చేస్తూ వుంటే చూస్తూ పొంగి పోవడానికి కాదురా నిన్నీ వూరు తీసు కొచ్చింది నీ ఉజ్వలమైన భవిష్యత్తుకు ఆటంకం రాకూడదనేరా నేను పెళ్ళి కూడా చేసుకోలేదు ఎంతైనా కష్టపడి నిన్ను బాగా చదివించి నువ్వు కలక్టరువై కార్లో తిరుగుతూ వుంటే సంబర పడిపోవాలని, పోయిన తండ్రి ఆత్మకు శాంతిని చేకూర్చాలనేదేరా నా తపన తపస్సు .. నేను నీ మీద పెట్టుకున్న ఆశలన్నీ వొమ్ము చేస్తావురా?"

"నా వల్ల త . త. తప్పైపోయింది. మరెప్పుడూ నీకు కష్టం కలిగించేలా చేయనక్కా నన్ను క్ష.. . క్ష . క్షమించు" ఏడుస్తూ అన్నాడు చంద్రం

తమ్ముడి ఏడుపుకి ఆమె హృదయం మంచులా కరిగి పోయింది కోపమంతా పటాపంచలై పోయింది తల్లీ తండ్రీలేని పసివాణ్ని కొట్టినందుకు తనను తను ఎంతగానో తిట్టుకుంది. 'చంద్రం' అంటూ వాడిని అక్కున జేర్చుకుని ముఖమంతా ముద్దులతో నింపేసింది.

"అక్కా, నా మీదిప్పుడు కోపం పోయింది కదూ!' జాలిగా ముఖం పెట్టాడు

జరిగిన కథ – 5: కాల్‌గర్ల్‌గా మారిన సరోజను ఒక ఫైవ్ స్టార్ హోటల్లో కలుస్తారు వామనరావు. మధు మధు సరోజ గతం గురించి చెప్పమని అడుగుతాడు మొదట నిరాకరించినా తుదకు తన కథ మధుకి చెప్పసాగింది సరోజ సరోజ, రవి ప్రేమించుకున్నారు. సరోజ తండ్రి క్షయతో బాధపడుతూ ఉంటాడు తమ్ముడు పసివాడు వారిద్దరి బాధ్యత తనపై ఉండటం వల్ల సరోజ రవితో హాయిగా తిరగలేక పోతూంది సరోజకు టైపిస్టుగా ఉద్యోగం వస్తుంది. ఆమె పని చేసే ఆఫీసులోని జోగినాథం, వామనరావు కళ్ళన్నీ సరోజపైనే ఆ ఆఫీసులో పని చేయడం ఒక సమస్య అయిపోయింది సరోజకు సెక్షన్ హెడ్‌కి ఫిర్యాదు చేసినా ఫలితం శూన్యమయింది. ఉద్యోగానికి రిజైన్ చేసినా డబ్బు అవసరమై మేనేజరుకి లొంగిపోయింది సరోజ. ఆమె డబ్బు తీసుకుని మందులు కొనుక్కొని వచ్చేటప్పటికి తండ్రి మరణించాడు. తమ్ముడి శ్రేయస్సు కోరి రవితో పెళ్ళికి నిరాకరించింది

చంద్రం.

"నువ్వు చేస్తున్న పని సహించలేక నిన్ను కొట్టాను గాని నీ మీద చెందుకురా కోపం?.... లే.... లేచి వెళ్ళి ముఖం కడుక్కో.... అన్నం తిందువుగాని" అన్నది సరోజ.

ఆమె మాట ప్రకారం అక్కడ నుండి వెళ్ళి పోయాడు చంద్రం మరి మారు మాట్లాడకుండా.

★ ★ ★ ★

మధ్యాహ్నం ఒంటి గంటయింది. సూర్యుడు నిప్పులు చెరుగు తున్నాడు. తీక్షణమైన ఎండవల్లేమో రోడ్డు మీద అట్టే జన సంచారం లేదు

ఉద్యోగాన్వేషణలో ఎన్నో చోట్లు తిరిగి అలసిపోయి ఇంటికి తిరిగి వస్తున్న సరోజకు కళ్ళు తిరిగినట్లైంది. దారి మసక మసకగా కనిపించిందామెకు. మరి నడవలేక బస్సు ఎక్కి వెళదామని స్టాప్ దగ్గర కొచ్చి నిలబడింది. అక్కడ కూడా ఎవరూ లేరు. ఇద్దరు కాలేజీ కుర్రాళ్ళు బస్సు కోసం నిరీక్షిస్తున్నారు.

క్రిక్కిర్సిన జనంతో భారంగా వచ్చి ఆగింది సిటీ బస్సు.

సరోజ ఆ బస్సెక్కలేక నిశ్చేహాయంగా అక్కడే ఉండి పోయింది. ఆ స్టాప్‌లో వున్న ఇద్దరు కాలేజీ స్టూడెంట్సూ ఫుట్‌పాత్‌మీద నిలబడి వెళ్ళిపోయారు.

మరో బస్సు కోసం ఎదురు చూస్తున్న సరోజ ముందు ఒక కారు వచ్చి ఆగింది.

"మేడమ్! డు యు వాంట్ లిఫ్ట్" అడిగాడు ఒకతను డోర్ తెరుచుకుని క్రిందకు దిగి. నల్లని వులెన్ ఫాంటు, అదే రంగు పొడవైన కోటు. మెర్క్యూరీ పూత వున్న నల్లని గాగుల్స్. ఇవినింగ్‌హేటులో ఆరడుగుల వ్యక్తి కనిపించాడు.

వాడిని చూడగానే సరోజ గుండె దడ దడ లాడింది. మరుక్షణం ధైర్యం తెచ్చుకుని, "నో థాంక్స్" అంది.

అంతలో మరొక వ్యక్తి దిగి, "ఫర్వాలేదు పదండి" అంటూ బలవంతంగా కార్లో కెక్కించాడు.

టాక్సీ కదిలింది.

కారులో వున్న వ్యక్తులు, వారి వేష భాషలు చూసి రౌడీలని పసిగట్టి గట్టిగా అరవబోయింది. అంతలోనే ఒక బలమైన హస్తం ఆమె నోటి కడ్డం పడటంతో ఆ కేక గొంతుకలోనే వుండి పోయింది.

భయంతో ఆమె హృదయం వేగంగా కొట్టుకో సాగింది. నరనరంలో వణుకు పుట్టింది.

కారు నల్లని తారు రోడ్డు మీద శరవేగంతో పోతోంది. ఆమె వాళ్ళతో పెనుగులాడుతూ కేకలు వేయడానికి ప్రయత్నించింది. కాని ఆమె ప్రయత్నమంతా విఫల మయింది. నల్లని దుస్తులలో వున్న ఆ నలుగురూ యమకింకరుల్లా కనిపించా రామెకు.

కారు ఒక నిర్జన ప్రదేశంలో ఆగింది.

సరోజను ఇద్దరు వ్యక్తులు గట్టిగా పొదివి పట్టుకుని ఒక పాతై శిథిలావస్థలో వున్న ఇంట్లోకి తీసుకెళ్ళి స్తంభానికి కట్టారు. ఆమె నోట్లో గుడ్డ కుక్కి మాట్లాడకుండా చేసారు. ఆమెకు స్పృహ తప్పి పోతున్నట్లనిపించింది. కళ్ళు వాలి పోతున్నాయి

ఆమె పరిస్థితిని గమనించిన మరొక వ్యక్తి నోట్లోని గుడ్డ తీసి గ్లాసుడు



# కార్టూనిస్టులకు సూచనలు !

- కార్టూన్‌లను మంచి డ్రాయింగు కాగితం మీద ఇండియన్ యింకుతో గీసి పంపాలి
- ప్రతి కార్టూన్ వెనుక కార్టూనిస్టు పేరు, చిరునామా ఉండాలి.
- వ్యంగ్య చిత్రాలు ప్రస్ఫుటంగా సాధ్యమైనంతవరకూ వాటిపై 'వ్యాఖ్య' చదవటానికి ముందే నవ్వించేవిగా అర్థవంతంగా వుండాలి !
- వ్యాఖ్య చిన్నదిగా, క్లుప్తంగా వుండాలి. అక్షరాలు కుదురుగా మొదటిసారి చదివినప్పుడే అర్థం అవ్వాలి ! కార్టూన్ మీదే పేరూ, వూరూ అన్నీ రాస్తే అవి తిరస్కరింపబడే అవకాశాలుంటాయి
- సొంత చిరునామాగల తపాలా బిళ్లలు అంటించిన కవరుగల కార్టూన్‌లను తిప్పి పంపడం జరుగుతుంది. దారిలో పోయేవాటికి మా బాధ్యత లేదు.
- ఎన్నుకొన్న కార్టూన్‌లలో అన్నీ గాక కొన్ని మాత్రమే ఒక్కోసారి వేసుకోడం జరుగుతుంది. పరిశీలనకు ఐదారు వారాలు పట్టొచ్చు.
- పండుగల కార్టూన్‌లు — బాగా ముందుగా వాటి కవరుమీద ఆ "ప్రత్యేక" సంచిక సందర్భాన్ని పేర్కొంటూ పంపడం అవసరం.
- రంగుల కార్టూన్‌లు, పెన్సిలు బొమ్మలు, తెల్ల కాగితం మీద వేసిన బొమ్మలు పంపవద్దని మనవి.
- మా కార్యాలయానికి స్వయంగా వచ్చి కార్టూన్‌లు అందజేసేవారుకూడా స్వంత చిరునామాగల స్టాంపులతికించిన కవరు జత చేయాలి. కాపీ కార్టూన్‌లు పంపరాదు.

సం॥

## కాల్ గర్ల్

వళ్ళు త్రాగించాడు దాంతో ఆమె కాస్త తేరుకుంది

మీకు దణ్ణం పెడతాను నన్ను విడిచి పెట్టండి కావాలంటే ఈ రిస్టువాచీ తీసుకోండి నన్నేం చెయ్యొద్దు' అంటూ వాచీ తీసిస్తూ ప్రాధేయ పడింది

వాళ్ళు ఆ వాచీని ఆశ పడలేదు

ఒకడు ఆమె చుబుకాన్ని పైకెత్తి ముఖంలోకి పరిశీలనగా చూసాడు

మరొకడు ఆమె ఎత్తు పల్లాల్ని చేతులతో స్పృశిస్తున్నాడు

ఇంకొకడు ఆమె జుట్టును సవరించాడు

వాళ్ళ చేష్టలకు ఆమె సిగ్గు, భయం, బాధతో కుంచించుకు పోయింది

వాళ్ళు తననక్కడకు ఎందుకు తీసుకొచ్చారో, ఏం చేయబోతున్నారో ఆమె కర్థమవటం లేదు నిస్సహాయంగా బొమ్మలా నిలబడి పోయింది

'ఐదు వేలకు తక్కువ చేయదు అన్నాడు వాళ్ళలో ఒకడు

అదేమిటి గురూ, ఎందుకూ పనికిరాని డొక్కుకు కూడా ఇప్పుడు ఐదువేలు పలుకుతోంది పామిలీ గర్ల్ పదికి తగ్గ కూడదు' అన్నాడు మరొకడు

వారి సంభాషణను బట్టి తనను ఎవరికో అమ్మబోతున్నారని తేట తెల్లమైంది సరోజకి

పారిపోవాలని గింజుకుంది వెంటనే చెంప మీద బలంగా దెబ్బ పడటంతో ఆ ప్రయత్నం విరమించింది తనా వూరు వచ్చిందిలా ఎవరికో అమ్ముడు పోడానికా భగవాన్! నా కేమిటి పరీక్ష? తనలో తాను కుమిలి పోయింది

ఆ నలుగురు వ్యక్తులూ మళ్ళీ సరోజను కార్లో కెక్కించారు

ఉపాదికోసం ఊరు విడిచి వస్తే ఉద్యోగం దొరకక పోగా, తన కేమిటీ దుస్థితి ఇక మీదట తన జీవితం ఏ మలుపు తిరగబోతోందో నన్న వూహ రావడంతో ఆమెకు గుండె ఆగిపోయినంత పనైంది 'దేవుడా' తల్లీ తండ్రిని దూరం చేసావు ఇల్లూ వాకిలి అప్పుల వాళ్ళ పాలయ్యాయి అన్నీ పోగొట్టుకుని బ్రతుకు తెరువుకోసం ఇక్కడ కొస్తే నా కేమిటి గతి? నన్నెందు కిలా పరీక్షిస్తున్నావు? నేనెవరికి ఏ అపకారం చేసాను? చెప్పు తండ్రీ! ఈ కిరాతకుల వలలోంచి బయటపడే మార్గమేనా చూపు నీకు చేతులెత్తి మ్రొక్కుతున్నాను" పదే పదే మనసులో నే దైవాన్ని ప్రార్థించింది

టాక్సీ ఒక రంగుల మేడ దగ్గర ఆగింది

సరోజను ఆ కాలాంతకులు నలుగురూ బలవంతంగా లోపలకు తీసుకెళ్ళారు

రండి' లోపల కాహ్వానించిందో స్త్రీ. ఆమెకు సుమారు యాభై ఏళ్ళుంటాయి పొట్టిగా, లావుగా గుమ్మటంలా వుంది వృద్ధాప్యం వంటిమీద పడ్డా అలంకరణలో మాత్రం లోపం లేదు

సరోజనోసారి నఖసిఖ పర్యంతం పరీక్షించి, ఎక్కడనుంచి ఎత్తుకొచ్చారు? అడిగిందామె

అదంతా నీ కనవసరం ఎంత ఇస్తావో చెప్పు' అన్నారు నలుగురూ ఒక్కమారే

ఐదు'

ఎనిమిదిస్తే చెప్పు"

"లేదు అంతకంటే చేయదు

"ఆఖరిమాట ఆరు' సరోజను వెనక్కు తీసుకెళ్ళే ప్రయత్నం చేశారు

'ఆగండి లోపల కెళ్ళి ఆరువేలు తెచ్చి వాళ్ళ ముఖాన్న కొట్టి పంపించింది

బిక్కు బిక్కు మని చూస్తూ నిలబడింది సరోజ

'కూర్చో" అన్నదామె ఆ మాటలలో అధికారం తప్ప ఆప్యాయత కనబడటం లేదు

బొమ్మలా అక్కడున్న బల్ల మీద చతికిల బడింది.

"నీ పేరు?"

'సరోజ"

"ఏ వూరు?

# కనకం ! బొమ్మన్










"అవన్నీ నీ కనవసరం. నువ్వెవరు? నన్నెందుకు కొన్నావ్?" కొర కొర చూస్తూ అడిగింది సరోజ.

"రమణీ, గీతా, సునీతా... " ఆమె కేకకు అరడజను మంది యువతులు వరసగా వచ్చి నిలబడ్డారు.

వాళ్ళను మనుషులనే కంటే మర బొమ్మలంటేనే బావుంటుంది. చక్కగా సింగారించుకున్నారే తప్ప ఎవరి కళ్ళల్లో కాంతి లేదు. స్నో పౌడరు లాంటి సౌందర్య సాధనాలు వాడినా మొఖాలు మాత్రం వెల వెల బోతున్నాయి.

"వీళ్ళందర్నీ నిన్ను కొన్నట్టే కొన్నాను. ఈమె వీపు చూడు" అంది ఒకామె జాకట్టు తప్పించి.

ఆ యువతి వీపు మీదున్న ఎర్రటి చారలు చూసి బెంబేలెత్తి పోయింది సరోజ.

"ఈ అమ్మాయి పారిపోవాలని ప్రయత్నించి ఈ శిక్షకు గురైంది. రేపు నువ్వైనా అంతే? తెలిసిందా?"

తల వూపింది సరోజ

"గంగులూ!..... రత్తయ్యా! . . " ఆమె అరుపుకు ఇద్దరు ఆజాను బాహుల్లాంటి వ్యక్తులు వచ్చి వికటాట్టహాసం చేసుకుంటూ నిలబడ్డారు.

వాళ్ళను చూడగానే సరోజకు పై ప్రాణాలు పైకే పోయాయి

"నేను చెప్పినట్టు విన్నావంటే నీ చేతినిండా డబ్బే. అర్థమయిందా? ఇప్పుడు చెప్పు ఏవూరు మనది?"

అక్కడి వాతావరణం గమనించాకా, అదొక వ్యభిచార గృహమని తెలిసి పోయింది సరోజకి. ఆమె నరనరంలో వణుకు పుట్టింది. గొంతుక పూడుకు పోయినట్టైంది. వళ్ళంతా చెమటలు పట్టింది. పారి పోవాలని ప్రయత్నిస్తే ప్రాణాలు కూడా పోతాయి. ఆ గడప నుండి బైటపడే మార్గం కనుచూపు మేరలో కానరావడం లేదు. తన కోసం చంద్రం ఎదురు చూస్తూ వుంటాడు. అక్క ఏమై పోయిందో నన్న బెంగతో ఏ అఘాయిత్యానికి పాల్పడతాడో ... ఇలా పరిపరి విధాల ఆలోచిస్తున్న సరోజ నోట నుండి ఏ జవాబూ రాక పోవడంతో "మాట్లాడవేం? ఏ వూరు నీది?" గద్దించింది.

"పెద్దాపురం" తొణక్కుండా సమాధానం చెప్పింది సరోజ.

"ఆ ముక్క చెప్పడానికెందు కింత ఆలశ్యం?"

"ఏం చెప్ప మంటారు. అక్కడ నేను రంగమ్మ కంపెనీలో వుండేదాన్ని. వాళ్ళూ నువ్వు కొన్నట్టే నన్ను కొన్నారు. ఆవిడ పెట్టుబడి తీర కుండానే ఈ ఆగంతకులు నన్నెత్తుకొచ్చి ఇక్కడ పడేసారు. నే నిక్కడున్నట్టు గాని ఆవిడకు తెలిసిందో నా ఎముక లేరేసు ంది."

సరోజ మాటలకు ఓ క్షణం అవాక్కై పోయిందామె. "ఓరి వీళ్ళ జిమ్మడా! కంపెనీ గుంటను తీసుకొచ్చి ఆరువేలు గుంజుకెళ్ళారు. మళ్ళీ రాక పోతారా! దుమ్ము లేరించేస్తా నా కొడకల్లారా" కసి తీరా తిట్టుకుంది లో లోపల.

"నా దగ్గర నేకేం భయం లేదు నీ వంటి మీద ఈగ వాలనివ్వను. ఇంతకూ నీ కక్కడ రోజుకేమాత్రం ముట్టేది?" ఉండబట్ట లేక అడిగిందామె మళ్ళీ.

"తిండి, బట్టా కాక రోజుకి యాభై రూపాయలిచ్చేది. నేనంటే మాంచి గిరాకి లెండి. వచ్చిన ప్రతి పాసింజరు నన్నే కోరుకునే వాడు. బేరం వుందన్నా వినిపించుకుంటేగా? ఈ యదవ సన్నాసులు నన్నిద్దుకొచ్చి ఇక్కడ పారేసారు లేకుంటే నా బతుకు మహారాణీలా వుండేది" అన్నది సరోజ.

"నేను మాత్రం నీకు తక్కువ చేస్తాననుకొంటున్నావా? చూస్తావు కదా తినబోతూ రుచెందుకు చెప్పడం" ఎంతో ప్రేమ వొలుకు తున్నట్లందామె

"నాకు కావలసింది దొరుకు తున్నప్పుడు ఏ కంపెనీ యైతే నాకేం?" అన్నది సరోజ నవ్వుతూ.

ఈ పిల్ల నెలా దారిలో పెట్టాలా అని అనుకున్న ఆవిడకు ఆ బెంగ తీరిపోయింది. కంపెనీ సరుకేగా, మరి పిల్లతో సమస్యే లేదనుకుంది."మీద మిక్కిలి నిజాయితీ గల ముండే. లేక పోతే పెద్దాపురం రంగమ్మ మీద సానుభూతెందుకు చూపిస్తుంది?" అనుకుంది తనలో తను.

సరోజ తనకు కేటాయించిన గదిలో కెళ్ళింది. ఆ గది అత్తరు అగరొత్తుల సువాసనతో గుభాళిస్తోంది. గోడలకి అందమైన అమ్మాయిల చిత్ర పటాలు వ్రేలాడు తున్నాయి. ఓ ప్రక్క డబుల్ కాట్ డన్‌లప్ బెడ్డు, మరో వైపు డ్రెస్సింగ్ టేబిలుంది. వేనిషింగ్ క్రీమ్, టాల్కం పౌడరు, స్ప్రే, లిప్‌స్టిక్ లాంటి సౌందర్య సాధనాలెన్నో ఆ బల్ల మీదున్నాయి. అద్దంలో తన ప్రతి బింబం తనను వెక్కిరిస్తున్నట్లుంది. ఏడు పొచ్చింది సరోజకి కళ్ళ నుండి బొట బొటా నీళ్ళు రావడంతో చీర చెంగుతో వత్తుకుంటూ అచేతనంగా మంచం మీద వాలి పోయింది. అలా ఎంత సేపు పడుకుందో ఆమెకే తెలీలేదు.

(ఇంకా ఉంది)

# వ్యక్తిగతం



ఆల్‌ఫ్రెడ్ బురిన్‌కి రెండు ప్రపంచ యుద్ధాలు, ఎడ్వర్డ్ కాలం నాటి ఇంగ్లాండ్ ఇంకా బాగా గుర్తు ఉన్నాయంటే ఆశ్చర్యపడవలసిన అవసరం లేదు ఎందుకంటే ఇటీవలే ఆయన తమ నూరవ పుట్టిన రోజు పండగ చేసుకున్నారు ఈయనకి ఇంతగా ప్రచారం రావటానికి కారణాలు ఇంకా ఆయన పూర్తి బాధ్యత గల ఉద్యోగాన్ని నిర్వహిస్తూ ఉండటం, ఉద్యోగం చేస్తున్న అమెరికన్‌లలో అతి వృద్ధుడు ఈయనే కావటం గ్లోబ్ షిప్పింగ్ కంపెనీలో చైర్మెన్‌గా జెర్సీ నగరంలో తమ ఉద్యోగాన్ని గురించే ఆయన ఆలోచన అంతా అదే కంపెనీలో 1902లో బెర్లిన్‌లో బురిన్ తమ ఉద్యోగ జీవితాన్ని గుమాస్తాగా ప్రారంభించారు అక్కడ నుంచి లండన్, ఆ తర్వాత న్యూయార్క్ నగరంలో గల దాని బ్రాంచికి మారిపోయారు ఆయనకి 1919లో అమెరికా సంయుక్త రాష్ట్రాల పౌరసత్వం లభించింది ఈ వయసులో కూడా ఆయన తమ 70వ పడిలో ఉన్నంత ఉత్సాహంగా ఉన్నారు తాము రోజుకి కనీసం రెండు చుట్టలు అయినా తాగుతామని, ఎప్పుడూ వ్యాయామం జోలికి పోలేదని, తరచుగా సాయంత్రాలు ఒక గ్లాసు స్కాచ్ సేవిస్తామని అంటారాయన తమ దీర్ఘాయుర్దాయానికి చిట్కా చెబుతూ, అది చాలా తేలిక అని, త్వరగా ప్రారంభించటం, కష్టపడి పనిచేయటమే ఆ రహస్యం అని అంటున్నారు ఆయన ఇప్పుడు బుధవారాలు పనిచేయటం మానేసారట ఎందుకంటే "ఇంకా బతికినన్నాళ్ళు (మరో నూరేళ్ళు) బతకను కదా" అంటారాయన □



ఆసియా క్రీడోత్సవాలలో బంగారు పతకాన్ని గెలుచుకున్న క్రీడాకారిణి కుమారి గీతా జుట్షి న్యూయార్క్‌లో టిక్నాలజీ, స్ట్రాటజిక్ సర్వీసుల డైరెక్టర్‌గా పని చేస్తున్న శ్రీ జోసెఫ్ మత్తయిని ఇటీవల కాలిఫోర్నియాలో వివాహం చేసుకున్నది వార్నా క్రీడాశాఖలో సీనియర్ ప్లానింగ్ అధికారిగా పని చేస్తున్న ఈమె ఉన్నత శిక్షణ కొసం రెండేళ్ళ క్రితం అమెరికా సంయుక్త రాష్ట్రాలక వెళ్ళింది □

# వారఫలం

## 4-7-1986 శుక్రవారం నుండి 10-7-1986 గురువారం వరకు

★ **మేషం :** గత వారమంతా చికాకులతో గడచిందిగా! ఇక, క్రమంగా అన్ని రంగాలలో ప్రగతి కనిపిస్తుంది అభివృద్ధికి రాచబాట ఏర్పడుతుంది 'రాశికి' బలం చేకూరగల దినాలొచ్చాయ్ వ్యాపారానికిలోటురాదు స్త్రీలకు కొందరకు వృత్తి మార్పు, ఇల్లు మార్చవలసి రావచ్చు

★ **వృషభం :** సాటి వారితో అనవసరంగా కలహించవలసి రావచ్చు అభిమానుల ఆదరణలో లోపం కనిపించవచ్చు వారమంతా శ్రమదాయకం కావచ్చు కొందరకు లేనిపోని పరిచయాలేర్పడవచ్చు అలాంటివి బాధాకరములేగా! స్త్రీలకు నూతనోద్యోగాలకు దరఖాస్తు చేయటం మానకండి, ఫలించే రోజులొచ్చాయ్

★ **మిధునం :** 'విద్యకు వినయమే ప్రధానం' అలా వినయం ప్రదర్శించారా, బహు బాగుగా రాణిస్తారు పెద్దల పరిచయం ఏర్పడుతుంది ' అనుగ్రహం లభ్యమవుతుంది వృత్తియందు రాణింపు చేకూరుతుంది నలుగురచే ప్రశంసింపబడుతారు వ్యవహారం సుసంపన్నమవుతుంది స్త్రీలకు ఉన్నత విద్యాభ్యాసానికి చేసే యత్నాలు ఫలిస్తాయి

★ **కర్కాటకం :** రాజకీయంగా ఎలాంటి ప్రయోజనం సాదించలేరని తెలిసికొగలుగుతారు ఆరోగ్యరీత్యా పెంపునకు శ్రమించుట అవసరమే వ్యాపారాన పోటీకి ఊగటం ఏమంత శ్రేయంకాదు అధికారుల మెప్పుకై ప్రాకులాడుట న్యాయంగా బావించండి స్త్రీలకు వృత్తి యందు పెంపు, కొందరకు అధిక విద్యార్జనా యత్నాలు సఫలం కావటం గమనిస్తారు

★ **సింహం :** లావాదేవిలలో ఎంత జాగ్రత్తగా, బహుశా మౌనంగా ఉండటం శ్రేయోదాయకం 'జాయింటు' వ్యాపారమయితే సాటవారిని అర్థం చెసుకొని మెలగటం అవసరం. నీతికై ప్రాకులాట అవసరం విద్యా వినయ సంపన్నులకు సదవకాశాలు లభిస్తాయి. స్త్రీలకు: వ్యవహారరీత్యా అనుకూలం శుభకార్య సందడి అధికం, లాబదాయకం

★ **కన్య :** వ్యాపారమందు లాభించే సమయం వృత్తియందు వికాసమున్నది ప్రయాణం చేయవలసిన అవశ్యకత కొందరకు తప్పనిసరి అవుతుంది రాజకియంగా మి యత్నాలు సఫలమవుతాయి సాహితీ మార్గాన మికు మేలున్నది గ్రహించి, యత్నించండి స్త్రీలకు గౌరవభాజనమైన వారం పత్రికా సభా గౌరవాదులు ఏర్పడుతాయి

★ **తుల :** అత్యవసరంగా, సపరివారంగా కొందరు విశ్రాంతికై ప్రయాణించనున్నారు కొందరు ఉద్యోగరీత్యా విశ్రాంతి గైకొనవలసి రావచ్చు సెలవు పెట్టవలసిన పరిస్థితులూ ఏర్పడవచ్చు. విద్యార్థులు యత్నిస్తే 'సీట్లు' దొరికే అవకాశాలున్నాయి స్త్రీలకు కళా ప్రియత్వం, అన్నివిధాలా సదవకాశాలు

★ **వృశ్చికం :** వ్యవహార రంగాన మికు హాయి చిక్కుతుంది వ్యాపారమందు చెప్పుకోదగిన మార్పులు రానున్నాయి నూతన వస్తు సేకరణకు సదవకాశం లభ్యమవుతుంది అనవసరంగా తగాదాలు వస్తాయేమో గ్రహించండి. స్త్రీలకు కుటుంబ కలతలు, అశాంతి, ద్రవ్యాభావం, ఆశించిన 'ప్రమోషన్' అందక పోవడంతో చికాకు

★ **ధనుస్సు :** వృత్తియందు యింకా జాగ్రత్త అవసరం. కృషి కావించవలసిన అవశ్యమున్నది సాధించవలసినది యున్నది చిక్కిన అవకాశాలను జారవిడువకుండా మేలు పొందండి బాగా ఆర్జించండి నిర్మాతలకు, నాటక, నాట్య, చలన చిత్రరంగానుభవం గలవారికి చక్కని అవకాశాలున్నాయి స్త్రీలకు చాలమంది ఆరోగ్యరీత్యా శ్రద్ధ గైకొనవలె

★ **మకరం :** 'ఇంత మంచి వారం' ఎప్పుడు చూచామని, వారారంభంలోనే గ్రహింపగలుగుతారు. డబ్బు అందుతుంది. ఆశయం నెరవేరుతుంది అప్పులు వసూలు అవుతాయి ఆనందంగా కాలక్షేపం విద్యాగోష్ఠి, ఉన్నత విద్యకు గావించే యత్నాలు సఫలం కావటం గ్రహిస్తారు స్త్రీలకు. గురుగ్రహ ఆశీర్బలమున ఆదాయం, ఆటంకాలు తొలగటం, ఆనందం.

★ **కుంభం :** స్థిరాస్థి విషయంగా యిబ్బంది ఏర్పడుతుంది. ఎలాగైనా దాటుకోవాలి. పట్టుదలతో మెలగాలి రాజకియంగా మి యత్నాలు కొనసాగుతాయి వారమంతా ఆనందదాయకం అనిపించేలాగు వ్యవహారాలు సాగిపోతాయి. స్త్రీలకు. చిక్కిన అవకాశాలు జారిపోవటం, మనఃక్లేశం, తగాదాలుంటాయి.

★ **మీనం :** లేనిపోని గొడవలతో కాలం వ్యయిస్తారు. ఏనాడో కలసి రాగలదన్న వ్యవహారం యింకా తేలదు. 'గురుగ్రహా'నుకూలత లేదు అధిక వ్యయానికి గురికావలసి వస్తుంది స్త్రీలకు: చిక్కులు నివృత్తి, ఉద్యోగ లాభం, ఆనందం, ఆర్థికంగా మెరుగు కనిపిస్తవి గ్రహించండి

-విద్వాన్ కోట సత్యరంగయ్యశాస్త్రి

## జర్మనీలో అమ్మాయిల వేలం!

వెస్ట్ జర్మనీ హేంబర్గ్‌లో బానిసలను యీనాటికి కూడా వో 24 గంటల పనికి వేలం వేస్తారట ఇటీవలి వో వేళ్ళంలో వో 1500 మంది వెర్రిగా పాల్గొన్నారట ఈ వేలం అమ్మాయిల వేలమట 18 ఏళ్ళ చక్కని వొంపుసొంపులున్న అమ్మాయిలు 24 గంటల కాలానికి 2 డాలర్ల నుంచి 18 డాలర్ల వరకూ వేలంలో అమ్ముడుపోయారట ఈ ఎల్లలు 24 గంటల కాలం మి కోర్కెలు, వాంఛలూ, గుప్త వాంఛలో, లేక కోర్కెలు ఏవైనా సరే కిమ్మనకుండా తీరుస్తారట మి కోర్కెలే గాకుండా మి స్నేహితుల కోర్కెలు - ఎవరైనా - ఎందరైనా - 24 గంటల కాలం మి ఇష్టం అంటూ వేలం వేశారట పబ్లీకున

## ప్రభుత్వ వైద్యశాలలో నర్సు మానభంగం!

శివకాశిలోని ప్రభుత్వ వైద్యశాలలో నైట్ డ్యూటీలో వున్న నర్సు 40 ఏళ్ళ రాజ్యలక్ష్మి అనే ఆమెను అదే ఆసుపత్రిలో పనిచేస్తున్న 44 ఏళ్ళ సివుకొపెరుమాళ్ అనే అతను బలాత్కరించి, మానభంగం చేసి,




కామతృష్ణ తీర్చుకున్నాడట ఆమె మిది వ్యామోహంతో అతనామెను అంతక్రితం తన కోర్కె తీర్చమని అడిగి భంగపడ్డాడట - అందుకే కాబోలు యీ రూటు ఎన్నుకున్నాడు

## పంటను కాపాడే గుడ్లగూబ!

గుడ్లగూబ పది చిట్టిలుకలను ఒకేసారి ఫలహారంగా సునాయాసంగా స్వాహా చేయగలదట ఇది పొలాలలో తీరుబడిగా కూర్చుని గుడ్లగూబ చూపులతో ఎలుకలను పట్టుకుని గుటకాయ స్వాహా చేస్తుందట పది ఎలుకలను స్వాహా చేయడం ద్వారా 160 కిలోల కూరలుగానీ, మరే పంటగానీ ఏటికి ఎలుకల నుంచి యీ గుడ్లగూబ కాపాడగలదట



## భారతదేశంలో కుష్ఠు రోగులు!

ప్రపంచం మొత్తం మిద పది పదిహేను మిలియనుల కుష్ఠు రోగులున్నారట వీరిలో కేవలం భారతదేశంలో కనీసం 4 మిలియనులు వుంటారట వీరిలో ఏడెనిమిదిలక్షల మందికి యీ రోగం నయంచేయ వీల్లేనంత ముదిరి పోయిందట

## పాదాలు చూసి రోగ నిర్ణయం!

కొన్ని రకాల రోగాలు పాదాలు చూసి చెప్పవచ్చునని, పాదాలు పగలడం వగైరాలు కేవలం పాదాలమిది శ్రద్ధ లేకపోవడం వల్ల కాదని, అనారోగ్యానికి పాదం అర్ధమని వైద్యశాస్త్రం వూదరకొట్టేస్తోందట పాదాలు, ఎక్కలు, తొడలు, తుంటి వంటి వాటికి సమయం, సందర్భంతో మర్దనా చెయడం వల్ల శరీరంలోని కొన్ని రోగాలు నయమవుతాయట పాదం పైన మనం ఆ పాదాన్ని వూపే జాయింటు లోపల భాగం చక్కని మర్దనా చేయడం వల్ల మనకుండే నీరసం తగ్గుతుందట - పాదం బొటన వేలు నుంచి, పిరుదుల వరకూ వుండే (కాలు మొత్తం బాగం) బాగాన్ని విధ విదాలుగా మర్దనా చేయడంవల్ల శరీరంలోని కొన్ని రకాల రోగాలు నివారణవుతాయట - హత్తేరి!

## ప్రాణాలు దక్కించుకున్న పూజారి కొడుకు!

తంజావూరుకు చెందిన మన్నారు గుడి పూజారి గోపాలకృష్ణ దీక్షితార్ గారి కొడుకు పదేళ్ల వెంకటేశన్ను మిట్టమధ్యాహ్నం వేళ వో నలుగురు మత్తుమందు వాసన చూపి, నరబలి యివ్వడానికి ఎత్తుకు పోయారట రాత్రికి మత్తు పోయిన ఆ కుర్రాడు వాళ్ళ మాటలు విని, విషయం పసిగట్టి పారిపోయి రాత్రి బోలెడు దూరం నడిచి యింటికి క్షేమంగా చేరాడట - ఆయురన్నం ప్రయచ్ఛతి

## 157 భాషలలో అగధాక్రిస్టి నవలలు!

అగధాక్రిస్టి రాసిన నవలలు ప్రపంచ భాషలలో 157 భాషలలోకి అనువదించబడ్డాయట మహాకవి షేక్స్‌పియర్ రచనలు 92 భాషలలోకే అనువదింపబడ్డాయట

## అనుమానంతో భార్య హత్య!

రామమంగళం అనే వూరుకు చెందిన 30 ఏళ్ళ రాజ్ అనే అతను వో పోలీసు కేసులో చిక్కుకుని, పోలీసులకు చిక్కకుండా రెండేళ్ళుగా పరారిలో వున్నాడట అతని భార్య 27 ఏళ్ళ మేరి తన యిద్దరు పిల్లలతో వంటరిగా వుంటోందిట మేరి తన శీలాన్ని సరదాగా వుపయోగిస్తోందని, యిష్టం వచ్చిన వారితో యిష్టం వచ్చిన రీతిలో కామతృష్ణ తీర్చుకుంటోందన్న అనుమానంతో పరారిలో వున్న రాజ్ ఒక రోజు రాత్రి వచ్చి మనం మరో వూరు పోదాం రా అని బయల్దేరదీసి, మధ్యే మార్గంలో పీక నరికి చంపేశాడట

## భారతదేశంలో టెలిఫోనులు!

భారతదేశంలో వెయ్యిమందిలో వో నలుగురికి మాత్రం టెలిఫోను వుందట ఈ శాతంలో యీ దేశంలో ఫోనులున్నాయట జపాన్‌లో నూటికి 80 మందికి, స్విట్జర్లండ్‌లో 'నూటికి 90 మందికి ఫోనులున్నాయట - అయినా మనదేశంలో రాంగ్




నంబర్లూ -క్రాస్ టాకిలూ మాత్రం ప్రథమ స్థానంలోనే వుండి వుంటాయి

## అడవిలో స్త్రీ శవం!

మధురకు చెందిన కుప్పాన్ అనే వో గ్రామంలోని అడవిలో వొక చోట భూమిలోంచి ఒక స్త్రీ అరచేయి బయటకువచ్చి వుందట ఆ వూరి వారు పోలీసుకు రిపోర్టిస్తే వారొచ్చి అక్కడ తవ్వితే 20 ఏళ్ళ వో వివాహిత శవం బయటపడిందట ఎవరో, ఎందుకో, ఎప్పుడో హత్య చేసి, అర్జంటుగా శవాన్ని పాతి పెట్టేయడంతో గొయ్యి లోతుగా త్రవ్వలేదని, అందుకే శవం బయటపడిందని పోలీసు అన్నారట ఆమెను ఎందుకు, ఎప్పుడు, ఎవరు హత్య చేశారో యింకా తెలలేదట □

# తానొకటి తలిస్తే

## కొచ్చెర్లకోట వెంకట సుబ్బారావు

"నాయనా రాఘవా! నీ పెళ్ళి చూసే యోగం మాకు లేదంటావా? ముప్పైఏళ్ళు దాటిపోతున్నా నీకు పెళ్ళి ధ్యాసే లేదాయె! సంబంధాలంటూ వచ్చినవాళ్ళు వచ్చినట్లు తిరిగి వెళ్ళిపోతున్నారు" రాఘవరావు తల్లి కాంతమ్మ తన గోడు చెప్పుకు-పోతోంది

"అమ్మా! యిలా నువ్వు పెళ్ళి ప్రస్తావన తీసుకు రావటం నేను కాదనడం పరిపాటే అయిపోయింది. నువ్వన్నట్లు ఆ కల్యాణం ఘడియ రావాలిగా"

"అలా అంటే ఎలారా? ఎదిగిన నీ తోబుట్టువుల సంగతైనా నువ్వు ఆలోచించాలి. నీకొచ్చిన కట్నం సొమ్ముతో వాళ్ళకు పెళ్ళిళ్ళు చెయ్యాలి. నువ్వు యిలా సంబంధాలు చెడగొడుతూ వుంటే వాళ్ళ గతేంకాను

"నా కట్నం డబ్బుతో వాళ్ళ పెళ్ళిళ్ళు చెయ్యాలనుకోవడం దురాశ అని నేను అనను కాని అన్యాయం అని అంటాను నా కట్నంతో వాళ్ళ పెళ్ళిళ్ళు చేసి నన్ను అప్పుల్లో ముంచెత్తటం ఏమంత సబబు కాదేమో అవి తీర్చే శక్తి నాకెక్కడుంది?"

"నీకున్నంత ముందు చూపు మాకు లేదురా అదే వుంటే మీ నాయన సంపాదనంతా నీ చదువులకు ధారపోసే వాళ్ళమే కాదు కూడబెట్టి వాళ్ళ పెళ్ళిళ్ళు చేసి బరువు దింపుకొనే వాళ్ళం".

'అది కాదమ్మా నేను యిలా త్యాగాలు చేసు కుంటూపోతే రేపు నా గతేంకాను నేనూ మీలానే పిల్లల్ని బరువు అనుకోవాల్సి వస్తుందిగదా. వాళ్ళను చదివించాలన్నా సరైన సంబంధాలు చూడాలన్నా ఆర్థిక స్థోమతంటూ ఉండాలిగా"

"నిజమే నాయనా మీ తరం వేరు ముందు చూపున్న వాళ్ళు. ఇహ మా తరం అంటావా! వర్తమానంతో సతమతమవటం తప్పితే భవిష్యత్తు గురించి ఆలోచించే అవకాశమే లేదు నీ యిష్టం నువ్వు పెళ్ళే చేసుకుంటావా, నీ చెల్లెళ్ళను కన్యలగానే ఉంచేస్తావో నీదే భారం నాన్న సంపాదనే ఉంటే నీ మీద బరువు మోపేవాళ్ళం కాదు అకాలంలో రిటైరైపోవడం వల్ల నిన్ను యిబ్బంది పెట్టాల్సి వస్తుంది" అంటూ కాంతమ్మ వాపోయింది.

'నేనూ కసాయివాడ్ని కాదమ్మా నా స్వార్థం కోసం యితరులను బలి చెయ్యాలనేటటువంటి దురుద్దేశం లేదు కానైతే నాకు నచ్చేనాలుగు రాళ్ళతో నేను పెళ్ళి చేసుకొని సంసారమే ఈదుతానా, అప్పులే తీరుస్తానా? నువ్వు చూస్తునే వున్నావుగా. పదో, పదిహేనో వేలు ఖర్చు పెట్టి ఆడపిల్ల వాళ్ళు తమ బరువు దింపుకుంటారు. కాని జీవితాంతం వాళ్ళను పోషించే భారం మొగవాళ్ళదేగా'

'చాలా విడ్డూరంగా మాట్లాడుతున్నావురా వెనకటి ఎవడో చెప్పినట్లు ఆలికి అన్నం పెట్టడం ఊరికి ఉపకారమట భార్యా ఓ బరువేనంటావా?

'బరువు అని నువ్వు ఒప్పుకోక పోయినా నిజానికి అది భారమే. నేను సంపాదించే వెయ్యి రూపాయిలు ఏ మూలకు వస్తాయి. పెళ్ళయిం దగ్గర్నుంచి ఆ ఖర్చులు ఈ ఖర్చులు వచ్చి పడతాయి. ఆ తరువాత పిల్లలూ, రోగాలూ, రొష్టులూ ఆ పైన చదువు సంధ్యలు నా ఒక్క సంపాదనతో వీటిల్ని తట్టుకో గలనా?"

"అయితే ఇంతకీ నువ్వు పెళ్ళి చేసుకోనంటావు. అంతేగా?"

అలా అని నేనటంలేదు. కానీ గుడ్డెద్దు చేలో పడ్డట్టు చెయ్యలేను అలా చేస్తే, నా జీవితము నరకమవుతుంది అందుకే బాగా ఆలోచించి ఓ నిర్ణయానికి వచ్చాను. ఉద్యోగము చేసే పిల్ల నయితే కాస్త వేడి నీళ్ళకు చన్నీళ్ళు తోడైనట్లుంటుంది. గుట్టుగా రోజులు గడుప వచ్చు"

"దానికి మా అభ్యంతరం ఏముంటుంది నిక్షేపంగా ఉద్యోగం చేసుకొనే అమ్మాయిని చేసుకో అయితే మా సంగతంటావా ఆడది గడప దాట కూడదు' అనే పంథాలో బతికాం అందుకని ఉద్యోగం చేసే అమ్మాయిని కోడలిగా తెచ్చుకుంటే మనవాళ్ళు నలుగురూ నాలుగు మాటలూ అనొచ్చు ఆడదాన్ని పోషించలేక ఉద్యోగం చేసేదానికి కక్కుర్తిపడ్డావు అని నిన్నూ అనొచ్చు ఆ బరువు సులువులు నువ్వే ఆలోచించు రాఘవరావు తల్లి పైకి ఒప్పుకుంటున్నా లోపల ఆమెకు మనస్కరించటము లేదు

నలుగురూ అనుకుంటారని నేను నరకంలోకి దూకలేను మారుతున్న కాలంతోపాటు మనమూ మారాలి ఉద్యోగం చేసినంత మాత్రాన ఆడదానికి సంఘంలో విలువ తగ్గిపోదు. అందుకే నేను అలాంటి సంబంధాన్నే యిష్టపడతాను నాన్నకు కూడా నువ్వు నచ్చచెప్పు అంటూ రాఘవరావు తన నిర్ణయాన్ని గట్టిగా చెప్పేసాడు

పిల్లవానికి పెళ్ళైతే ఓ యింటివాడైతే చాలని ఒక ప్రక్క ఆ వచ్చే కట్నంతో కాలు చెయ్యి కూడ-గట్టుకుని ఆడపిల్లలకు పెళ్ళిళ్ళు చెయ్యొచ్చు అనే ఆలోచన మరో ప్రక్క రావడంతో రాఘవరావు తండ్రి అలాంటి సంబంధానికి ఒప్పుకున్నాడు రాఘవ పట్టుపట్టకపోతే నిజానికి ఆయన చదువు సంధ్యలు లేని అమ్మాయినే యిష్టపడేవాడు. చదువుకొని ఉద్యోగం చేసే కోడలు అత్తమామలను అంతగా పట్టించుకోదు అది అతని అభిప్రాయము

* * *

రాఘవరావుకు పెళ్ళి అయింది. సరోజ చాలా చురుకైన పిల్ల అమ్మాయికేమి లోపంలేదు మంచి ఆఫీసులో ఉద్యోగం చేస్తుంది జీతం నెలకు ఎనిమిది వందలు. అందరూ సంతోషించారు అందరికన్నా రాఘవరావే ఎక్కువ సంతోషించాడు

దానికి కారణం లేకపోలేదు. తను ఓ బడిపంతులు గురువు దైవం లాంటివాడు. గురువును పూజింపుము అనే మాటలు ఎన్ని చెప్పినా సమాజంలో ఉపాధ్యాయుడికి ఓ హోదా అంటూ లేదు ఒక ప్రత్యేక గుర్తింపు లేదు ఇహ పెళ్ళిళ్ళ సంగతికి వస్తే సరేసరి. పంతుల్ని పెళ్ళి చేసుకోవడం ఆడది న్యూనతగా బావిస్తుంది ఆఫీసులో ఉద్యోగం చేసే ఓ చిరుద్యోగికంటే ఎక్కువ సంపాదిస్తున్నా పంతులుకు విలువ తక్కువే ఆడవాళ్ళు

గుమాస్తాలకే ఓటు వేస్తారు వాళ్ళ ఆయన ఓ పెద్ద ఆఫీసులో పనిచేస్తున్నాడంటే స్టేటస్‌గా

ఫలవుతారు. అందుకే రాఘవరావు ఉద్యోగం చేస్తున్న సంబంధం దొరకదేమోనని భయపడ్డాడు ఒకవేళ దొరికినా ఆమె మరో పంతులమ్మవుతుందేమోనని భయపడ్డాడు భార్యా భర్తలిద్దరూ ఓవరు ఉద్యోగం చేస్తుంటే యిల్లు ఓ బస అవుతుందని రాజకీయాలకు నిలయం అవుతుందని అతని భయం అలాకాక సరోజ దొరకటం వల్ల అతడు చాలా సంబరపడిపోయాడు





పెళ్ళైన నెల రోజులకే రాఘవకు కొన్ని నిజాలు తెలిసాయి అతడు ఆశించిన స్వర్గం చాలా దూరమైంది అతని అంచనాలు తారుమారయ్యాయి

"సరోజ! నువ్వు ఈ నిజం ఎందుకు దాచావు"

అప్పుడే చెప్పొచ్చుగా" రాఘవ ముఖానికి గంటు పెట్టుకున్నట్టు అన్నాడు.

"మీరడిగిన విషయాలన్నిటికి మా వాళ్ళు సరిగానే సమాధానం చెప్పారు ఈ విషయం మీరడగనూ లేదు వాళ్ళు చెప్పనూ లేదు అందులో మా తప్పేముంది".

"మీరు యిలాంటి పని చేస్తారని మేము కలగన్నామా! ఏదో లోక సహజంగా పోతారనుకున్నాం యింత మోసం చేస్తారని అనుకోలేదు"

"ఇందులో మిమ్మల్ని మోసం చేసిందేముంది? ఎవరి పరిస్థితులరీత్యా వాళ్ళు ప్రవర్తిస్తారు."

'అందుకు ఫలితం అనుభవించేది నేను రాఘవ కోపం తారాస్థాయికి చేరుకుంది 'నేను అని మీరు వేరుగా మాట్లాడకండి కొన్ని విషయాల్లో మేము సర్దుకుపోయినట్లే మీరూ సర్దుకుపోవాలి అప్పుడే పొందిక కుదురుతుంది" అంది సరోజ

"మీకిప్పుడేమి తక్కువైంది?"

'అడుగుతున్నారు కాబట్టి చెబుతున్నాను మీలాంటి వాళ్లను ఎవరు పెళ్లి చేసుకుంటారు చెప్పండి. ఆస్తిపాస్తులూ లేవు ఉద్యోగమూ సామాన్యమైంది అయినా నేను ఒప్పుకున్నాను ఎందుకు? మీ సంసార పరిస్థితులను చూసాము కాబట్టి. వచ్చే కట్నంతో చెల్లెళ్ల పెళ్లిళ్ళు చేసే సంస్కార వంతులని సంబరపడ్డాను. అందుకే నాకు తగిన భర్తని అంగీకరించాను నిజానికి మీకంటే అందమైన వాళ్ళూ మంచి ఉద్యోగము చేసే వాళ్ళూ

## ఆది మానవులు

అప్పుడు –
అనాగరికత చేత
మనం బట్టల్లేకుండానే
తిరిగాం!
ఇప్పుడు –
నాగరికత పేరిట
మనల్ని మనమే
బట్ట బయలు చేస్కుంటున్నాం!!

–ఆదిరెడ్డి మావుళ్ళు

## తానొకటి తలిస్తే...

కోరి వచ్చారు కాని నేను తిరస్కరించాను కారణం?

వాళ్లకు మనలాంటి యింటి పరిస్థితుల పట్ల అవగాహన లేదు. అందుకే వాళ్ళు అర్థం చేసుకోలేరని నా భయం

"సరోజ నేను పూర్తిగా ఓడిపోయాను నేను కన్న కలలన్నీ మంచులా కరిగిపోయాయి నేను వూహించినది ఒకటి జగింది మరొకటి" రాఘవ క్రుంగిపోతూ అన్నాడు

ఏమండి మీరంతగా దిగులుపడవద్దు మేమున్న పరిస్థితులలో అంతకన్న గత్యంతరము లేదు మా నాన్న కట్నం యివ్వలేడు కట్నం యివ్వనిదే మీరు పెళ్ళికి ఒప్పుకోరు అందుకే మా ఆపీసులో లోను తీసుకున్నాను మహా అయితే నెలకు రెండు వందలు కట్ అవుతుంది పోతే మా అమ్మా నాన్నల విషయం కని పెంచి ఉద్యోగస్తురాలిగా చేసిన తల్లిదండ్రుల రుణం ఆ మాత్రం తీర్చుకోకపోతే పుట్టగతులుండవు'

సరోజా! ఇందులో నీ తప్పేమీలేదు. నేను చెల్లెళ్ల పెళ్లిళ్ళు చెయ్యాలి వేలకు వేలు కట్నంగా ధారపొయ్యాలి పైపెచ్చు వివాహ ఖర్చులు తతంగాలు. ఈ వుచ్చు నుండి బయటపడాలి అందుకే నేను యిలాంటి ఆలోచన చేశాను నీ జీతంతో ఆ అప్పులు తీర్చవచ్చునుకున్నాను. కాని నువ్వు అప్పులతోనే అత్త గడప తొక్కావు మీరూ మాలాంటి వాళ్లే కట్నం అనే బెడద లేకుంటే నువ్వూ అప్పుతో వచ్చేదానివికాదు నేనూ చెల్లెళ్ల పెళ్లిళ్లకి అప్పులు చేసేవాడ్ని కాదు ఈ మధ్యతరగతి కుటుంబాలింతే'

'అందునా మగవాళ్లదే పై చెయ్యి మీకేం మగ మహారాజులు మన యిద్దరి జీతాలతో అటు అప్పులు యిటు అప్పులు తీరుస్తారు కాని యింటా బయటా పనితో నేనేగా సతమతమయ్యేది అదే ఉద్యోగం లేందయితే హాయిగా యిల్లు చక్కబెట్టుకుంటుంది. యిన్ని బరువు బాధ్యతలుండవు అసలు ఆడదానికి చదువు వుండాలో వద్దో నాకు తెలియదు కాని ఉద్యోగము మాత్రం ఉండకూడదు అంటూ సరోజ చాలా బాధగా అంది



# హైదరాబాదు నోట్‌బుక్

## పాలీ, తెలుగు పదాల పోలికలు:-

బుద్ధుని కాలం నుంచి పల్లవుల తర్వాత కూడ దాదాపు పన్నెండు వందల సంవత్సరాల వరకు బౌద్ధం, దాని ద్వారా పాలీ ప్రాకృతం, జైనం, తద్వారా ప్రాకృతాపభ్రంశాలు తెలుగు నేలలో వ్యాపించాయి.

అందువల్ల ప్రజా సామాన్య జీవితంలోను, భాషా సాహిత్యాలలోను వాటి ప్రభావం చొచ్చుకు పోయింది బౌద్ధ జైనాచార్యులు ప్రజలతో సంబంధం కల వారు గనుక స్థానిక భాషలను నేర్చి,

ఆ భాషా పదాలనూ విరివిగా వాడారు ఈ విధంగా ఈ భాషల మధ్య ఆదాన ప్రదానాలు జరిగాయి ఈ లాటి పదాలు దాదాపు రెండు వందలను శ్రీ చీమకుర్తి శేషగిరిరావు రైస్ డేవిస్ పాలీ ఇంగ్లీషు నిఘంటువు

నుంచి ఏరారు వాటిపై జూన్ 8వ తేదిన తెలుగు భాషా సమితిలో జరిగిన తెలుగు గోష్ఠి సమావేశంలో నిశితంగా పరిశీలన జరిగింది ఈ సమావేశంలో శ్రీయుతులు చీమకుర్తి శేషగిరిరావు, జి ఎ కృష్ణ,

పాతూరి సీతారామాంజనేయులు, రాంభట్ల కృష్ణమూర్తి, డాక్టర్ పుట్రేవు రాజారాం, యార్లగడ్డ ఆంజనేయులు, డాక్టర్ ఎన్ శివరామమూర్తి మున్నగువారు పాల్గొన్నారు చర్చించబడిన పదాలను చూస్తే ఏమిటీ పోలికలు!- అని ఆశ్చర్యం

కలుగుతుంది. ప్రతి తెలుగు వారూ ఈ విషయం తెల్సుకొని మనోవికాసం పొందాలనే దృష్టితో ఆ పదాలను కొన్నిటిని ఇక్కడ పొందు పరుస్తున్నాను మొదటి పాలీపదం, తర్వాత దాని సమాన వాచక తెలుగు పదం ఇస్తున్నాను - అంచ- అంచు,

అక్కోస- అక్కసు, అచ్చి- అచ్చిరావడం, అగ్గి- అగ్గి, అచ్చిబంధ- అచ్చుకట్టు, అచ్చేరియ- ఆశ్చెరువు, అజ్ఝాస- అడియాస, అణ్ణా- అన్నెం (జ్ఞానం), అద్ధాన-అద్ధానం (దారి), అనయ-

అనయము (కీడు), అంబిల- అంబలి, అబద్ధ- అబద్ధం (అసత్యం), అబొబారిక- ఎబ్బరికం, అబ్బు- అబ్బో, అమ్మ-అమ్మ, అయ్యా- అయ్య (సత్పురుషుడు) అరే- అరే, అలగ్గ (అస్థిరమైన)-

అలగా, ఆగు-ఆగం, ఆణత్తి- ఆనతి, ఆదా-ఆదా, ఆదెయ్య- అదుకొను, ఆరకత్త- అరికట్టు, ఆస- ఆస, ఇంగిత - ఇంగితం, ఇంఘాల- ఇంగలం, ఇచ్చక- ఇచ్చకం, ఉగ్గి- ఉగ్గు, ఉన్ని- ఉన్ని,

ఉక్క- ఉక్క, ఉగ్గహ- ఉగ్గడించు, ఉదిరణ- వదరు, ఉద్ధార- ఉద్దర (అప్పు), ఉవజ్ఝ- ఒజ్జ, ఉప్పత్తి (అకస్మికంగా వచ్చిన ఆపద)- ఉప్పత్తి పిడుగు (శాసనాలు), ఎత్తావత్తా - ఏతా వాతా

ఏద- ఎదుగు, ఏన-ఈయన, ఏసిన్-ఏచి, ఒకార- ఒయ్యారం, ఒకిరణ- ఒకరింపు, ఒకిలిణి- ఒకిలింపు ఒడ్డేతి- ఒడ్డుట, ఓడ్డా- ఒడుపూ, ఓదహన- ఒదెవేయు, ఒది- ఒద్ద, ఒర- ఒర, ఒరత- ఊరట.

ఒసరణ- ఒసరిల్లు, ఓహరణ- ఓహరి (నాహారించెనగి), కంస- కంచు, కంచం, కట్ట- కట్టె, కత్తరి-కత్తెర, కబ్బం-కబ్బం, కంబళియ- కంబళి, కరకర- కరకర (కరకరలాడు), కమ్మార- కమ్మరి, కళేబర- కళేబరం, కసంబు-కసవు, కాచ-గాజు, కిచ్చ- కించ, కిటిక- కిటికి, కుంచిక- కుంచెకోల, కుటవ- గూడు, కుడ్డ- గోడ, కుటిక- గుడిసె, కుణి- కుని(వంగు), కుండి- కుండీ(బొక్కెన వంటి మట్టి తొట్టి), కుసి- కుసి(మంచపు కుసి), కూర- కూర, కోణ- కోన, కొట్టన- కొట్టుట, కోంట- కొంటె, కోంర- కుంటి, ఖజ్జక- కజ్జాయం, ఖంభా- కంబం, కిట్ట- చిట్టెం, కిట్టం, ఖిల- చిల, ఘుద్దక- కొండిక, గద్ద- గద్ద, గారవ- గారవం, గుంబ-గుంపు, గుల-గుల్ల, గెండుక- చెండు, గేరుక- జేగురు, చాగ- చాగం, చిత్త- చిత్తా నక్షత్రం, చిల్లక- చిలుక కొయ్య, చీర- చీర, చున్న- సున్నం, చొక్ఖ- చొక్కం, ఛక్క- చక్క (ఆరు), చిద్ద- చెద్ద, జూత- జూదం, జోతి- జోతి, నామ- నామం, తాపిత- తాపించిన, తక్కర- టక్కరి, తట- తట్టు (వైపు), తట్టుక- తట్ట (పళ్లెం), తట్టిక- తడిక, తతియ- తదియ, తంతి- తంతి, తన్హి- తనికి, తంబ- తాంబాళం, తరి- తరి (నౌక), తరచి- త్రచ్చు, తాళ- తాళం (బీగం), తిట్ట- దిట్టంగా, తిన్హ- తిన్నని, తిప్ప- తిప్పలు (బాధలు), తరణ- తీర్పు, తిరేది- తీర్పుట, తేమన- తేమ




థావర- తావరం, తావలం, థిర- తిరము, థల- తల, దత్తి- దత్తి (దానం), దద్దు- దద్దు, దప్ప- దప్పం, దుట్ట- తుట్ట (పురుగు), దుపట్ట- దుప్పటి, ధమ్మ- దమ్మం, ధారణి- ధారుణి, ధోవతి- ధోవతి, నంగలు- నాగేలు, నవక- నవకం, నావా- నావ, నిక్కన్న- నిక్కన, నిక్కుహ- నిక్కువం, నిజ- నిజం (సత్యం), నిట్ట- నిట్టనిలువు, నిభా- నిభాయించు,

నిసభ- నిసబు (శ్రేష్ఠ), నేపుణ్ణ- నేర్పు, పకతిగ- పగిది, పక్క- ప్రక్క, పజ్జ- పజ్జ, (త్రోవ), పతిన్న- ప్రతిన, పన్న- పన్ను(పన్నుగడ), పణ- దానం(పణ్ణస), పణ్ణసన్న (దాన భూమి అంచులు సూచించే ఆకులముడి)- పన్నస (శాసనాలలో), పంద- పొంత, పంతి- బంతి, పయుత (ముడివడినది)- పయ్యెద, పలిమ- పలుగు, పలుగ్గ- పగులు, పసు- పసులు, పల్లల- పల్లం, పాళి- పాడి, పిల్లక- పిల్ల, పుణ్ణ- పున్నెం, పుణ్ణమ- పున్నమ, పుథవి- పుడమి, పూగ- పోగు, పోక, పెటక- పెటకం, పేళ- పేళ్ల గంప, పేళ- పెళ్ల, పోసేతి- ప్రోచు, పణక- పడగ (పాము పడగ), ఫారతి- పారు, బిల(ముక్క)- బిళ్ల, బుజ్ఝతి- బుజ్జగించు, బొంది- బొందె(శరీరం), బక్త-

బొక్క, భాణతి- బాణీ, మంకు- మంకు(పట్టు), మచ్ఛర- మచ్ఛరం, మరియాద- మర్యాద, మరమ- మొరస (మట్టి), మల్ల- మల్ల(పాత్ర), మస- మసి, మస్సు- మీసం, మానిక- మానిక, మిగ- మెకం, మాయ- మాయ(మోసం), మిల్హ- మైల, రక్కస- రక్కస, రచ్చ- రచ్చ, రిత్త- రిత్త (వట్టి), లంచ- లంచం, లహు- లగువు, వంక- వంక, వచ్చ- ఉచ్చ(మూత్రం), వణ్ణ- వన్నె, వన్నియ- వన్నియ, వత్థ- బట్ట, వద్ద- బద్దె, వసభ- బసవ, వాద- వాద, వాల (క్రూర) - వాలుమెకం, వికట- అకటావికటం, విఞ్ఞాణ- విన్నాణం, విలుగ్గ- విరుగు, విలార- ఇలారం (ఎల్లి, ఇల్లు ఇలారం అంతా), విసూక- విసుగు, వేళ- వేళ(కాలం), వోకార- ఒకరింపు, సక్క- చక్కబరచు, సక్ఖలి- చక్కిలం, సంగతి- సంగతి (ఘటన), సన్న- సన్న, సత్తు- సత్తు పిండి, సద్ద- సద్దు, సందన- సంతన, సంబళ- సంబళం, సంబుక- చెంబు, సంబార- సంబారపు పొడి ఈ విషయంలో ఇంకా బాషా శాస్త్రజ్ఞులు పరిశోధనలు జరుపాలని గోష్ఠి సభ్యులు అభిప్రాయ పడ్డారు

## ఉపశ్రుతి:-

పెళ్లి సంప్రతింపులు జరుగు తున్నాయి పెళ్లికూతురు తండ్రి అడిగారు పెళ్లివారికి ఏమాత్రం ఆస్తి ఉంది అని. అయ్యా మికేమి బెంగవద్దు పెళ్లికొడుకు తండ్రికి నాలుగు ఎయిడెడ్ హైస్కూళ్లు, రెండు కాలేజీలు, ఒక అనాథ శరణాలయం ఉన్నాయి అన్నాడు మధ్యవర్తి పెళ్లిళ్ల పేరయ్య

—తిరుమల రామచంద్ర

## శీర్షికలు

చెర్నోబుల్ - బరువు నీరు - గ్రాఫయిట్ - ప్రమాదము గురించి తెలుసుకోదగిన చక్కని విషయములను మా కందించినందులకు మా అభినందనలు.

బులుసు వేంకటరమణయ్య గారి ధర్మపథంలోని స్నేహంలోని భేదాలు గురించి చాలా సున్నితంగా పోల్చి చెప్పారు

ఫాలాక్షుని డైరీలోని విషయాలు మమ్మల్నెంతో ఆకర్షిస్తున్నాయి

-డి నర్సింగరావు, డి విజయలక్ష్మి
పటానుచెరువు

★ ★ ★

ఈ వారం సుమలత ముఖచిత్రంతో వెలువడిన ఆంధ్ర సచిత్ర వారపత్రికలో డా॥ సి నారాయణరెడ్డిగారి నక్షత్రాలు మొలుస్తాయి" కవిత బాగుంది సెక్సు ఎడ్యుకేషన్' శీర్షికలో వివిధ పాఠకుల అభిప్రాయాలు కూడా చాలా ఆర్షణీయంగా వుత్సాహంగావుంటున్నాయి

-పరిమళ, రాయగడ

★ ★ ★

6-12-86 సంచికలో ప్రచురించిన సెక్స్ ఎడ్యుకేషన్ అవసరమా? అను కొత్త శీర్షిక చాలా బాగుంది హీరోయిన్ విజయశాంతి సమాధానాలు ఎంత త్వరగా వస్తాయని వచ్చే వారం పత్రికను గూర్చి ఎదురు చూస్తున్నాము

-గోలి శ్రీనివాసరావు,
-గోలి అప్పలస్వామి, చిట్టివలస

★ ★ ★

6-12 జూన్ 86 సంచిక 'సుమలత' ముఖచిత్రం ఎంతో బాగుంది సెక్స్ ఎడ్యుకేషన్ అవసరమా? అన్న శీర్షిక చాలా విజ్ఞానదాయకంగా ఉంది

నా అభిమాన తార "కుమారి విజయశాంతి

# ఉత్తరాలు..

( 4 వ పేజీ తరువాయి)

సమాధానాలు శీర్షిక ప్రవేశపెట్టినందులకు ధన్యవాదాలు

-పోలోజు వెంకటాచారి,
హైదరాబాదు

## వ్యాసాలు

6-12 జూన్ సంచికలో చెర్నోబుల్ - బరువు నీరు గ్రాఫయిట్ -ప్రమాదము . హైలైట్

-దువ్వాడ శ్రీకాంత్, కాశీబుగ్గ

## కథలు

ధర్భా ప్రభాకరశర్మ గారి కథ "తిరిగి రాలేని వసంతం మా కుటుంబమంతటికీ బాగా నచ్చింది ఆడదానికి ఆడదే శత్రువు అని ఋజువు చేసింది

-చింతా శ్రీనివాస్, కాకినాడ

★ ★ ★

6-12 జూన్ సుమలత ముఖచిత్రంతో వెలువడిన ఆంధ్ర సచిత్ర వారపత్రిక చాలా ఆకర్షణీయంగా ఉంది సినిమా (యు)', 'మిథ్యాబింబాలు', పునర్జన్మ కథలు చాలా బావున్నాయి

-నాగండ్ల వెంకటేశ్వరరావు, రమేష్,
దోర్నకల్

## హైదరాబాద్ నోట్ బుక్

6-12 జూన్ సంచిక హైదరాబాద్ నోట్ బుక్‌లో మన ముఖ్యమంత్రిగారు చెప్పిన విషయాలు ఎంతో సమంజసంగా ఉన్నాయి ఇంతవరకు ఏ ముఖ్యమంత్రి ఇంత నిష్కర్షగా చెప్పలేదంటే అతిశయోక్తి కాదు. మన దేశంలో సెక్యూలరిజం అంటే చివరకి మైనారిటీలు, మెజారిటీ నోరు కొట్టి ప్రివిలేజెస్'ని రైటు'గా భావించే స్థితికి వచ్చింది. శెలవుల విషయంలో సూచన చాలా సమంజసంగా ఉంది మనదేశంలో శెలవుల్ని సద్వినియోగం చేసుకొనే అవకాశం లేనప్పుడు ఈ శెలవలన్ని వృధా ఆదివారం ఆఫీసులకి - ఇంకో రోజు దుకాణాలకి పెడితే బజారు పన్లు చేసుకోడానికి వీలుగా ఉంటుంది శెలవులు ఎంత తగ్గిస్తే అంత మంచిది ఆఫీసులలో పనులు కాక జనం ప్రతి ఆఫీసులో పడిగాపులు పడి ఉండటం మన అధికారులు కళ్లతో చూస్తూ కూడా పట్టించుకోరు ఈ దురవస్థ తొలగిననాడే నిజమైన రామరాజ్యం

-క రామారావ్,
హైదరాబాద్

## పబ్బం గడుపుకునే దెవరు?

ఆంధ్రపత్రిక మే 23-29 సంచికలో ఇద్దరూ ఉద్యోగస్తులైతే శీర్షికన డా. పద్మనాభన్, కమలగార్లు "భార్యాభర్తలిద్దరూ ఉద్యోగాలకు వెడుతూ ఇంటిని పిల్లల్ని ఏ వంటవారికో పనిపిల్లలకో అప్పజెప్పి వెడతారు వారి పబ్బం గడుపుకోవటానికి ప్రయత్నిస్తారు కానీ, తల్లిదండ్రులు చూపించే శ్రద్ధని డబ్బుకోసం కక్కుర్తి పడేవారు చూపించ లేరు కదా" అని వ్యాఖ్యానించారు

అసలు పనివారి మీద పిల్లల్ని వదిలి పబ్బం గడుపుకునే దెవరు? నిజమైన డబ్బు కక్కుర్తి ఎవరిది? తల్లి తండ్రులు చూపించే శ్రద్ధ ఎవరిపైన? డబ్బుపైనా? పిల్లలపైనా? వర్తమానాన్ని వదిలేసి భవిష్యత్తు మీద 'శ్రద్ధ' చూపిస్తే ఫలితాలు అందుకు తగ్గట్టే ఉండచ్చు. పనివారిని పబ్బం గడుపుకునే వారిగా, డబ్బు కక్కుర్తి వారిగా చిత్రించడం నిజంగా శోచనీయం సోకాల్డ్ మేధావి వర్గానికి చెందిన ఈ డాక్టర్ జంట అభిప్రాయాలు నిరసించదగ్గవి.

–రాంబాబు, ఏలూరు □








*Printed and Published for Nageswara Rao Estates Private Ltd., by S Nageswara Rao at the Andhra Patrika Press, Gandhinagar, Vyayawada-3, Editor: S Radhakrishna; Phones :- Business : 61247, 61248, Editorial: 75667*

# భారతి

సాహిత్యాభిమానులకి ★ చక్కటి అవకాశం!

## చందాదారుగా చేరండి!

## ఆదా చేయండి రు 11 దాకా!

ఏజంటు ద్వారా భారతి సంవత్సరం చందా రు. 48.

పోస్టు ద్వారా అయితే భారతి సంవత్సరం చందా రు. 51.

కాని మీరు రు 40 ముందుగా ఒకేసారి చెల్లిస్తే మీకు ఒక సంవత్సరం పాటు భారతి అందుతుంది!

★ అంటే రు. 11 దాకా ఆదా చేసుకోవచ్చునన్న మాట!

రు. 40 చందా మొత్తాన్ని "ఆంధ్రపత్రిక" (గాంధీనగర్, విజయవాడ)కి మని ఆర్డరు ద్వారాగాని, డిమాండు డ్రాఫ్టు ద్వారాగాని పంప ప్రార్థన. ఏజెంటుకి గాని ఇతరులకి గాని చెల్లించ వద్దని మనవి.

ఈ క్రింది కూపనుని నింపి డిమాండు డ్రాఫ్టుతో గాని, మనీ ఆర్డరుతో గాని జతపరచి పంపాలని మనవి.

★ మీరు ఉన్నచోట ఏజెంటు ఉంటే ఏజెంటు ద్వారా భారతి సరఫరా చెయ్యబడుతుంది.

★ ఏజంటు లేకపోతే భారతి మీకు పోస్టులో అందుతుంది!

★ చందా మొత్తాన్ని ఇతరులకి ఇవ్వరాదు! నేరుగా ఆంధ్రపత్రికకే చెల్లించాలి!




---

నేను "భారతి" మాస పత్రికకు చందాదారునిగా చేరదలుచు కున్నాను. చందా పైకము రు. 40 డి. డి./ఎం. ఒ. ద్వారా పంపుతున్నాను.

పేరు : Saraswati Niketanam

చిరునామా : Vetapalem

[signature]

చందాదారుని సంతకం

Regd. No. H/VJ-41 ANDHRA SACHITRA VARA PATRIKA
4-10 JULY 86